# శ్రీ లక్ష్మీ నిధి

**ఇలా అందుతుంది**

లెక్కగా ఉండటం... అందర్నీ నమ్మకపోవటం...
ముందు జాగ్రత్త...వృత్తిపై అంకితభావం... స్నేహం...
జ్ఞానం...గుడ్‌విల్...సంతృప్తి



## మైథిలీ వెంకటేశ్వరరావు

**శ్రీ లక్ష్మీ నిధి**

**మైథిలీ వెంకటేశ్వరరావు**

**ప్రథమ ముద్రణ:**
**మే 2011**



## నా ఈ పుస్తకం

ఆధ్యాత్మిక భక్త కోటికి అత్యంత తక్కువ ధరతో పుస్తకాలను అందిస్తూ నిజమైన జ్ఞానయజ్ఞం చేస్తున్న తిరుమల తిరుపతి పుస్తకవిభాగానికీ, గోరఖ్‌పూర్ పుస్తక విభాగానికీ –

– మైథిలీ వెంకటేశ్వరరావు



## మీకు కూడా ఈ లక్ష్మీ నిధి

■ ధనాన్ని ధర్మ, న్యాయ, పూజా కార్యాలకు ఉపయోగించేవారికి.

■ ఆపదలో స్నేహితులనీ, బంధువులనీ ఆదుకున్న వారికి.

■ విద్యాదానం చేసిన వారికి.

■ పక్క వాడి కష్టాన్ని దోచుకోనివారికి.

■ భార్యకి నగలూ, చీరలూ కొనిచ్చి ఆపై తన సుఖాలను చూసుకునే వారికి.

■ భార్య సంపాదనతో తాను విలాసంగా బ్రతకనివానికి.

■ నమ్మిన వార్ని ధనం విషయంలోనే కాదు మరే విషయంలోనూ మోసం చెయ్యనివానికి.

■ పనిచేసే వారి సకల కష్టసుఖాలను గమనించేవారికి.

■ ఈగో (అహం) జ్యేష్టాదేవికి పర్మినెంట్ అడ్రస్. దాన్ని డిలీట్ చేసిన వారికి.

■ స్నేహితులనీ, బంధువులనీ, హితులనీ దూరం చేసుకోని వారికి.

■ ఈ ప్రపంచంలో అత్యంత కష్టమైనపని డబ్బు సంపాదించటం. అతి తేలికైన పని కూడా ధనం సంపాదించటమే. అలాగే డబ్బు విషయంలో తేలికగా మోసం చెయ్యగలిగేది ఓ కళాకారుడ్ని మాత్రమే. అతను నటుడు కావచ్చు, సంగీత సాహిత్యాలకి సంబంధించిన వాడై ఉండచ్చు, చిత్రకారుడు కావచ్చు, విద్య నేర్పే గురువు కావచ్చు. అలాంటివారిని మోసం చేయని వారందరికీ.

■ ప్రతి గృహంలోని శ్రీమహాలక్ష్మీదేవి అనగా ఆ ఇంటి ఇల్లాలికి –

మహాసముద్రాన్నయినా ఈదగలిగే శక్తినిచ్చి సంసారమనే సాగరాన్ని ఈదటంలో ప్రతిక్షణం పరీక్షలు పెట్టే ఆ లక్ష్మీ నారాయణులకు

– ఈ లక్ష్మీనిధి అర్పితము

– మైథిలీ వెంకటేశ్వరరావు

Mistake is like a single page in book of life. Relation means dictionary of life. Donot loose book because of single page.

దీన్ని పాటించినవారి
గృహంలోకి లక్ష్మీదేవి
గజ్జలశబ్దం చేసుకుంటూ
ప్రవేశిస్తుంది

**ఇదీ వరుస........**

■■■





# శ్రీ లక్ష్మీ నిధి



## శ్రీలక్ష్మీదేవి జన్మించిన రోజు

■ ఫాల్గుణ మాసం, ఉత్తరా నక్షత్రంలో సిరిబోణి, ఆదిలక్ష్మి, ధాన్యలక్ష్మి, ధైర్యలక్ష్మి, గజలక్ష్మి, సంతానలక్ష్మి, విజయలక్ష్మి, విద్యాలక్ష్మి, ధనలక్ష్మి అయిన క్షీరసముద్ర రాజ తనయ సముద్ర మధనంలో అవతరించింది.



## కలువపువ్వు ధరించిన లక్ష్మీదేవి

■ శ్రీమహాలక్ష్మీదేవి కలువ పువ్వులని పట్టుకుని ఉంటుంది. కలువ పువ్వు పరిపూర్ణమైన స్వచ్ఛతకూ, సంతానవృద్ధికీ చిహ్నం. పక్కనుండే ఐరావతము వైభోగానికీ, విజ్ఞానానికీ చిహ్నం.







## ఆదిలక్ష్మికి ఏ రోజులన్న ప్రీతి

■ శ్రీమహాలక్ష్మికి గురువారమన్న ప్రీతి. మార్గశిర మాసంలో గురువార పూజలు మరింత శ్రేష్ఠమైనవి. ఆ రోజు పూజా మందిర ప్రదేశమును గోమయంతో అలికి, ముగ్గులు వేసి లక్ష్మీదేవిని పూజిస్తే సంపదలు కురియటం తథ్యం.

■ మార్గశిర మాసంలో శుక్లదశమి గురువారం శ్రీమహాలక్ష్మి వ్రతమైన సుదశా వ్రతము లక్ష్మీదేవికి అత్యంత ప్రీతికరమైనది.

■ శ్రీమహాలక్ష్మికి నివేదించే నైవేద్యాలుగా నూనెను ఉపయోగించి చేసే వాటిని పెట్టరాదు.



## ధైర్యమే ధనం

■ పిరికివాని వద్ద ధనముండదు. వ్యవహారాల్లో సాటివృత్తివారు చేసే పనుల వల్లా, చర్యల వల్లా భయపడితే పోయేది ధనం. మీలో తప్పులేకుంటే మీరు దేనికయినా సిద్ధం అనే అభిప్రాయం అవతలవారిలో వచ్చినప్పుడే మీరు గెలవగలరు. అదే భయస్థుడని తెలిస్తే మీ వనరులన్నీ వారి పాలవుతాయి. వృత్తిలో మహాసమస్యలు వస్తాయి. తద్వారా ధనం పోతుంది.

ధనం పోవటమంటే సుఖము పోవటము. నలదమయంతుల గాథ తెలిసే ఉంటుంది. రాజ్యము పోయినా, కట్టుకోవడానికి బట్ట కూడా లేకపోయినా, సకల సర్వ సంపదలు పోయినా నలుని ధైర్యం పోలేదు. ఆ ఒక్కటి వల్ల అన్నింటినీ తిరిగి పొందాడు. మీరూ అలా ఉంటే ఏమైనా, ఏదైనా సాధిస్తారు. రూపాయి నుంచి కోట్లకి ఎదగటమే కాదు, ఆ కోట్లుపోయినా తిరిగి అవే కోట్లు సంపాదించటమే అసలు సిసలు మొగతనం.



## కోపమే సుఖాలనూ, ధనాన్నీ పోగొడుతుంది

■ వ్యాపారంలో గానీ, వ్యవహారంలో గానీ కోపం పనికిరాదు. మీరు కోపస్వభావంతో వుంటే మీ క్రిందివారు భయపడతారు. ఆ భయంతో సరైన నిర్ణయం తీసుకోలేరు. ఒకటి చేయబోయి మరొకటి చేస్తారు. తద్వారా నష్టం వచ్చేది మీ సంస్థకే. మీరు ఆవేశపరులైతే టాలెంట్ ఉన్నవాళ్ళు మీతో పనిచెయ్యటానికి ఇష్టపడరు. కోపం సమస్యలని సృష్టిస్తుంది. తద్వారా ధనం తరుగుతుంది. అలా ఆవేశపడినందుకే వశిష్ఠుడు కొంగగా మారాల్సి వచ్చింది. ధనమనే తపఃశక్తిని పోగొట్టుకోవాల్సి వచ్చింది.



## లక్ష్మీదేవి ఇంట్లోకి రావాలంటే

■ ప్రధాన ద్వారం తెరిచి, మిగతా తలుపులన్నీ వేసి ఆపై లైట్లు వేయాలి.

■ లక్ష్మీదేవి వచ్చిన గుమ్మం నుంచే వెళ్ళాలనే నియమం లేదు.

■ గృహస్థులే కాదు గృహము కూడా శుచీ, శుభ్రతతో ఉంచాలి. ముంగిట్లో కూడా లక్ష్మీకళ కనపడాలి. అప్పుడే లక్ష్మీదేవి ముంగిట్లోంచి ప్రధాన ద్వారం గుండా ఇంట్లోకి ప్రవేశిస్తుంది.

■ గుమ్మం వద్ద అటూ, ఇటూ చెప్పులు లక్ష్మీదేవి వెనక్కి మరల్చే శక్తులు.

■ గుమ్మం లక్ష్మీ పీఠం. కాలితో తొక్కి లోనికి, బైటికి వచ్చి వెళ్తుండకూడదు.

■ ఎవరైనా డబ్బులిస్తే వేళ్ళను నోటితో తడిచేసుకొని లెక్కించవద్దు. అలా చేస్తే దోషం.







## శ్రీమహాలక్ష్మి నివాసస్థానాలు

■ సత్యవంతులలోనూ, శ్రీవిష్ణుభక్తులలోనూ, సలక్షణమైన గృహంలోనూ, వీరత్వము గలవారిలోనూ ఇంకా జయధ్వజమునందూ, ఆవుల యందూ, ఛత్రచామరముల యందూ, యజ్ఞవాటికల యందూ, తామరపువ్వుల యందూ, పంటభూములలోనూ, దీపములలోనూ, మంగళకరమైన వస్తువుల్లోనూ శ్రీవిష్ణుసతి లక్ష్మీదేవి నివాసముంటుంది.

మరియు ఇంటి ఇల్లాలి చిరునవ్వులో...తులసిచెట్టు ఉన్న గృహంలో.... గోవులున్న గృహంలో, అతిథులను ఆదరించే నివాసంలో, ఇంకా ధాన్యము నందూ, ఓర్పు సహనం గల స్త్రీ యందూ, ఉసిరి చెట్టు నందూ, గొబ్బెమ్మల యందూ, కలువల యందూ, పద్మముల యందూ, తెల్లపావురాల యందూ, కన్యల యందూ, కళ్ళాపి చల్లి ముగ్గులు పెట్టిన గృహమునందూ, జీవహింస చేయని వారి ఇంటా శ్రీలక్ష్మీదేవి నివాసముంటుంది. స్థిరత్వం లేని లక్ష్మి నిలకడగా ఆ ఇంట తిష్ఠవేసి ఉంటుంది.



## సంపద నడిచి రావాలంటే...

■ భార్యవల్లా, స్నేహితులవల్లా, బంధుహిత శ్రేయోభిలాషుల వల్లా రావటానికి ఒక్క శాతం మాత్రమే అవకాశముంది. కాని 99శాతం ధర్మబద్ధమైన, నియమబద్ధమైన జీవితం అనగా క్యారెక్టర్ గల వారికి సంపదలు అవకాశాల రూపంలో నడిచి వస్తాయి.

మీలో అన్నీ ఉన్నా, ఓ అద్భుతాన్ని సృష్టించే మేధస్సు ఉన్నా క్యారెక్టర్ లేకపోతే వెలుగులోకి రాలేరు. ధనం ద్వారా పొందే మహా సుఖాలను మీరు పొందలేరు.



## శ్రీశాంతి స్వరూపిణి లక్ష్మీదేవికి నచ్చనివి

■ సూర్యోదయ సమయాన భుజించటం, కాలివేళ్ళతో నేలను రాయటము, పగటి పూట నిద్రించటము, పగలు ముఖ్యంగా మైథునం ఇవన్నీ చెయ్యటం ద్వారా లక్ష్మీ అనుగ్రహం కలగకపోగా కోపాన్ని కలిగిస్తాయి.

■ శుచి, శుభ్రతే శ్రీమహాలక్ష్మికి అసలు సిసలు పూజ...అది లేని వారినెన్నటికీ కరుణించదు.

■ ఎంత సహనంగా వుంటే వార్ని అంతగా ధనలక్ష్మి కరుణిస్తుంది. సహనం లక్ష్మి అయితే కోపం జ్యేష్ఠాదేవి.



## ధనం ఎంత శక్తివంతమైనది

■ పరీక్షిత్తుణ్ణి కాపాడటానికి వస్తున్న శృంగి అనే వైద్యుడికి తక్షకుడు ధనమిచ్చి వెనక్కి పంపుతాడు. ఆపై తక్షకుడు పరీక్షిత్తును చంపేస్తాడు.

■ ఆ ధనం కోసమే సోదరుడని కూడా చూడకుండా కుబేరుణ్ణి తరిమి తరిమి కొట్టి సంపదలను లాక్కుంటాడు రావణాసురుడు.

■ శ్రీమహావిష్ణువంతటివాడు కుబేరుని వద్ద చేయి చాచాల్సి వచ్చింది.

■ ఆ ధనమును పోగొట్టుకునే సత్యహరిశ్చంద్రుడంతటివాడు స్మశానానికి కాపలా కాసాడు. భార్యనూ, పుత్రుణ్నీ పనిమనుషులుగా చేశాడు.

■ రాజసూయ యాగమపుడు పాండవుల సంపదలు చూసి మహాచక్రవర్తయిన దుర్యోధనుడికి సహితం కళ్ళుకుట్టాయి. ఆ కసితోనే అందర్నీ అడవులపాలు చేశాడు.





■ త్రిశిరసుడంతటి ధర్మమూర్తినీ, తపోమూర్తినీ ఇంద్రుడు తక్షు అను వానికి లంచమిచ్చి చంపిస్తాడు.

■ యముణ్ణి ప్రార్థించి, ప్రాధేయపడి పోయిన ప్రాణాన్ని వెనక్కి తేవచ్చునేమోగానీ మీ నుంచి పోయిన ధనాన్ని తపస్సు చేసినా తీసుకురాలేము.

■ అలాంటివాణ్ని చూసే అంటాము, ఒకప్పుడు బాగా బ్రతికాడు



## ఆరోగ్యలక్ష్మిని అందించేవి

■ ఆహారంలో సంపద దాగి ఉంది. సత్త్వగుణాలను పెంచే ఆహారం మనసుకి హాయినిస్తుంది. ధనాన్నీ, మనఃశాంతినీ పోగొట్టకుండా ఉంచుతుంది.

■ చమురుగలవీ, పాయసము, చారు, దంతాలతో కొరికి తినేవి, నాలుకతో చప్పరించే లేహ్యములు ఇవన్నీ ఆయుష్షును పెంచుతాయి. సంపదను దూరం చేయవు.

■ ఇంకా పాలు, కొబ్బరినీళ్ళు, మజ్జిగ, పళ్ళు ఇంకా తీగెల ద్వారా పండే వాటి యందు ఆరోగ్యలక్ష్మి ఉంటుంది. అరిటాకు భోజనము సాక్షాత్తు శ్రీమహాలక్ష్మీదేవి ప్రసాదమే.



## ధనం ఎంతటి పనైనా చేయిస్తుంది

■ హరిశ్చంద్రుడంతటి వాడు ధనమిచ్చి ఓ బాలుడ్ని యజ్ఞపశువుగా బలి ఇచ్చి తన వ్యాధిని పోగొట్టుకోవాలను కున్నాడు.

■ హైహయులు ఆ ధనం కోసమే భృగువంశ విప్రులెందరినో హతమార్చారు. గర్భవతులనే జాలీ, దయా కూడా లేకుండా కడుపుల మీద తన్నారు.

■ అలాంటి మహాధనంతోనే కార్తవీర్యుడు యజ్ఞాలూ, దానాలూ చేసి మహాకీర్తిని పొంది పుణ్యలోకాలను చేరాడు.

■ ధనం ధైర్యమిస్తుంది. సుఖమిస్తుంది. అధికారం ఇస్తుంది. అహం కూడా ఇస్తుంది. ఆ అహంతోనే ఇంద్రుని భార్య శచీదేవిని తనతో శయనించమన్నాడు నహుషుడు. అలా చేసినందుకే సర్పంలా జీవించాల్సి వచ్చింది. ధనం పెరిగే కొద్దీ ధర్మం పెరగాలి. అప్పుడే ధనం ద్వారా కలిగే సుఖాలను పొందగలరు.



## ఎంతటివార్ని అయినా ధనం కృంగదీస్తుంది

■ మహాసామ్రాజ్యాన్ని ఏలిన ధృతరాష్ట్రుడు పాండవులు పెట్టిన ధర్మపిండం తినాల్సి వచ్చింది. తన పుత్రులైన కౌరవుల శ్రాద్ధకర్మలకు కూడా ధృతరాష్ట్రుడు చేయి చాపి విదురుడి చేత చెప్పించి పాండవుల వద్ద ధనాన్ని అడుక్కోవాల్సి వచ్చింది.

■ ద్రోణాచార్యుడంతటి వాడు తన బిడ్డ అశ్వత్థామ ఆకలి కోసం ఓ పాడి ఆవునన్నా ఇమ్మని పాంచాలరాజు వద్దకెళ్ళి అభ్యర్థించి భంగపడ్డాడు.

■ గర్భవతయిన భార్య పురిటి కోసం మౌని అనే ముని ఆ దేశరాజు వద్దకెళ్ళి ధనం అభ్యర్థించి పరాభవానికి గురికావలసి వచ్చింది.

■ ధనం అంత గొప్పది. ఉన్నప్పుడు తెలీదు. లేనప్పుడే అసలు సిసలు స్వరూపం తెలుస్తుంది. నరకలోకంలో శిక్షల కన్నా పెద్దదీ, భయంకరమైనదీ దరిద్రము. అంతకుమించిన నరకం లేదు. ఉంటే అంతకుమించిన స్వర్గం లేదు. కాన ధనాన్ని సంపాదించాలి. నిలువ ఉంచుకోవాలి.







## 'శ్రీమహాలక్ష్మి' అనగా

■ శ్రీమహాలక్ష్మిదేవిలో శ్రీ అంటే శోభ కలిగినది. ఇంకా కాంతిని గలిగినది. సకల విద్యలనూ ప్రసాదించేది. 'లక్ష్మి' అంటే సంపదలను ఇచ్చునదీ అని అర్థం. సంపదే సుఖాలకీ, కీర్తికీ మూలము.



## ఏది శుభప్రదమైనది, లక్ష్మీప్రదమైనది

■ దిక్కులలో తూర్పు దిక్కు శుభప్రదమైనది. పురాణాలలో శ్రీభాగవతం గొప్పది. సముద్రాలలో పాలసముద్రం గొప్పది. నదులలో గంగానది గొప్పది. ఆశ్రమాలలో గొప్పది గృహస్థాశ్రమము. కటాక్షాలలో కమలనివాసి శ్రీలక్ష్మీ కటాక్షము గొప్పది.



## మీ వృద్ధాప్యంలో మీకున్న ధనం మీకు అందుతుందా

■ లక్షలూ, కోట్లు సంపాదించారు. వయసు వేడిలో మీరు చెప్పిందే వేదం. సకల కుటుంబసభ్యులకూ మీరంటే, మీ మాటంటే శిరోధార్యము. వయసయిపోయింది. పరిస్థితులు మారవచ్చు. మీ కోటానుకోట్ల ధనంలో ఓ రూపాయి కూడా మీకు అందని పరిస్థితి రావచ్చు. మహాసంపదలూ, మహారాజ్యమిచ్చిన యయాతి ముసలితనంలో పుత్రులని తన కష్టం పంచుకోమంటే ఏ ఒక్కరూ ముందుకు రాలేదు. అందుకే ఎవరికి ఇవ్వాల్సింది వారికివ్వాలి. తనకి కావాల్సింది తానుంచుకోవాలి.

■ మీది అనుకున్నది మీ దగ్గర భద్రంగా ఉంచుకోండి. అలా నిర్లక్ష్యంగా ఉన్నందుకే శ్రీదేవీ భాగవతంలో సమాధి అనే వైశ్యుడు తన పిల్లల చేతా, భార్య చేతా ఇంట్లోంచి గెంటివేయబడ్డాడు.



## పువ్వులు మహాలక్ష్మికి నివాసము

■ అలాంటి లక్ష్మీ నివాసస్థానమైన పువ్వులను నిర్లక్ష్యంగా పడేయటము, అపరిశుభ్రంగా తాకటం చేయరాదు. మహర్షి ఇచ్చిన పూలమాలను శచీపతి అవమానించటం వల్లనే సకల సంపదలూ పోగొట్టుకున్నాడు. నానాబాధలు పడ్డాడు. చివరకు దేవతలూ, రాక్షసులూ కలిసి క్షీరసాగర మథనం చేస్తే గాని దేవతలకి సంపదలు కలుగలేదు. పూలను నిర్లక్ష్యంగా పడేస్తే, చూస్తే, సంపదలు పోతాయి. సర్వభ్రష్టుడవ్వాల్సి వస్తుంది.

## 'మ' కారములను విడిస్తేనే సంపద దరిచేరుతుంది

■ 'మ' కారములనగా మద్యం, మాంసం, మగువ. ఇవే ధనాలని హరించేవి. ఇవి ఉన్న దగ్గర శ్రీమహాలక్ష్మి ఉండదు. ఎప్పుడెప్పుడు వెళ్ళిపోదామా అని వేచి ఉంటుంది. సమయం చూసుకొని శెలవు తీసుకుంటుంది. ఈ 'మ' కారముల వల్లే కీచకుడూ, దుర్యోధనుడూ, జరాసంధుడూ తమతమ వైభోగాల్నీ, సకల సంపదలనూ, హితులనూ వదులుకోవాల్సి వచ్చింది.

## శ్రీమహాలక్ష్మి కుటుంబము

■ శ్రీమహాలక్ష్మీదేవి గోత్రం భార్గవి, భర్త శ్రీహరి. తల్లి పాలసముద్రం. తండ్రి భృగుమహర్షి, సోదరుడు చంద్రుడు, కోడలు సరస్వతి, మనవడు నారదుడు. ఇక పుత్రులు ఆనందుడూ, కర్దముడూ, చిక్లీతుడు. అక్క జ్యేష్ఠాదేవి, ఆమె భర్త శనీశ్వరుడు.





## శ్రీలక్ష్మీదేవి మీ గృహానికి రావాలంటే

■ మహామహిమలనూ, శక్తులనూ, సంపదలనూ ఇచ్చే ఏకాదశీ వ్రతము చెయ్యటం ద్వారా అనగా తన పతిని పూజించినందుకు శ్రీమహాలక్ష్మి స్వయంగా ఆ గృహానికొచ్చి ధూపదీపములను చూసి సంతోషించి వరాలను ఇస్తుంది. ఏకాదశీవ్రతం ఎలా పడితే అలా కాకుండా శ్రీనారద పురాణంలో వున్న దాని ప్రకారం చేయాలి.



## పెట్టుబడికి పునాది నమ్మకం

■ ఈ ప్రపంచంలో అన్నింటికన్నా అతికష్టమైన పని డబ్బులు సంపాదించటం. అతి తేలికయింది కూడా డబ్బులు సంపాదించటమే. ధనసంపదలు పొందాలంటే మన చుట్టూ వున్న ప్రపంచమంతా మనల్ని నమ్మాలి. వందకి నమ్మనివాళ్ళు కూడా మీ నిజాయితీని గుర్తించి మీకు అప్పు ఇవ్వాలి. దానికి ఉండాల్సిన అర్హతే నమ్మకం. మీరు మాట ఇస్తే తప్పరన్న ఆ ఒక్క గుణమే అపార ధనాన్ని ఇప్పిస్తుంది. కొత్తగా పెళ్ళయి కట్టుబట్టలతో పరాయి ఊరుకొచ్చిన నా మిత్రుడు ప్రస్తుతం మంచి పొజిషన్‌లో ఉన్నాడు. ఏ విధంగా అంటే–

పది రూపాయలిచ్చేవాడు లేని ఆ ఊళ్ళో ఓ దగ్గర అయిదు వందలు అప్పు చేశాడు. అదీ చెప్పిన సమయానికి, అన్న రోజుకి తీసుకెళ్ళి ఇచ్చాడు. ఆ అయిదువందల తర్వాత వెయ్యి, ఆపై పదివేలు....చివరకు సదరు వ్యక్తి పదిలక్షలు అప్పిచ్చే నమ్మకాన్ని పొందాడు. దానికి వాడేం చెప్పాడో తెలుసా? నిజాయితీ సంగతి పక్కనపెట్టు, జీవితంలో ఎదగడానికి అదో క్వాలిటీ అని చెప్పాడు. టాటాలూ, బిర్లాలూ, రిలయన్స్ లాంటి కంపెనీలు ఆ నమ్మకాన్ని కలిగించే, ఉపయోగించే లక్షల కోట్లు ప్రజల చేత పెట్టుబడి పెట్టిస్తున్నారు.



## లెక్కించి ఏట్లో పారెయ్యాలి

■ఎంచి ఏట్లో పారెయ్యమని మన పెద్దలు చెప్పిన మాట చద్దిమూట. ప్రతీది లెక్క చూసుకోవాలి. అలా కాక మీరు నిర్లక్ష్యంగా ఉన్నారని అవతలివారికి తెలిస్తే వాళ్ళు మిమ్మల్ని మోసం చేద్దామనే మీ వద్దకు వస్తారు. ఈజీ మనీ మీ నుంచి వస్తుందంటే చుట్టూ మీకు రాంగ్ డైరెక్షన్ ఇచ్చేవారు చేరిపోతారు. దానితో సమస్యలు...ఆర్థికంగా నష్టపోవటం.

కేవలం మీరు లెక్కవేసుకోరు అన్న చిన్నపొరపాటు బ్రహ్మరాక్షసిగా మారి మిమ్మల్ని అథఃపాతాళానికి నెట్టి వేస్తుంది. స్త్రీ కోసం, ధనం కోసం ఎవరైనా ఏదయినా చేస్తారు. కావాలనుకుంటే మీ మీ వ్యవహారాల్లో టెస్ట్ చేసుకోండి. ఇప్పటివరకూ ఎంత నష్టపోయిందీ తెలుస్తుంది.



## మద్యం, జూదం

■బలహీనతలు మానవసహజం. కానీ ఆ బలహీనతలు తెలియకూడని వారికి తెలిస్తే పగపట్టిన పాము ఏ వైపు నుంచి వచ్చి కాటు వేస్తుందో తెలియనట్టు మిమ్మల్ని ఆ బలహీనతలనే ఉచ్చులో వేసి బిగిస్తారు. మీరెంతటి ధనవంతులైనా, తెలిసేసరికి అంతా కరిగిపోతుంది. ధర్మరాజు జూద బలహీనత తెలిసే దుర్యోధనుడు పిలిపించి మాయా జూదంతో సర్వం పోగొట్టి అడవులకి పంపాడు.

ఆ జూదం వల్లే నలదమయంతులు కష్టాలుపడ్డారు. జూదం ఆడేవాళ్ళందరికీ తెలుసు ఖచ్చితంగా పోతాయని. అయినా వస్తుందని ఆశ. ఆ ఆశే సర్వం పోగొడుతుంది. పోయిన చోటే వెతకాలి. నిజమే. కొన్ని ప్రదేశాల్లో పోయినవి తిరిగి వచ్చినా స్వీకరించకూడదు. ప్రయత్నించకూడదు.







## ధన అహంకారమే దరిద్రుణ్ణి చేస్తుంది

■ధనాన్నీ, భార్యనీ నిర్లక్ష్యం చేస్తే దూరమవుతాయి. డబ్బులున్నప్పుడు ఆ ధన అహంకారంతో గొప్పకోసం, కీర్తికోసం విచ్చలవిడిగా ఖర్చుపెడితే మిగిలేది దుఃఖం. లక్షలు వేలు ఖర్చుపెట్టిన చేతులు వందరూపాయలకి కూడా చాపాల్సి వస్తుంది.

సంపద ఉన్నప్పుడు పక్కన చేరిన వారంతా మిమ్మల్ని హీరోగా చేస్తారు. వారి అవసరాలనీ, సరదాలనీ, వ్యసనాలనీ మీ మీద రుద్దుతారు. మీరే వారి జీవితంలా ప్రవర్తిస్తారు. అంతా అవగానే ఎవ్వరూ కనపడరు. అంతవరకైతే పర్వాలేదు. మీకే వ్యతిరేకంగా మాట్లాడతారు.

మీ శత్రువులతో, విరోధులతో చేరిపోతారు. ఆ శౌర్య అహంకారాలతోనే రాజులనుంచి మహాసంపదలు తెచ్చి ధర్మరాజు రాజసూయయాగం చేశాడు. సకలరాజకోటి చేత జేజేలు కొట్టించు కున్నాడు. నరదిష్టిని పొందాడు. నెలరోజుల్లోనే కట్టుబట్టలతో మాయాజూదంలో ఓడి అరణ్యవాసానికి సోదరులతో, ద్రౌపదితో వెళ్ళాల్సి వచ్చింది.



## స్త్రీ కంట కన్నీరు సంపద హీనతకి మూలం

■గృహంలోకానీ, వ్యాపార సముదాయంలోగానీ భార్య, కూతురూ, చెల్లెలూ, సేవకురాలూ ఎవరైనా సరే కంటతడిపెడితే శ్రీమహాలక్ష్మి అక్కడ్నించి వెళ్ళి తన అక్క జ్యేష్ఠాదేవిని పంపిస్తుంది.

■ గృహిణి కన్నీరు పదామడల వరకూ శాపం.

■ ఆడపిల్ల శపిస్తే వంద యాగాలు చేసినా ఆ శాపం తొలగదు.



## పక్కనున్నవారే మహాప్రమాదం

మనకి మంచి చేసినా పక్కవారే, అలాగే చెడు చేసినా వారే. ఎవరో రోడ్డుమీద వెళ్తున్నవాళ్ళూ, సాటి వృత్తిపరులూ మిమ్మల్ని మోసం చెయ్యలేరు. పక్కనే ఉండే వాళ్ళతో, మీ అనుపానులూ, బలహీనతలూ, రహస్యాలూ తెలిసిన వారితో తేడా వస్తే తట్టుకోవడం కష్టం.

వార్ని అలా మీకు వ్యతిరేకంగా ప్రవర్తించే విధంగా మీరు ప్రవర్తించవద్దు. అలాంటివాళ్ళని పక్కనుంచుకోవద్దు. మాట తేడాకే నాశనాన్ని కోరుకునే దగ్గరవాళ్ళతో తేడా వస్తే పదిరూపాయలు పోయినా నమస్కారం పెట్టి పక్కకి వచ్చేయండి. పగా ప్రతీకారాలకి పోతే నష్టపోయేది మీరే. వీరవనిత ఝాన్సీలక్ష్మీబాయి, టిప్పు సుల్తాన్ వంటి వీరులూ, శూరులూ ఓడిపోయింది నమ్మిన వారి వల్లా, పక్కనున్న వారివల్లే...



## డబ్బు దగ్గర మొహమాటం పనికిరాదు

వాడా? మనవాడేలే... ఇస్తాడులే... ఎప్పటికయినా ఉపయోగపడుతాడులే అని చూసీ చూడనట్టు పోతే అసలుకే మోసం వస్తుంది. తిరిగి ఇచ్చినప్పుడులే అన్న నిర్భయము అవతల వారిలో ఉంటుంది. కానీ అవసర సమయంలో మీ అవసరానికి అడిగితే వచ్చేది విరోధము. డబ్బు విషయంలో తీసుకునేటప్పుడే ఎప్పుడిస్తావ్ అని అడిగి అప్పు ఇస్తే అవతలవానికి భయముంటుంది. మీతో ఎంతోకాలం తన కార్యకలాపాలను చేస్తాడు. కుబేరుడు ఓ సందర్భంలో చెబుతాడు. అప్పు తీసుకునేటప్పుడు పడే ఆనందం ఇచ్చేటప్పుడు ఉండదు అని అందుకే శ్రీనివాసునితో పత్రం రాయించుకొని అసలు ఎప్పుడు కడతావని అడిగి ఆపై వడ్డీకి ఇష్టపడి ఇచ్చాడు.







## స్త్రీ విషయంలో ఎంతో జాగ్రత్త

వృత్తిలో మిమ్మల్ని ఎదుర్కోలేరు. అంకితభావం... పట్టుదల... శ్రమ. ఎవ్వరికీ అందనంత దూరంలో మీ పయనాన్ని సాగిస్తున్నారు. మీ తోటి వృత్తిదారులు మీ కీర్తి భరించలేకున్నారు. అలాంటప్పుడు వారు వేసే బాణమే, బ్రహ్మాస్త్రమే స్త్రీ. ఆ వలలో చిక్కుకుంటే సర్వం నాశనము. ఏమీ చేతకాని వాళ్ళూ, అసమర్థులూ చివరి ప్రయత్నంగా వేసే బాణం స్త్రీనే. ఆ మోహంలో చిక్కుకునే విశ్వామిత్రుడు, శంతనుడూ లాంటి వారు ఎందరో భంగపడాల్సి వచ్చింది. తిరిగి పూర్వస్థితికి రావాలంటే వారికి ఎంతోకాలం పట్టింది.



## నమ్మకండి... నమ్మినట్టు ఉండండి

లక్ష ఆర్థిక సంబంధమైన వివాదాలను పరిశీలించండి. ప్రతి దానిలోనూ 'నమ్మకం' అన్న పదం అంతర్లీనంగా ఉండి ఉంటుంది. ఓ వ్యక్తికి మీరు డబ్బులిచ్చి చెక్ తీసుకున్నారు. నమ్మేగా....అలా నమ్మి చెక్ లేకుండా డబ్బులిచ్చారు. గొడవ ఎవరితో వస్తుంది....చెక్ తీసుకొని ఇవ్వటం నమ్మినట్టుగా ఉండటము. చెక్ లేకుండా అప్పు ఇవ్వటం పూర్తిగా నమ్మటం. దేని ద్వారా మీ ధనం పోవటానికి ఆస్కారం ఉందో ఆలోచించండి. నమ్మకం ఒకే ఒక్కరి మీదుండాలి. ఆ పేరే భార్య. భార్యని తప్ప ఎవర్ని నమ్మినా ఎప్పుడో ఓసారి ఎవరో ఒకరి చేతిలో చావుదెబ్బ తినాల్సి వస్తుంది. ఆ దెబ్బ రుచి చూసేది మీరే కాదు. మీ భార్యాపిల్లలు కూడా....



## శ్రీసూక్తం ప్రకారం లక్ష్మీదేవిలెందరు

అష్టలక్ష్ములు కారు. షష్ఠలక్ష్ములేనని శ్రీసూక్తం సెలవిస్తుంది.

శుద్ధలక్ష్మి, మోక్షలక్ష్మి, జయలక్ష్మి, విద్యాలక్ష్మి, శ్రీలక్ష్మి, వరలక్ష్మి.



## వృథా చేయొద్దు

■అనారోగ్యం కలిగితే ఆ ధనం వుంటేనే వైద్యుడు వస్తాడు. ఆ ధనముంటేనే పిల్లలు గౌరవిస్తారు. ఆ ధనముంటేనే మీకు న్యాయపరమైన న్యాయము అందుతుంది. ఆ ధనం ద్వారా కీర్తీ, సుఖాలు, సంతోషము ఎన్నో కలుగుతాయి. అలాంటి ధనాన్ని సంపాదించటం ద్వారా భూమిపై స్వర్గసుఖాలను అనుభవించగలరు. అన్ని సుఖాలనిచ్చే ధనంలో పదిపైసలు కూడా వృథాగా పోకుండా చూసుకోవాలి. పదిపైసలే గదా అని అనుకుంటే...? అంత బ్యారేజీకి చిన్న రంధ్రమే కదా అని వదిలేస్తే ఏమవుతుందో అదే అవుతుంది.



## విజయరహస్యం గుప్పిట్లో

■వినూత్న దారిలో మీరెళ్ళి విజయం సాధించారు. తద్వారా ధనాన్ని పొందారు. ఉత్సాహం కొద్ది గానీ, గర్వంగా గానీ ఆ విషయం అవతలవారికి చెబితే ఆపై మీకు వచ్చేది సున్నానే.

వారంతా మీరేర్పరచిన దారిలో సునాయాసంగా వెళ్లి ఎవరిస్థాయికి తగ్గట్టు వారు సంపాదిస్తారు. ఇంకా పాడు చేస్తారు. ఎవరికీ ఆదాయం రాకుండా చేస్తారు. విజయరహస్యాన్ని చెప్పటం వల్ల నష్టం మీకే. శ్రీకృష్ణుడే మా అసలు సిసలు బలమని పాండవులు అందరికీ చెప్పి వుంటే భారతగాథ మరోలా వుండేది.

## లక్ష్మీదేవికి కోపాన్ని తెప్పించేవి

■మహాబద్ధకమూ, లొడాలొడా మాట్లాడటమూ, పీకల దాకా తినటమూ, గురువులనూ, పెద్దలనూ అవమానించటమూ, హింస చేయటమూ, అపరిశుభ్రతతో ఉండడమూ, అతి నిద్రా వంటివి వైకుంఠనివాసి శ్రీమహావిష్ణువు సతి శ్రీలక్ష్మిదేవికి కోపావేశాన్ని కలిగిస్తాయి.





## నేరస్థులతో స్నేహం వద్దు

■నేను చాలా నిజాయితీ పరుణ్ణి, అతను తప్పులు చేస్తున్నాడు. దానికీ, నాకేం సంబంధం అని అనుకుని పరిచయాన్ని మెయిన్‌టైన్ చెయ్యటం ద్వారా ఏదో ఓరోజు ఇబ్బందులు పడాల్సి వస్తుంది. తద్వారా కష్టాలు కొని తెచ్చుకోవాల్సి వస్తుంది. నేరం చేసేవారిది ఎంత తప్పో ఆ నేరం చేసేవారితో తిరగటం కూడా ఎంతో కొంత తప్పు. అంటే ఇన్‌డైరెక్ట్‌గా వాళ్ళ నేరాలని ప్రోత్సహిస్తున్నట్టే...ఏదన్నా జరగరానిది జరిగితే మీరు సమాధానం చెప్పాలి. తద్వారా మీకున్న పరపతి దెబ్బ తింటుంది. తద్వారా నష్టపోయేది మీరే. దుర్యోధనుడనే మహాక్రూరుడితో స్నేహం చేసినందుకు అంతటి దానవీరశూరుడైన కర్ణుడూ నేలరాలాల్సి వచ్చింది.



## అమ్మటంలోనే కాదు కొనటంలోనూ లాభం దాగి ఉంది

■మీ వృత్తికి సంబంధించిన మెటీరియల్‌నే తీసుకోండి. వాడు ఫోన్ చేయగానే పంపుతున్నాడుగా, అప్పిస్తున్నాడుగా, ఇలా అనుకునే వ్యాపారం చేస్తుంటే, కొనే విషయంలో మీరు నష్టపోతున్నట్టే. ఎవరూ ఊరికే అప్పు ఇవ్వరు.

డబ్బులిస్తే తీసుకునే వడ్డీకి మూడురెట్లు వేసి, అదీ కొంత నాశిరకం అంటగడతారు. ఎంతసేపటికీ అమ్మటం విషయాల్లో లాభం గూర్చి ఆలోచించే వారు కొనే విషయాల్లో ఇరవైశాతం నష్టపోతున్నారని చాలా మందికి తెలీదు. చాలా చిన్న విషయం అనుకుంటారు. ఇంట్లో ఆడవాళ్ళని అడగండి. బైట బండిలో కొనే కూరల ధరలకన్నా, మార్కెట్‌లో కొనే కూరగాయల విషయంలో రోజుకి పదిరూపాయలు తేదా వస్తుందని మార్కెట్ కెళ్ళి కొంటారు.

ఆ రకంగా రోజుకి పది...ఇంకా అనేక విషయాలు...అన్నీ కలిపితే ఎంత....ఇప్పటివరకూ ఎంత....అలాంటిది లక్షల్లో కొనుగోలు చేసే మీ కొనుగోళ్ళల్లో?



## ఒకే ఒక మదమే సర్వసంపదలనీ, సుఖాలనీ నాశనం చేస్తుంది

■ అహంకార మదం, ధనమదం, కామమదం, ఆవేశమదం అలా సకల మదాల వల్లే ధనం కోల్పోవాల్సి వస్తుంది. ఆ సకల మదాలు పుట్టేది ఒకే ఒక్కదాన్నుంచి. అన్నం నుంచి అన్నమదం పుడుతుంది. అనగా అతిగా తినటం వల్ల, ఆకలంటే తెలీకపోవటం వల్ల, వుంది కదాని పీకల దాకా తింటే కోల్పోయేది మీ సుఖాలనీ, తద్వారా వచ్చే అనారోగ్యాలూ ఇంకా ధనాన్ని కూడా....



## తొందరపడి మాట ఇవ్వద్దు

■ ఆవేశంలోనో, తొందరలోనో ఆ రేటు కిచ్చేస్తాననో, లేదా ఆ సమయానికి ఆ రేటుకి ఇస్తాననో మీరు కమిట్ అవ్వవద్దు. అలా తొందరపడ్డారో ఆపై ఆలోచించుకుంటే అంతా నష్టమే వస్తుంది. దాంతో అప్‌సెట్ అవ్వాల్సి వస్తుంది. వ్యాపారంలో, వ్యవహారంలో తొందరగా నిర్ణయం తీసుకోటము లాభమే.

కానీ తొందరగా నిర్ణయం తీసుకున్నాడని అవతలవారికి అనిపించాలి. అవతల వారిని తక్కువగా అంచనా వేసి మాట ఇవ్వటం ఒక్కోసారి అసలుకే మోసం వస్తుంది. ఏం కావాలో ఎంతకావాలో చెప్పండి అని హరిశ్చంద్రుడు తొందరపడి మాట ఇచ్చినందుకే విశ్వామిత్రుడికి సమస్త రాజ్యమూ వదలి భార్యాపుత్రులతో ఆ మహర్షి వెంట నడవాల్సి వచ్చింది. తనతో పాటు ఆలినీ, బిడ్డనీ అమ్ముకోవాల్సి వచ్చింది. పడరాని కష్టాలు పడాల్సి వచ్చింది.







## సంపదలు ఇవ్వలేవు

■ చాలామందికి తెలియని విషయం ఓ వైఢూర్యమో, ముత్యమో, పగడమో ఎంతవుతుందో తెలుసా? లక్షల్లో వున్నవారికి కూడా అవి కొనే స్థోమత వుండదు. ధనం కష్టపడటం వల్లా, వినూత్నంగా పని చేయటం వల్లా, కొత్తదనాన్ని చూపించటము వల్లా వస్తుంది.

చరిత్రలో, పురాణాల్లో, ఇతిహాసాల్లో ఎవ్వరైనా రాళ్ళ ఉంగరాలని పెట్టుకుని ధనం సంపాదించారేమో చూడండి. ఎవరూ లేరు. వృత్తిపై అంకితభావమే ఉన్నవాడ్ని చేస్తుంది. ఇలా చెప్పినందుకు రాళ్ళూ, రత్నాలూ అమ్మేవారు నాపై విరుచుకు పడవద్దు. పురాణ ఇతిహాసాల్లో ఎవరు అవి పెట్టుకొని సాధించారో చెప్పండి.



## నివాసంలో ఎలాంటి చిత్రపటం ఉంచటం లక్ష్మీప్రదం కాదు

■ గృహంలో గుర్రం పటం లేదా బొమ్మ ఉండడం వల్ల గృహం నుంచి శ్రీమహాలక్ష్మి వెళ్ళిపోతుంది. వైకుంఠంలో ఓసారి ఉచ్ఛైశ్రవమును చూసి లక్ష్మీదేవి తన పుట్టింటివారిని గుర్తుకు తెచ్చుకుంది.

శ్రీమహావిష్ణువు పిలిచినా పలకలేదు. వైకుంఠవాసుని కోపానికి గురైంది. దానితో లక్ష్మీదేవి శ్రీహరిని వీడి వైకుంఠం వదలి ఆడగుర్రంలా జీవించాల్సి వచ్చింది. శ్రీమహావిష్ణువు హయగ్రీవ గాథ పైదానికి సంబంధించినది.

## సౌమ్యలక్ష్మికి ఏవి ప్రీతికరములు

■ క్షీరసాగర తనయ శ్రీమహాలక్ష్మి పూజకు పాలతో చేసిన నైవేద్యాలు నివేదించాలి. ఆ పదార్థాలంటే శ్రీమహాలక్ష్మికి ప్రీతికరం. తన పుట్టినింటికి వెళ్ళినంత ఆనందంగా ఆ గృహానికి వస్తుంది.

## పాలసముద్ర నివాసిని లక్ష్మీదేవికి ఏవి ప్రీతికరములు?

■ శ్రీమహాలక్ష్మీదేవికి ఎరుపు రంగు వస్త్రములూ, ఇంకా అనేక పువ్వులూ, గంధమూ, ధూపదీపములన్న ప్రీతి. అలాగే శ్రీమహాలక్ష్మి పూజానంతరం ప్రసాదాన్ని నలుగురికీ పంచాలి.

■ అన్నింటికన్నా లక్ష్మీదేవికి అత్యంత ఇష్టమైన మంచి మాటలు మాట్లాడటం.

## రాళ్ళూ, రత్నాలూ కోట్ల ధనాశ మిత్రుడ్ని కూడా శత్రువుగా చేస్తుంది

■ ఎంత స్నేహితుడినయినా సరే నమ్మకూడనిది ధనం దగ్గర. ధనం ఎంతటి పాపకార్యాన్నయినా చేయిస్తుంది. మీ సంపదను నమ్మి మిత్రుడి చేతిలో పెడితే, ఖచ్చితంగా వెనక్కి వస్తుందని గ్యారంటీ లేదు. ఎవరి అవసరాలు వారికుంటాయి. ఇవ్వగలిగే స్థితి వుంటే సరి.

లేకపోతే వచ్చేది గొడవలే. పంచతంత్రంలో ధనగుప్తుడు ధనానికి ఆశపడే ఇంద్రపాలితుణ్ణి మోసం చేశాడు. అతినమ్మకమే స్నేహితుణ్ణీ, సేవకుణ్ణీ దూరం చేస్తుంది.

## శ్రీమహాలక్ష్మిని పూజించేటప్పుడు ఏ రంగు దుస్తులు ధరించాలి

■ శ్రీ లక్ష్మీదేవిని పూజిస్తున్నప్పుడు ఆకుపచ్చ చీర ధరించి పూజించటం ద్వారా ఆ తల్లి అపార ఆశీస్సులు పొందుతారు.





## ఒక రూపాయే సుఖం, ఆ ఒక్క రూపాయే దుఃఖం

■ మీరు నెలకి పదివేలు సంపాదిస్తున్నారు. మీ ఖర్చు పదివేల ఒక్కరూపాయి. అంటే ఒక రూపాయి అప్పు...అనగా దుఃఖము..ధనమెన్నటికీ పొందలేరు. అదే మీ సంపాదన అయిదువేలు ఖర్చు నాలుగువేల తొమ్మిదివందల తొంభై తొమ్మిది...మిగులు ఒక రూపాయి. అదే సుఖం...ఎప్పటికైనా మీ చుట్టూ అందరికన్నా మీరే ధనవంతులు అవ్వగలరు.

## డబ్బు రావాల్సిన చోట గొడవ పడొద్దు

■ ఏమాత్రం ఆవేశపడ్డా మీ ధనం పోయినట్టే. ముళ్ళమీద గుడ్డవేస్తే ఎంత జాగ్రత్తగా తీస్తారో, అంత జాగ్రత్తగా సహనంగా నిదానంగా తీసుకోవాలి. ఆవేశపడ్డారా, డబ్బు పోవటంతోపాటు అనేక సమస్యలొస్తాయి. డబ్బులెగ్గొడదామనుకున్నవాడు గొడవపడి పెద్దది చేస్తాడు. పగని పెంచుకుంటాడు. వంద సమస్యలకి కారణమవుతాడు.

## భార్యా భర్తల అన్యోన్యతకూ, సంపదలకూ చెయ్యాల్సిన వ్రతం

■ మార్గశిర పౌర్ణమినాడు లక్ష్మీనారాయణుల వ్రతం చేయడం ద్వారా మహాసుఖాలూ, భార్యాభర్తల అన్యోన్యతా, మహాసంపదలూ కలుగుతాయని శ్రీ నారద పురాణం సెలవిస్తోంది. శ్రీనారద పురాణంలో చెప్పిన ప్రకారం వ్రతం చేసి లక్ష్మీ విష్ణువుల గాథలను చదవటం ద్వారా ధనసుఖాలను పొందవచ్చు.



## కొత్త నిర్ణయాలను ఒంటరిగా తీసుకోవద్దు

■ మీ ఊహల్లో కొత్త వెంచర్ అద్భుతంగా అనిపిస్తుంటుంది. మీరు అనుకున్నది అనుకున్నట్టు జరిగితే ఖచ్చితంగా విజయమే. మీకెంత నమ్మకం వున్నా ఓసారి మీ భార్యతో సంప్రదించండి. అలాగే ఆ రంగానికి సంబంధించిన వారినయినా లేదా మీ హితులనయినా సంప్రదించండి.

అందులో సాధకబాధలు తెలుస్తాయి. తద్వారా మీ వెంచర్ మీరనుకున్నట్టు విజయాన్నీ, ధనాన్నీ తెచ్చిపెడుతుంది. ధర్మరాజంతటి వాడు కూడా కొత్త కార్యాన్ని చేయాల్సి వచ్చినప్పుడు తమ మంత్రి ధౌమ్యునికి చెప్పి చర్చించి ఆపై ప్రారంభించాడు.



## వడ్డీలతో జాగ్రత్త

■ అప్పు చెయ్యటం తప్పదు. కానీ ఆ అప్పు వడ్డీ వ్యాపారము చేసే వారి దగ్గర తీసుకుంటే మీరెప్పటికీ అందులోంచి బైటపడరు. స్నేహితుల దగ్గర, అయిన వారి దగ్గర తీసుకోవాలి. అలా వారి దగ్గర తీసుకోవాలంటే, వాళ్ళు ఇవ్వాలంటే మీ మీద నమ్మకం ఉండాలి.

మీకు ధనమివ్వటం వల్ల స్నేహం, బంధుత్వము చెడదు. తిరిగి మాట ప్రకారం ఇస్తారని గ్రహిస్తే మీకెంత ధనమైన తక్కువ వడ్డీకి దొరుకుతుంది. బంగారం పెట్టి అప్పు తీసుకుంటున్నారంటే, మీకు చాలా చోట్ల పరపతి లేనట్లే. నాలుగోవంతు వడ్డీ ఇస్తామని చెప్పినా భృగువంశ ధనికులు తమ రాజునే నమ్మలేదు. తీసుకున్న అప్పు ధనాన్ని వృద్ధి చేయటం కోసం ఖర్చుపెట్టండి. మీ సుఖానికి ఖర్చు చేస్తే శ్రీ వేంకటేశ్వరునిలా కలియుగం అంతం వరకూ వడ్డీ కడుతూనే ఉండాలి.







## వీరిలో ఎవరు ఎప్పటికయినా ధనవంతుడవుతాడు...

■ ఉదాహరణకు కొంతమందిని తీసుకుందాం. ప్రస్తుత ఆస్తి జీరో. రమణ, రాజు, శంకర్, చంద్ర, రంగా వీరంతా రకరకాల సంస్థల్లో పనిచేస్తున్నారు. నెలకి పదివేలు సంపాదిస్తున్నారు. ఇక మరో ఉదాహరణగా సుబ్బారావు. ఆస్తి అయిదువందలు. చేసేపని ఆ అయిదువందల పెట్టుబడితో ఇంట్లో ఇడ్లీ దోశెలు చేసుకుని సైకిల్ మీద వ్యాపార రద్దీ ప్రదేశాల్లో అమ్మటం.

మీరు చెప్పండి. ఎప్పటికయినా శక్తిని పెట్టుబడిగా పెట్టి పదివేలు సంపాదిస్తున్నవాళ్ళు ధనవంతులవుతారా లేక అయిదువందల పెట్టుబడితో మళ్ళీ ఆ పనిలో కూడా ఒకరికి పని ఇచ్చి, ఇడ్లీలు అమ్ముకునే సుబ్బారావు ధనవంతుడవుతాడా? మీరే ఆలోచించండి. శక్తిని నమ్మిన వాడా? తెలివిని నమ్మినవాడా? మొదటిదే అయితే ఈ పుస్తకం చదవటం, వినటం వేస్ట్. రెండోది నమ్మితే నేను మీకు చెప్పింది సుబ్బారావులా ఇడ్లీలను అమ్మమని కాదు.



## చట్టబద్ధం కానివి చెయ్యకండి

■ ఈజీగా మనీ సంపాదిద్దామని ఆ దారిలో వెళితే, మీరే కాదు మీ భార్యాపిల్లలూ, ఆ పై తరం వారు కూడా దరిద్రంలో బ్రతకవల్సి వస్తుంది. దానితోపాటు తేలికగా వచ్చే ధనం సుఖమివ్వదు. అహంకారాన్ని పెంచి పతనం చేస్తుంది. మీరు తెలిసీ తెలియక అలాంటి చట్ట వ్యతిరేక మార్గంలో వుంటే, అది తప్పు అని చెప్పిన వాళ్ళని గౌరవించి, ఆ పనులు మానండి. తప్పుడు పనులు మానలేదంటే సంపదలూ వైభోగాలూ పోతాయని మైత్రేయుడు చెప్పినా వినకుండా వ్యతిరేకించినందుకే రెండు తొడలు విరిగి యుద్ధరంగంలో కూలిపోతావని దుర్యోధనుడు శాపాన్ని పొందవల్సి వచ్చింది.



## ఒక్కొక్కసారి అతిప్రేమ కూడా సంపదలనీ, సుఖాలనీ దూరం చేస్తుంది

■ ఈ అతిప్రేమ రెండు రకాలుగా ఉంటుంది. మొదటిది ఒకే వృత్తిలో ఉన్నవాళ్ళు ఈ విషయంలో ఎప్పుడూ అలర్ట్‌గా ఉండాలి. కమర్షియల్ పరిచయాన్నే స్నేహమని భ్రమిస్తే, అవతల వారు మీ వీక్‌నెస్‌ని అడ్డుపెట్టుకొని గొప్పవారవుతారు. ఎప్పుడూ మిమ్మల్ని అదే పరిస్థితిలో ఉంచుతారు. పదిసంవత్సరాల క్రితం ఎక్కడున్నారో మీరక్కడే వుంటారు. కాని మీ నుంచి ప్రేమని పొందిన వారు మాత్రం చాలా పెద్ద స్థాయికి వెళ్తారు. తర్వాత బోర్‌కొట్టి మిమ్మల్ని దూరంగా ఉంచుతారు.

ఇక రెండోది ఆ అతిప్రేమతో మనం తానా అంటే తానా, తందానా అంటే తందానా అంటారు. దాని వల్ల మరింత ప్రమాదం. దుర్యోధనుడి మీద అతిప్రేమతోనే ధృతరాష్ట్రుడు తానా అంటే తానా, తందానా అంటే తందానా అని అన్నందుకు దుర్యోధనుడు సకల సంపదలనూ, సోదరులనూ, హితులనూ, గురువులనూ ఆఖరికి తనకి తానే పోగొట్టుకున్నాడు.



## పుణ్య స్వరూపిణి లక్ష్మీ కటాక్షం ఉంటే

■ ఆడదానికి తినేరాత ఉంటే పెళ్ళయిన కొత్తలో మగడు సంపాదిస్తాడు. అదే పిల్లలకి తినేరాత ఉంటే పిల్లలు పుట్టిన తర్వాత సంపాదిస్తాడు. అప్పుడు కూడా సంపాదించలేకపోతే అసలు వానికే అనగా గృహ యజమానికే సుఖించే రాతలేదు.

– అష్టాదశపురాణాల నుంచి







## ఒక్కొక్కసారి వెనకడుగు కూడా వెయ్యాలి

■ మీరు ధనాన్ని కోల్పోయారు. వ్యాపారంలో రహస్యాలూ బైటికెళ్ళిపోయాయి. పైగా మీ మీద అభియోగాలు... అసత్యప్రచారాలు... రూపాయి పుట్టకుండా చేస్తున్నారు. అలాంటప్పుడు ఆవేశపడకూడదు. ఆ కోపానికి లోనయితే మరింత నష్టపోవాల్సి వస్తుంది. సహనం నశింపచేయొద్దు. మళ్ళీ సమయం వస్తుంది. శ్రీకృష్ణార్జునులంతటి వాళ్ళు కురుక్షేత్రంలో ఈ రోజు వద్దు, రేపు చూద్దాం అని వెనక్కి వచ్చారు. వేటాడే ముందు సింహం కూడా వెనక్కి అడుగు వేస్తుంది. ఆలోచించి దుముకుతుంది. పై ఒక్కదానికే ఇది ఉదాహరణ కాదు. టైమ్ మనది కానప్పుడు మౌనాన్నే ఆశ్రయించాలి. అలా కాకుంటే మరింత ధనం, విజయం పోగొట్టుకోవాల్సి వస్తుంది.



## ధనమున్న మిత్రులతో జాగ్రత్త

■ మీరు మంచి మిత్రులే కానీ మీకంటే ధనమున్న వారితో స్నేహం ఒక్కోసారి మీ ధనాన్ని పోగొడుతుంది. మీరు మామూలుగా ఎ.సి.లో ప్రయాణం చేస్తారు మీ ఆర్థిక స్తోమత ప్రకారం. అదే మీ మిత్రుడు ధనముంది కాబట్టి విమానంలో వెళతాడు. కలిసి వెళితే ఎంత ఖర్చు. అదే కుటుంబంతో అయితే...ఎంత ధనం కోల్పోతారు. స్నేహమనుకుని అలా వారితో వెళితే చిల్లుపడేది మీ సంపదకే. డబ్బు సంపాదించటం కంటే కష్టమైన పని దాన్ని నిలబెట్టుకోవటం. స్థోమతకు తగ్గట్టు ప్రవర్తించటము. సుఖ వ్యసనాల్లోనే ధనవంతుడైన మిత్రుడు తోడు ఉంటాడు. ధనాధిపతి కుబేరుడి మిత్రుడు శివుడు. అయినా అవసరార్థం భిక్ష మెత్తక తప్పలేదు పరమేశ్వరుడికి. స్నేహితుడైన కుబేరుడు మిత్రుడు శివుడు కాశీలో బిచ్చమెత్తుతుంటే ఏం చేస్తున్నాడు.

# తెలిసి తెలిసి చిన్న విషయాన్ని పెద్దది చెయ్యొద్దు

■మీరు మీ వృత్తిలో నెంబర్ వన్. మీకు ఎదురే లేదు. మీరిచ్చే క్వాలిటీ, క్వాంటిటీ ఎవరూ ఇవ్వలేరు. మీ కనుచూపు మేరలో మీతో పోటీకి వచ్చేవాళ్ళు ఎవరూ లేరు. ఎక్కడో ఎవరో ఏదో చేసుకుంటున్నారు. మీకన్నా వాళ్ళు బాగా చేశారు.

దాంతో మీరు మదంతో వాడిపైకెళ్ళారో, అదే మీ పతనానికి నాంది. స్థాయిని బట్టి పోటీ పడండి. చిన్నోడి మీదకెళ్ళి వాడి స్థాయిని రాత్రికి రాత్రే పెంచవద్దు.

ఇంతకాలం మిమ్మల్ని ఏమీ చేయలేక మంచివాళ్ళుగా మీ వద్ద ఉన్న అందరూ వాడ్ని పెద్దవాడ్ని చేస్తారు. అసలుకే మోసం వస్తుంది.

నా చిన్నతనంలో మా అగ్రహారంలో శంకర్ అనే రౌడి ఉండేవాడు. వాడి పేరు చెబితేనే అంతా గడగడలాడిపోయేవారు. వెంకట్ అని నా ఫ్రెండ్ ఉండేవాడు. వాడికి అగ్రహారంలో వుండే శంకరంటే అందరికీ ఎంత భయం వుండేదో అంతకు రెండింతలు భయం.

వాడి పేరుతో వున్న స్నేహితులంటే కూడా భయపడేవాడు. ఓరోజు మేం కబుర్లు చెప్పుకుంటుంటే శంకర్ వచ్చి మమ్మల్ని తిట్టాడు. చెయ్యెత్తాడు. నేనయితే వెనక్కి వెళ్ళాను.

కాని వెంకట్ మాత్రం లాగి పెట్టి గుద్దాడు. దానికి కారణం విపరీతమైన భయం. ఆ భయంతోనే తననేం చేస్తాడోనని కొట్టాడు.

ఆ దెబ్బకి వాడు పళ్ళు రాలి కిందపడ్డాయి. కేవలం నిమిషాల్లో అగ్రహారమంతా తెలిసిపోయింది. శంకర్ మళ్ళీ మాకు కనపడలేదు.





వెంకట్ మాత్రం మాకళ్ళ ముందే రౌడీయిజం చేయడం ప్రారంభించాడు. ఆ స్థానాన్ని వాడు కోరుకోలేదు. కాని శంకర్ ప్రత్యర్థులు పెంచారు.

మీరు చాలా పెద్దస్థానంలో ఉన్నారు. కిందకి దిగివచ్చి సామాన్యుడి సంగతి తేలుద్దామనుకుంటే అన్నిసార్లూ విజయం సాధించలేరు. ఎప్పుడో ఒకసారి రివర్స్ అవుతుంది.

అప్పుడు మీరు కిందస్థాయికి రావాల్సి ఉంటుంది. ఇంత చెప్పింది రౌడీలు అనేవారు అమాయకుల మీదకు వెళ్ళకూడదని నేను ఇదంతా రాశానని అనుకుంటే నేను చెయ్యగలిగేది ఏమీలేదు.



# శత్రువుని ఎట్టి పరిస్థితుల్లో మళ్ళీ దగ్గరికి రానీయవద్దు

■కారణాలు ఏవైనా కావచ్చు. మీకూ, వేరేవాళ్ళకీ తేడా వచ్చింది. అలా గొడవపడిన తర్వాత ఎట్టి పరిస్థితుల్లో ఎవరు చెప్పినా మళ్ళీ దగ్గరికి రానీయవద్దు. అలా రానిస్తే పతనం తప్పదు. పాతపగతో అవకాశం దొరికితే మీకు కీడు చేస్తాడు.

వృత్రాసురుడు అలా నమ్మే ఇంద్రుడితో స్నేహం చేశాడు. ఆ పొరపాటుకు తను బలవ్వాల్సి వచ్చింది. ఎప్పుడయినా ఒక్కటే గుర్తు పెట్టుకోండి. హాని చెయ్యటమంటే సుఖాన్ని పోగొట్టడం, ప్రశాంతతను పోగొట్టడము. అంటే ధనాన్ని పోగొట్టడం.



# బంగారం సాక్షాత్తూ శ్రీమహాలక్ష్మీదేవి

■బంగారాన్ని నడుంపైన వరకు మాత్రమే ధరించాలి. కొంతమంది బంగారు పట్టీలు, మెట్టెలూ ధరిస్తారు. అది శ్రీమహాలక్ష్మీదేవిని కించపరిచినట్టే. తద్వారా ధననాశనం జరుగుతుంది.



## మీ కన్నా ధనమున్న వారితో స్నేహం చెయ్యండి

■ సాధువుతో తిరిగితే అపార బూడిద దొరుకుతుంది. జ్ఞానితో తిరిగితే జ్ఞానసంపద కలుగుతుంది. కాముకుడితో తిరిగితే పెక్కు స్త్రీలతో సుఖాలను పొందగలరు. అలాగే రోగాలని కూడా. చెడు ప్రవర్తన గలవారితో తిరిగితే అపకీర్తి వస్తుంది.

అలాగే ధనాన్ని సంపాదించాలంటే ధనవంతులతోనే తిరగాలి. మీకంటే ధనవంతులవ్వటం చేత అహంతో మీ చేత ఖర్చు పెట్టించరు. తమకన్నా చిన్నవాడని సంపాదన మార్గాలను చెబుతారు. అలాగే మీరు తమకన్నా ధనం సంపాదనలో పెద్దవారవుతున్నారని గమనిస్తే వాళ్ళు మిమ్మల్ని బికారులగా కూడా చేస్తారు. కాబట్టి తస్మాత్ జాగ్రత్త.



## డబ్బుంటే కొండ మీద కోతి..

■ మీకు బలం లేకపోయినా పదిమంది బలవంతులు మీ వద్ద చేతులు కట్టుకుంటారు. జ్ఞానము లేకపోయినా అనేక మంది జ్ఞానవంతులు మీకు సేవలందిస్తారు. ధనము వల్ల సుఖములు కలుగుతాయి. ఆఖరికి చిన్న చిన్న తప్పులనీ, ఒక్కోసారి తెలిసీ తెలియక చేసిన మహా తప్పునీ కూడా ధనమే తన కడుపులో దాచుకుంటుంది. ఇన్ని చేసే ధన విషయంలో మీకు అహం పెరిగితే ఆ ధనమే మిమ్మల్ని అథఃపాతాళానికి నెట్టివేస్తుంది. డబ్బులుంటే కొండమీది కోతి కూడా దిగి వస్తుంది. నిజమే అంత వరకూ బావుంది. నా డబ్బుతో అందర్నీ దింపిస్తాను అని భావిస్తే, ప్రవర్తిస్తే ఒక్కసారి మీరే కోతివ్వాల్సి వస్తుంది. మీదకొచ్చిన గద్దను చూసి వణికే కోతిలా గజగజ వణకాల్సి వస్తుంది. అంతా కోతులే అనుకుంటే, ప్రవర్తిస్తే మీరు కోతులని భావించిన వారే మహాసర్పాలై కాటు వేస్తారు.







## అతి వినయం నటించేవారితో జాగ్రత్త

■ కొంతమంది రాజు దగ్గర సామంత రాజులా వినయ విధేయతలతో ఉంటారు. అలాంటి వాళ్ళ విషయంలో ఎంతో జాగ్రత్తగా ఉండాలి. ఏ స్వార్థం లేకుండా, ఏ ఆలోచనా లేకుండా మీ అడుగులకి మడుగులొత్తాల్సిన అవసరం ఏంటి? పంచతంత్రం చదివిన వారికి ఆషాఢభూతి కథ తెలిసే వుంటుంది. దేవశర్మ దగ్గర అతి వినయం చూపించి, అతని ధనాన్ని కాజేస్తాడు.

అలాగే మీ వద్దనుంచి ధనం లేదా వారి అవసరాలూ, వ్యసనాలూ ఏదో ఒకటి ఉంటుంది. దాని కోసమే అతి వినయాన్ని చూపిస్తారు. అలాంటివాళ్ళ విషయంలో జాగ్రత్త.



## మీ దగ్గర టాలెంట్ వుంటే సరిపోదు

■ మీకు అపారమైన విద్వత్తు వుంది. మహామేధావి అయినా జీవితంలో ఎదగకపోవడానికి కారణం. క్యారెక్టర్. అది లేకపోతే మీకెంత మేధస్సు ఉన్నా ఎవ్వరూ దగ్గరికి రానీయరు.

ఆడవాళ్ళ బలహీనతలూ, అబద్ధాలూ, విపరీత కోపస్వభావం వంటివి ఉంటే ఎంత గొప్ప విద్వత్తు వున్నా రావణాసురుడిలా సకల సంపదలూ పోగొట్టుకోవాల్సిందే.



## గృహిణి సంపదల స్వరూపిణి

■ ఇంటి ఇల్లాలు లక్ష్మీదేవి వంటిది. సకల సుఖాలకూ, విలాసాలకూ పెన్నిధి. అట్టి ఆమె దుఃఖించిన సంపదలూ, సుఖాలూ తొలగిపోతాయి.



## సకల కోరికలూ తీర్చే కమలాక్షికి నైవేద్యాలు

■ శ్రీమహాలక్ష్మీదేవికి ప్రీతికరమైన నైవేద్యాలు బియ్యం నానబెట్టి చేసిన ఉండ్రాళ్ళు, కొబ్బరికాయ, అరటిపండు, జున్ను, మధుర పదార్థాలూ, పాలూ, బియ్యం, బెల్లంలతో కలిపి చేసిన పదార్థములు.



## పొట్ట జ్యేష్ఠాదేవి స్థానం

■ బట్టతల మేధావికి లక్షణము అవునో కాదో గాని పొట్ట రావటం మాత్రం లక్ష్మీదేవికి కోపం. లక్ష్మి శాంత స్వభావం గలది. కోపమూ, పొగరూ, అతినిద్ర, అతి తిండి వల్ల వచ్చే పొట్ట గలవారి గృహానికి లక్ష్మి దూరంగా వుంటుంది.

■ అభ్యంగన స్నానం అయ్యాక అపరిశుద్ధుణ్ణి తాకరాదు. అలాగే తొడలపై మద్దెల దరువు వేస్తే శ్రీమహాలక్ష్మి తన సంపదలను తనతోపాటు తీసుకెళ్ళిపోతుంది.

■ శ్రీమహాలక్ష్మీ స్తవాన్ని త్రిసంధ్యలలో పఠించినటువంటివారు మహాధనవంతులవుతారు. – శ్రీదేవీభాగవతము

■ శ్రీమహాలక్ష్మీదేవి వెయ్యి రేకుల తామరపువ్వులో కొలువై తేజస్సుతో ప్రజ్వలిస్తూ పీతాంబరాలను ధరించి చిరునవ్వులను చిందిస్తుంటుంది.



## దీపమంటే లక్ష్మీదేవియే

■ కటికనేలపై దీపాన్ని ఉంచి పూజిస్తే మహాదరిద్రం ఆవహిస్తుంది. దీపం శ్రీమహాలక్ష్మి స్వరూపం.







## బంగారాన్ని ఎవరికి ఇవ్వకూడదు

■ బంగారపు లక్ష్మీరూపును కూతురికయినా ఇవ్వకూడదు. అలా ఇస్తే ఆ ఇంటి ధనలక్ష్మిని వారి ఇంటికి బొట్టుపెట్టి సాగనంపినట్టే. అలాగే దానాల్లో కూడా బంగారాన్ని ఉపయోగించకూడదు. బంగారాన్ని ఇవ్వాలంటే తిరిగి ఆ తల్లికే శ్రీలక్ష్మీనారాయణికే సమర్పించాలి.



## భర్త ప్రేమకి నోచుకోవాలంటే

■ భర్త వల్ల సమస్యలూ, ఇబ్బందులూ లేదా భర్తకు దూరమయినప్పుడు పరమేశ్వరుణ్ణి ప్రార్థించడం ద్వారా భర్త తిరిగి దగ్గరగా వస్తాడు. అలాంటి వియోగంలోనే శ్రీమహాలక్ష్మి పార్వతీ పరమేశ్వరులను ప్రార్థించి తన భర్త శ్రీమహావిష్ణువుని రప్పించుకుంది.



## లక్ష్మీ రూపాలను అలక్ష్యం చెయ్యద్దు

■ బంగారాన్నీ, రత్నాలనీ, ముత్యాలనీ, శంఖాలనీ, పూజా యంత్రాన్నీ, సాలగ్రామాలనీ, జపమాలనూ, దర్భలనీ, రుద్రాక్షలనీ, చందనాన్నీ, కర్పూరాన్నీ, ఫలాలనీ, పువ్వులనూ, దీపాన్నీ, పట్టువస్త్రాలనూ, కటిక నేలమీద పెట్టరాదు. లక్ష్మీదేవికి కోపాన్ని కలిగిస్తుంది.



## ప్రతినిత్యం లక్ష్మీదేవికి నివేదించాల్సిన నైవేద్యాలు

■ శ్రీమహాలక్ష్మికి ప్రీతికరమైన నైవేద్యాలు. అన్నము పాయసము, సర్వఫలాలూ, గోవుపాలు, పెరుగు, వెన్నతో చేసిన పదార్థాలు, చెరకు రసం, గోధుమరవ్వతో చేసినవి.



## విష్ణు భక్తులను తూలనాడితే వచ్చేది దరిద్రమే

■ శ్రీ మహావిష్ణు భక్తులని తూలనాడితే, హరికి కోపం వచ్చి వారి గృహాల నుంచి వెళ్ళిపోతాడు. భర్తతో పాటు భార్య శ్రీమహాలక్ష్మి కూడా వెళ్ళిపోతుంది. విష్ణుభక్తుడైన దూర్వాసుణ్ణి ఇంద్రుడు చిన్నబుచ్చినందుకే స్వర్గలక్ష్మి స్వర్గం నుంచి వెళ్ళిపోయింది. ఇంద్రుడు మహాకష్టాలు పడ్డాడు.



## శ్రీమహాలక్ష్మీదేవికి ఇష్టంలేనివి

■ మంచంపై కూర్చుని భోజనం చెయ్యటము

■ ఉదయాన్నే ఇల్లు, వాకిలీ శుభ్రం చెయ్యకపోవటము.

■ లేచింది మొదలు భర్తనీ, పిల్లల్ని తిట్టటము, అరవటము, విసుక్కోవటము.

■ సాయం సమయాన సంధ్య దీపం ఉంచకపోవటము.

■ సరిగా పక్వము చెందని ఆహారాదులను తినటము

■ ఆహారాన్ని తీసుకోకముందు, తీసుకున్న తర్వాత నోటిని శుభ్రపరచుకోకుండా ఉండటము.

■ ఉదయాన్నే లేచి ముఖం కడుక్కోకుండా భర్తకు కనపడటము వల్ల అనారోగ్యం, ధనహీనత కలుగుతాయి.

■ తడిబట్టలతో భోజనాన్ని చేయుటమూ, తదియునాడు దొండకాయను తినటమూ, తమలపాకుల కన్నా ముందు వక్కలు నమలటమూ ఇవన్నీ దారిద్ర్యాన్ని తెస్తాయి..

■ ధనాన్ని ఉత్తరము వైపున్న గదిలో జాగ్రత్త చేయటం ద్వారా కుబేరుని ప్రీతిని పొందగలరు.







## లక్ష్మీదేవి విమల మంత్రం

■ 'లక్ష్మీ కమలావాసిన్యై స్వాహా' అని వేదమంత్ర రాజాన్ని పఠించడం ద్వారా సకల సంపదలు కలుగుతాయి. ఈ మంత్రాన్ని బ్రహ్మదేవుడు నారదునికి ఉపదేశించాడు

■ శంఖధ్వనీ, నిత్య ఆరాధనా, తులసి లేని చోట లక్ష్మీదేవి క్షణకాలం కూడా నివసించదు.

■ శ్రీమహాలక్ష్మీపతి జన్మతిథినాడు ఉపవాసం వుండటం వల్ల శ్రీమహాలక్ష్మి దీవెనలనూ, సంపదలనూ పొందవచ్చు.

## డబ్బు......

■ భార్యభర్తల గొడవల్లో ఉండేది......డబ్బు

■ ఇద్దరి స్నేహితుల మధ్య గొడవలు పెట్టేది...... డబ్బు

■ నమ్మినవాడే గొంతుకోసేది...... డబ్బు

■ అన్నదమ్ముల మధ్య చిచ్చుపెట్టేది...... డబ్బు

■ ఓ స్త్రీ తన శరీరాన్ని అమ్ముకునేలా చేసేది ...... డబ్బు

■ దొంగతనాలకి పాల్పడేలా చేసేది...... డబ్బు

■ వృద్ధులమీద జరిగే నేరాలకి కారణములు...... డబ్బు

■ పసిపిల్లల్ని ఎత్తుకెళ్ళేది, నిర్దాక్షిణ్యంగా చంపేలా చేసేది....డబ్బు

■ సకల జబ్బులకి కారణము...... డబ్బు

■ సకల విషయాల్లోనూ నీచాలు చేసేది...... డబ్బు

■ కుటుంబంలో కలతలని సృష్టించేది, శత్రువులుగా మార్చేది.. డబ్బు

## ఆహార పదార్థాలను వృధాచెయ్యటం కూడా ధనం నిల్వ లేకపోవటానికి కారణం

■ లెక్కా పత్రం లేకుండా గిన్నెడు చట్నీ చేస్తారు...సగం మిగిలి పోతుంది. అలాగే చాలామంది భర్తలు భోజనానికి ఇంటికి రామని ముందే తెలిసినా చెప్పరు.

సరిగ్గా భోజన సమయంలో చెబుతారు. దాని వల్ల ఎంత నష్టం. మీ భార్య శ్రమ కూడా నష్టమే... మహాత్మాగాంధీ గారు ఓ సందర్భంలో తన కార్యదర్శికి ఇలా చెప్పారు.

“నీవు నాలుగులైన్ల ఉత్తరం వ్రాయటానికి ఓ పేపరూ, కవరూ పోస్టేజీ ఇన్ని చేస్తున్నావు. ఓ కార్డ్ రాస్తే సరిపోయేదానికి?” అని. అలా చెయ్యటాన్ని పొదుపు అంటారు. పొదుపు వేరు, పిసినారితనం వేరు.

## అరచేయి శ్రీమహాలక్ష్మీ నివాసము

■ ఉదయం నిద్ర నుంచి లేవగానే అరచేయిని చూసుకుని కనులకి అద్దుకుంటే శ్రీ సరస్వతీ, శ్రీమహాలక్ష్మీ, నారాయణులను పూజించినంత పుణ్యం. అరచేయి ఆ ముగ్గురి నివాసస్థానం.

## ఏ లక్ష్మి ఎక్కడెక్కడ ఉంటుంది

■ వైకుంఠంలో శ్రీమహాలక్ష్మి, స్వర్గంలో స్వర్గలక్ష్మి, భువిపై బంగారంలో శ్రీమహాలక్ష్మి, సాగరంలో కామధేనువు, ఇంకా ప్రతిగృహంలోని ఇల్లాలు కూడా గృహలక్ష్మే.





## పోయిన మీ ధనాన్ని తిరిగి పొందాలంటే

■ పోయిన సంపద తిరిగి పొందేందుకు ఉదయం శుచీ, శుభ్రతలతో శ్రీమహాలక్ష్మి జన్మించిన గాథలోని క్షీరసాగర మథనం భాగాన్ని చదివిన వారికి వారి సంపదలతో పాటు మహాసుఖాలు కలుగుతాయని శ్రీదేవీభాగవతం సెలవిస్తుంది.

## ఇష్టమైన పనిని చేయటం ద్వారా మాత్రమే ధనాన్ని సంపాదించగలరు

■ అది ఏ రంగమయినా సరే, చదువుకునే చదువు కావచ్చు. చేసే ఉద్యోగం కావచ్చు. వ్యాపారం కావచ్చు. ఆ రంగం మీకిష్టమైతే చిన్నదా, పెద్దదా అని ఆలోచించకుండా పనిచేస్తే అత్యున్నత శిఖరాలను అధిరోహించవచ్చు.

సైకిల్ మీద వక్కపొడి, అగరబత్తులను అమ్మి కూడా, అనగా వారి వారి కిష్టమైన పనులు చేసి ప్రపంచ వ్యాప్తంగా కీర్తినీ, ధనాన్నీ పొందారు.

## ఏ సమయాల్లో అస్సలు కంట నీరు పెట్టకూడదు

■ ప్రదోషకాలంలో ఏడిస్తే లేదా ఏడిపించినా, శ్రీమహాలక్ష్మి ఏడ్చిన వారి ఇంటి నుండి వెళ్ళిపోతుంది. ఏడ్పించిన వాని నుంచి శాశ్వతంగా దూరమవుతుంది. సత్యహరిశ్చంద్రుడి భార్య శైబ్య తన కుమారుడు రోహితుడు గూర్చి కన్నీరు పెట్టుకుంటుంటే ముదుసలి రూపంలోనున్న విశ్వామిత్రుడు చెబుతాడు ఆ సమయంలో ఏడ్వకూడదని.



## ద్రోహం చేస్తే వదలి పెట్టవద్దు

■ అలా చేస్తే మీలా మరో వందమందిని మోసం చెయ్యచ్చు.

■ అలా చేసిన వారిపై ఆవేశానికి లోనయితే మరీ సమస్యలు.

■ అసలు అవతల వారి ద్రోహబుద్ధి తెలిసినట్టు వుండకండి.

■ ధర్మం తప్పినా చట్ట ప్రకారం వెళ్ళండి.

■ నీచుల కోసం దేవుడు పదే పదే జన్మించడు.

■ కొన్నిసార్లు దేవుడు చెయ్యాల్సిన ధర్మకార్యాలను మనుష్యులకి అప్పచెబుతాడు.

■ అది మీరే ఎందుకు కాకూడదు. అలా చేస్తే కీర్తి, ధనం, సుఖాలు మిమ్మల్ని ఖచ్చితంగా వరిస్తాయి.



## దేన్ని జయించటం ద్వారా శ్రీమహాలక్ష్మి కటాక్షిస్తుంది

■ధర్మానికీ, సంపదకూ పుట్టిందే 'దర్ప'మనే దుర్గుణం. ఆ దర్పమే ధర్మాన్నీ, సంపదలనూ నాశనం చేస్తుంది. కాన ఆ దుర్గుణాన్ని జయించినవారే మహాసంపదలనూ, కీర్తినీ పొందగలరని ఉతిథ్యుడను మహర్షి బోధించాడు.



## ఇవంటే విష్ణువక్ష నివాసికి నచ్చవు

■ దంతాలతో గోళ్ళు కొరకటమూ, అలాగే దంతాలను కొరుక్కోవటమూ, గడ్డిపోచలనూ నమలటమూ, దోసిలిపట్టి నీళ్ళు తాగటమూ వంటివాటి వల్ల అనారోగ్యం కలిగి ధనం పోతుంది.







## పగా, ప్రతీకారాల కన్నా భయంకరమైనది

■ ధనమే. సంవత్సరాలుగా పగలు ఉన్నా, కుటుంబ పర ద్వేషాలున్నా సంవత్సరాల తరబడి ఆ యుద్ధం కొనసాగుతుంది. కానీ ధనం కోసం పగా, ప్రతీకారాలూ, ద్వేషాలూ ఏమీ అక్కరలేదు. నమ్మినవాడే గొంతుకోస్తాడు.

అలాంటి అవకాశం ఇవ్వద్దు. మీ ధనాన్ని బినామీ పేరుతో మీకు నమ్మకమని పెడితే లేదా ఉంచితే మీ ప్రాణానికే ప్రమాదం. డబ్బులిచ్చి మెడ మీదకు తెచ్చుకోవద్దు.



## డబ్బుకు జగత్తే దాసోహము.....

■డబ్బుతో ఏ పనయినా చెయ్యచ్చు. ధర్మన్యాయ కార్యాలూ చేయొచ్చు. పగలూ, ప్రతీకారాలూ తీర్చుకోవచ్చు. కీర్తిని పొందవచ్చు. సుఖాలను పొందవచ్చు. అన్ని మహిమలున్నదీ, శక్తికలదీ అయిన ధనం ఎంతటి నీచాన్ని అయినా చేయిస్తుంది.

అలా లంచం ఆశ చూపించి మహాధర్మపరుడూ, సత్యవాక్కు పాలకుడూ అయిన త్రిశిరసుడిని కర్ణుడనే వాడిచేత ఇంద్రుడు చంపించాడు. ఆ ధనంతోనే చ్యవనుడు మహాయజ్ఞం చేసి లోకహితం చేశాడు.

అలా అతి ఆత్మవిశ్వాసంతోనే ఉత్తర కుమారుడు కౌరవుల మీదకి వెళ్ళాడు. వారందరినీ చూడటంతోనే యుద్ధరంగం నుంచి పారిపోతాడు. ఉత్తర కుమారుణ్ని రక్షించటానికి అర్జునుడున్నాడు. కానీ మీకు?



## ఎటువంటి పూజలూ, వ్రతాలూ శ్రీమహాలక్ష్మి స్వీకరించదు

■ వ్రతపుణ్యకార్యాల్లో దానాలనూ, దక్షిణలనూ వెంటనే ఇవ్వని వారంటే శ్రీమహాలక్ష్మికి అపార కోపం. అట్టి వాని ఇంటి నుంచి పోవడమే కాక వార్ని రోగిష్టులుగానూ, మహాదరిద్రులుగానూ చేస్తుంది. అలా దక్షిణ ఇవ్వని వారి పూజలూ, మొరలూ ఏ దేవతలూ స్వీకరించరు.



## మహామొండి బాకీలు తిరిగి రావాలంటే

■ మహా మొండి బాకీలూ, నమ్మకంగా చెప్పి ఎగ్గొట్టిన ధనము తిరిగి రావాలంటే స్వారోచిత మనువు కాలంలో జన్మించిన సురథుని గాథలను (శ్రీదేవీభాగవతము) చదివితే ఆ జగజ్జనని సంపదలను కలిగిస్తుంది. పోయిన వైభవాన్ని తిరిగి రప్పిస్తుంది.



## రూపాయే కదా అని నిర్లక్ష్యంగా ఉండొద్దు

■ రూపాయే కదాని వదిలేయొద్దు.....రూపాయి విలువ మీకు ఖచ్చితంగా ఎప్పుడు తెలుస్తుందో తెలుసా? కుటుంబంతో రెండో ఆట సినిమాకి వెళ్ళారు. ఆటోలో ఇంటికొచ్చారు. చిల్లర లేదు ఇద్దరి దగ్గరా, మీ ఆవిడ పర్స్ కూడా వెతికినా రూపాయి తగ్గింది.

ఏంటి పరిస్థితి? ఆటో అతను రూపాయి తక్కువ తీసుకోవటానికి ఇష్టపడతాడా....? ఇలాంటి నిర్లక్ష్యాన్ని మగవాళ్ళు చేస్తుంటారు. అలా నిర్లక్ష్యంగా ఉండకుండా ఉండండి. ఎన్ని రూపాయలు మిగులుతాయో మీకే తెలుస్తుంది.







## వ్యసనాలు సంపదనీ, కీర్తినీ పోగొడతాయి

■ ఏ అలవాటయినా సరే అది ఖచ్చితంగా ఎంతో కొంత మిమ్మల్ని ఆ వృత్తి నుంచి పక్కకి మళ్ళిస్తుంది. ఆఁ రేపు చేద్దాంలే అనిపిస్తుంది. అలా రోజులు గడుస్తూనే ఉంటాయి.

ఆర్థికంగా దెబ్బ తగిలి తేరుకోలేనప్పుడు గాని అసలు విషయం అర్థం కాదు. బ్రహ్మదేవుడ్నించి వరాలు పొంది మహా విజయాన్ని పొందే అవకాశం ఉన్నా, ఇంద్రుని పుత్రిక జయంతితో శుక్రాచార్యుడు పది సంవత్సరాలు సుఖించాడు. ఆపై దేవతల మీదకు వెళ్ళినా పరాజయం మిగిలింది. ఆ జయంతి వ్యామోహాన్ని వదిలిపెడితే శుక్రాచార్యుడు దేవతల మీద విజయం సాధించేవాడు.



## సౌభాగ్యలక్ష్మి దీవెనెల కోసం ఏ వైపుగా ఉండి భోజనాన్ని చేయాలి

■ ఇంటి ఇల్లాలు తూర్పు వైపుగానీ, ఉత్తరం వైపుగానీ కూర్చుని భోజనం చేయాలి. చీకటిలో భోజనాన్ని తీసుకోకూడదు. వీటిని పాటించిన లక్ష్మీదేవి అలాంటి వారి గృహాల్ని కనకమయం చేస్తుంది.



## సంపదల కోసం చెయ్యాల్సిన స్నానం

■ మహాధనసంపదల కోసం, శ్రీమహాలక్ష్మి ప్రాప్తి కోసం ఉసిరి కాయ పొడిని నీటిలో కలిపి తల స్నానమాచరించి శ్రీమహాలక్ష్మిని పూజిస్తే ఆ ఫలాలు కలుగుతాయి. కలిసి వస్తాయి.



## ధనం ఎంతటి అకార్యానికైనా ఉసికొల్పుతుంది

■ ధనం ఎంతటి పనయినా చేయిస్తుంది. విశ్వామిత్రుడి భార్య సహితం ధనం కోసం తన పుత్రుడ్ని అమ్మాలని బిడ్డ మెడలో త్రాడు వేసి మరీ సంతకు తీసుకెళ్ళింది.

కాన ధనాన్ని ఉన్నప్పుడే పొదుపు చేసుకోండి. విచ్చలవిడిగా ఖర్చుపెడితే, అవసరమైన సమయాల్లో చేతులు చాపాల్సి వస్తుంది. లేదా చెయ్యకూడని కార్యాలను అయిష్టంగానైనా చెయ్యాల్సి వస్తుంది.



## మా అమ్మా, బాబూ నాకేం ఇవ్వలేదు

■ ఇంతకన్నా, తెలుగులో తక్కువస్థాయిపదం లేదు. అలా మాట్లాడేవాళ్ళంతా తమ చేతకానితనాన్ని తన తల్లీ, తండ్రీ మీద వేసేవాళ్ళు అయి ఉంటారు.

ఈ భారతదేశానికే ప్రధానమంత్రి అయిన పి.వి.నరసింహారావుకి వారి తల్లీ, తండ్రీ ఏ రాజకీయ అనుభవం ఇచ్చారు. ప్రపంచంలో అతి సంపన్నుడైన బిల్‌గేట్స్ తల్లీ, తండ్రీ నుంచి ఏం పొంది ప్రపంచంలోనే కోటీశ్వరుడయ్యాడు. ధీరూభాయి అంబానీ, చంద్రబాబు నాయుడూ, అంబిక, క్రేన్.... అంత గొప్పవాళ్ళతో పోలికెందుకు. మీ చుట్టూ ఉన్న వార్ని ఒకసారి పరిశీలించండి.

పరాశరుడు మునీశ్వరుడు. తపము, తీర్థ సేవనములు చేసేవాడు. కాని వాని పుత్రుడు వ్యాసుడు తండ్రి నుంచి ఏం తీసుకొని అష్టాదశ పురాణాలను వ్రాశాడు.







## సకల విద్యాపారంగతుడైనా ధనమున్నవాని దగ్గర తలవంచాల్సిందే...

■ సకల వేదశాస్త్రాలను ఔపోసన పట్టినవారూ, మహామేధావులూ, అపార ధైర్యసాహసాలు కలవారూ, మహాబలవంతులూ ఎవ్వరైనా ధనవంతుని వద్ద నిలబడాల్సిందే. ధనమున్నవాడ్ని మేధావులూ, ధైర్యసాహసాలున్నవారూ, అధికారమున్నవారూ సదా సేవిస్తుంటారు.



## గుప్పెడు అటుకులకి మహాసంపద

■ శ్రీకృష్ణుడు ధనరాసులను గుప్పెడు అటుకులను తెచ్చిన కుచేలునికి ఇచ్చాడు. మిత్రుడని ఇచ్చాడా? ఆ ఒక్క కారణమే కాదు. ఆ తెచ్చిన అటుకులు ధర్మమైనవి. అన్యాయార్జితం కాదు. అందుకే లక్ష్మీపతి న్యాయధర్మపద్ధతిలో సంపాదించిన అటుకులకి విలువ కట్టాడు. మహాసంపదలని ఇచ్చాడు. భగవంతునికి పెట్టే నైవేద్యాలు అంత ధర్మసంపాదనవి అయితేనే శ్రీమహాలక్ష్మి కరుణించి కటాక్షిస్తుంది.



## అప్పుల గూర్చి భయపడవద్దు

■ భయపడితే మహాసర్పమై కాటు వేస్తుంది. అలాగే పరిస్థితి చేయి జారకముందే మేల్కొనండి. అప్పులెన్ని ఉన్నాయి? ఎంత? ఎట్టి పరిస్థితుల్లో తీర్చాలి. దానికి చెయ్యాల్సింది ప్రొడక్షన్. నెలకి లక్షరూపాయలు ప్రొడక్షన్ చేస్తుంటే, పదివేలు సంపాదిస్తారనుకుందాం...నెలకి యాభై కావాలి. సో మీరు ప్రొడక్షన్ ఐదులక్షలు దాటించాలి. ఎలా...ఏమిటి సాధ్యమా? అని ఆలోచన

చేస్తే చేయలేరు. ఎలా చేయాలి? ఏ విధంగా మార్కెట్ పెంచాలి. మ్యాన్ పవర్‌ని పెంచాలి ఇలా ఆలోచించండి. ఖచ్చితంగా సంవత్సరం తిరిగేసరికి మీరు పదిమందికీ అప్పు ఇచ్చే స్థితికి చేరుకుంటారు. ఆ డబ్బు సమస్యలకి భయపడే అజగత్తుడను ముని తన పుత్రుణ్ణి అమ్ముకున్నాడు. అలా భయపడకుండా ముందుకు సాగండి.



## ఓవర్ కాన్ఫిడెన్స్ కొంపముంచుతుంది

▪ కొంతమంది భవిష్యత్తులో సంపాదించకపోతామా అని, ఆ ఆదాయంతో తీర్చేయవచ్చని ధనశక్తికి మించి కొనుగోలు చేస్తారు. కానీ పరిస్థితులు ఎప్పుడూ మనం ఊహించినట్టు వుండవు. ఆ ఓవర్ కాన్ఫిడెన్స్ పనులే మహాభూతాలుగా మారి ఆర్థికంగా చికాకులనూ, నష్టాలనీ తెప్పిస్తాయి. అలా చేసి బాధపడుతున్నవారు మన చుట్టూ ఎంతోమంది ఉన్నారు. వారిలా మనం అవ్వకూడదు.



## సంకల్పానికి మించినది లేదు

▪ ఏదైనా సరే ఎంతటి మహాకార్యమైనా సరే మీరు సాధించాలనుకుంటే ఆ సంకల్పము బలంగా ఉంటే సాధించగలరు. నిరంతరము దాన్ని గూర్చే ప్రణాళిక, ప్రతి పనీ, ప్రతీ మాటా అదే అని మీరు చేస్తే ఎంతటి కార్యమైనా అయిపోతుంది.

పక్కవారు మీ కోరికలని గొంతెమ్మ కోరికలని విమర్శించినా, నవ్వినా, వెనకడుగు వేయొద్దు. సంకల్పాన్ని వీడొద్దు. అలా సంకల్పం చేతనే మహామహులకి సాధ్యం కాని బొందితో స్వర్గాన్ని త్రిశంకుడు పొందాడు.







## ధనవంతుడు

▪ సంపదను అదుపులో ఉంచినవాడు. అనగా వ్యర్థమైన ఖర్చులను చేయనివాడూ, కీర్తికోసం సంపద వెచ్చించనివాడూ, వ్యసనాలకి ధనాన్ని వెదజల్లనివాడూ, పరులకీ సాటివారికీ కష్టమొచ్చిందంటే ధనాన్ని రెండు చేతులా ఖర్చుపెట్టినవాడూ అట్టివాడు గుణవంతుడు, భగవంతుడు, ధనవంతుడు.



## సమస్యలే సంపదలకు అడ్డం

▪ సమస్యలు వందరకాలు...అనేక సమస్యలతో వృత్తిపై ఏకాగ్రత కుదరటం లేదనీ, మనశ్శాంతి లేదనీ...చికాకులనీ....అలాంటి వాటి ద్వారా ధనం సంపాదించలేకపోతున్నామని కొంతమంది అనుకుంటారు. అసలు సమస్యలు ఎవరికి లేవు? మన రాష్ట్రాన్ని ఏలే ముఖ్యమంత్రికీ, దేశప్రధానమంత్రికీ, ఈ ప్రపంచాన్ని ఏలే వైట్ హౌస్ అధిపతికీ సమస్యలు లేవా? ఓసారి ఓ ఇల్లాలు బుద్ధుని వద్దకొచ్చి నాకున్న సమస్యలెవ్వరికీ లేవు. అవి తీర్చండీ అని అడిగింది.

దానితో బుద్ధుడు ఆమెని సమస్యలు లేని ఇంటినుంచి గుప్పెడు ఆవాలు తెమ్మని చెప్తాడు. ఆపై నీ సమస్యలన్నీ తీరుస్తానని చెప్పాడు. ఆమె గ్రామమంతా తిరిగింది. సమస్యలా, అసలు నా సమస్యల ముందు నీ సమస్యలెంత?...అని ప్రతివారూ చెప్పటంతో బుద్ధుడు దగ్గరి కొచ్చి విషయాన్ని చెప్పింది. సమస్యలు మానవులకే కాదు. దేవతలకీ, సమస్త ప్రాణి కోటికీ వున్నాయి. కాన సమస్యలు వస్తుంటాయి, పోతుంటాయి. మన ధర్మాలను మనం చేసుకుంటూ పోతే మహాసుఖాలనిచ్చే సంపదలను పొందవచ్చు.



## భార్యంటే సంపద... సుఖమే

■ ఇంటి ఇల్లాలిని తూలనాడితే శ్రీమహావిష్ణువు అంతవానికే గుక్కెడు నీళ్ళు దొరకలేదు. భిక్షాటనకు వెళ్ళినా ఎవ్వరూ పిడికెడు గింజలు రాల్చలేదు. వైకుంఠమే బోసిపోయింది. గృహిణిని బాధపెడితే కలిగే కష్టాలను భరించలేక భార్య లక్ష్మీదేవితో తాను తొందరపడ్డాననీ, మరెప్పుడూ నీ కంట కన్నీరు పెట్టించననీ చెప్పాడు.



## పరిశుభ్రత లేకుంటే వచ్చేది

■ లక్ష్మీదేవి అక్క అనగా జ్యేష్ఠలక్ష్మి. ఆమె అపరిశుభ్రంగానున్న గృహంలోకీ, ఇల్లూ వాకిలీ ఊడ్చని ఇంటిలోకీ, శుచీశుభ్రత లేని ఇల్లాలు ఉన్న ఇంటికీ, అంట్లూ, ముట్లూ, మైలలను కలిపేసుకునే వారి ఇంట ప్రవేశిస్తుంది. నియమ ప్రకారం తన అక్క వున్న గృహంలో లక్ష్మి ఉండకూడదు. కాబట్టి శ్రీమహాలక్ష్మి వెళ్ళిపోతుంది. దానితో మహా కష్టాలూ, వ్యథలూ తప్పవు.

■ కమలసప్తమీ వ్రతమును చైత్రవైశాఖ మాసంలో శుక్లసప్తమీ నాడు శ్రీమత్స్యపురాణంలో చెప్పిన ప్రకారం చేయటం వల్ల దోషాలు పోయి మహాసంపదలు కలుగుతాయి.



## ఇద్దరే

■ క్షమించగలిగేది తల్లి, భూమి మాత్రమే. ఈ ప్రపంచంలో బాటసారులు ఇద్దరే సూర్యుడూ, చంద్రుడూ. అలానే అతిథులు కూడా ఇద్దరే ఒకటి ధనం, రెండు యవ్వనం. అలాగే ఓడిపోయిన వారూ ఇద్దరే ఒకరు కన్యాదానం చేసినవాడూ, అప్పు చేసినవాడూ.







## శరీరంలో ఏ భాగం అదిరితే ఎలాంటి శుభం

■ కనుబొమలు అదిరితే సన్నిహిత్యము, కంటి కొస గానీ, అరచేయి గానీ అదిరితే ధనలాభం. పురుషులకి కుడివైపు, స్త్రీలకు ఎడమవైపు అదిరితే లాభం.

రావణసంహారం కోసం శ్రీరాముడు వారధి కడుతుంటే సీతాదేవికి ఎడమ కన్ను అదిరింది. శుభసూచకమని సంతోషించింది లోకమాత.



## శ్రీమహాలక్ష్మీ దేవి అక్క నివాసస్థానాలు

■ ఇంటి ఇల్లాలి కంటతడి పెట్టించిన వానియందూ, భర్తతో గొడవపడే భార్యయందూ, పిల్లలను తిట్టే, కొట్టే ఇంటిలోనూ..... ఆడవాళ్ళను అసహ్యంగా చూసేవాళ్ళలోనూ, ప్రవర్తించేవాళ్ళలోనూ, స్త్రీల గూర్చి అసభ్య ప్రచారాలు చేసే వారి యందూ, చెడు స్వభావము గల స్త్రీల యందూ, విపరీత కామాన్ని కోరుకునే మదవతుల యందూ, భర్తను మోసము చేసే వారియందూ, పతిని అవమానం చేసేవారి యందు సర్వదా జ్యేష్ఠాదేవి ఆవహించి ఉంటుంది.



## సంపదల కోసం చెయ్యాల్సినవి

■ శ్రీమహాలక్ష్మి ప్రీతికోసం మంగళవారం, శుక్రవారంలలో మద్యమాంసాలను వదిలేయాలి. ఒక్కపూట భోజనాన్ని చెయ్యటమూ, ఇంకా ఆ రోజులలో నూనె రాసుకోకపోవటమూ, నూనె వస్తువులు తినకపోవటమూ వంటి వాటి వల్లా, ఆ రోజులలో కమలాలతో లక్ష్మీ పూజ చేయటం వల్లా సంపదలు వృద్ధి అవుతాయి. ఈ రెండు రోజులూ ధనాన్ని ఆపదలలో ఉన్న వారికి ఇవ్వటంలో దోషం లేదు.



## శ్రీమహాలక్ష్మి అక్క జ్యేష్ఠాదేవి శాపం

■ క్షీరసముద్రంలో శ్రీమహాలక్ష్మిదేవి కంటే ముందు పుట్టింది జ్యేష్ఠాదేవి. ఆమె భర్త శనీశ్వరుడు. ఓసారి జ్యేష్ఠాదేవి కామబాధతో భర్తని చేరింది. ధ్యానంలోనున్న శనీశ్వరుడు ఎంతకీ స్పందించక పోయేసరికి కోపించింది. నీవు ఎవరివైపు చూస్తావో వారు సర్వవ్యధలకూ, బాధలకూ గురి అవుతారని శపించింది. ఆ శాపం వల్లే శనీశ్వరుడి దృష్టి పడిన వారు అష్టకష్టాలు పడుతున్నారు.



## హద్దు మీరిన సంపద

■ మహా అనర్థాలకు అవకాశం కల్పిస్తుంది. ధనం ఉన్నది కదాని అహంకారంతో ఏం మాట్లాడుతున్నాడో, ఏం చేస్తున్నాడో తెలియకుండా చేస్తే ఆ అహాలకి కారణమైన సకల సంపదలు హరించుకుపోతాయి. చుట్టూ హితులూ, బంధువులూ దూరమై ఏకాకిగా బ్రతకాల్సి వస్తుంది.



## అనారోగ్య లక్ష్మి (జ్యేష్ఠాదేవి) నివాసముండే ఆహారం

■ నిన్నటి ఆహారము, పాచి పట్టినదీ, కుళ్ళిన వాటితో చేసిన ఆహారమూ, రెండోసారి వేడి చేసిన ఆహారమూ, ఎంగిలి చేసినదీ, అతి చల్లనైనవీ, అతి వేడి కలవి తమో రజో గుణాలను పెంచుతాయి. తద్వారా బుద్ధి చేయకూడనివాటినీ, అకార్యాలనూ చేయమని ప్రేరేపిస్తుంది. దానితో వంకర దారిలో ప్రయాణించి తిరిగి వెనక్కి రాలేని స్థితిలో ఉండిపోతాడు.







## ఏ రోజు ధనాన్ని ఇవ్వకూడదు

మంగళవారం, శుక్రువారం, అమావాస్య రోజులలో ఎవ్వరికీ అప్పు ఇవ్వకూడదు. ఆ రోజుల్లో పాతబట్టలు కూడా ఎవ్వరికీ ఇవ్వకూడదు. మిగతా రోజుల్లో పాతబట్టలని ఇస్తే కనీసం ఓ రూపాయి అయినా తీసుకొని ఇవ్వాలి.



## తోరం, సూత్రం వంటివి ఎక్కడపడితే అక్కడ పారేయరాదు?

తొమ్మిది వరుసల త్రాడును పూజాదికాల్లో ఉంచి కట్టుకోవడం మన సంప్రదాయము. మరియు పూజా శాస్త్ర నియమము. అలాంటి పవిత్రమైన తోరాలనీ, సూత్రమునూ అవమానించుట, ఎక్కడ పడితే అక్కడ పడేయటం వంటిది చేయకూడదు. సూత్రమంటే సాక్షాత్తు శ్రీమహాలక్ష్మీదేవి నివాసస్థానం. అంతటి శక్తివంతమైన సూత్రంను నలుడు తేలికగా మాట్లాడడం వల్ల ఆయనా, ఆయన భార్య దమయంతీ ధరిత్రీదేవి కోపానికి గురై మహా యాతనలు పడ్డాడు.



## ఉసిరి వృక్షం ఎంతటి విశిష్ఠత గలది

■ ఉసిరిచెట్టు శ్రీలక్ష్మీ నారాయణుల నివాసస్థానం కూడా. మీ గృహంలో ఉసిరిచెట్టు ఉండడం వల్లా, ఇంకా ఏకాదశినాడు ఉసిరిరసం నీటిలో కలుపుకొని స్నానం చెయ్యటం ద్వారా మహాసంపదలు కలుగుతాయి.



## జ్యేష్ఠాదేవి ఎలా ప్రవేశిస్తుంది

■అబద్ధాల ద్వారా, అధర్మం ద్వారా, అనారోగ్యం ద్వారా, మోసం ద్వారా, గోళ్ళద్వారా, శుభ్రత లేని ప్రదేశాల ద్వారా ఇంకా భర్తని మోసం చేసిన ఆడదాని ద్వారా, తరచూ గొడవ పడే భార్యాభర్తల ద్వారా ఎవ్వరినైనా, ఎంతటి వారినైనా ఆవహిస్తుంది.



## గృహంలో కమలం ఉంచుకోవటమంటే

■ కమలం శ్రీమహావిష్ణువూ లక్ష్మీదేవిల స్థానం. ఇంటిలో కమలం ఉంచటమంటే లక్ష్మీనారాయణులను ఉంచినట్టే. శ్రీమహాలక్ష్మీదేవిని కమలపు పూలతో పూజిస్తే సంపదలు వృద్ధి చెందుతాయి.



## అతి చిన్న నిర్లక్ష్యం ఖరీదు

■ అతి చిన్న నిర్లక్ష్యం ఒక్కోసారి సమస్త సంపదలనూ, అధికారాన్నీ దూరం చేస్తుంది. విజయాన్ని కోరేవారూ, మహా వైభోగాన్నిచ్చే గమ్యానికి చేరాలనుకున్నవారు ఒక్క చిన్న తేడా కూడా చేయకూడదు.

అది మీరే కాదు, మీ ఉద్యోగులు చేసినా ఫలితం మీరే అనుభవించాల్సి ఉంటుంది. పూర్వం రెండు దేశాల మధ్య యుద్ధం ప్రారంభమయింది. ఇరు పక్షాలూ రణరంగానికి సమాయత్తమవుతున్నారు. గుఱ్ఱాలకి నాడాలు బిగుస్తున్నాడు సంబంధిత ఉద్యోగి. ఓ నాడా తక్కువయింది. ఆ ఏముందిలే అని వాడు ఓ గుఱ్ఱాన్ని తగ్గించాడు. ఆ గుఱ్ఱం తగ్గటంతో రథమునకు కట్టాల్సిన గుఱ్ఱాలలో ఓ అశ్వం





తగ్గింది. రథానికి ఓ గుఱ్ఱం తగ్గటంతో రక్షణగా వుండే సైనికుల్లోంచి ఓ సైనికుడ్ని తగ్గించాడు. దాంతో కేవలం ఆ కారణంగా ఆ దేశపు రాజు బందీ అవ్వాల్సి వచ్చింది.



## ధనం......

■మహావైభోగాలను పొందటానికి కావల్సింది...... ధనం

■ భార్యాపిల్లల సంతోషం కోసం కావాల్సింది...... ధనం

■ వయసు వల్ల, వంశపారంపర్యం వల్ల వచ్చే వ్యాధులను పోగొట్టుకోవటానికి కావల్సింది...... ధనం

■ చుట్టూ పది మందిని రక్షణ కవచంలా ఉంచేది...... ధనం

■ మంచి కార్యాలు చేసి కీర్తినీ, గౌరవాన్నీ సంపాదించాలంటే కావలసింది...... ధనం

■ మంచిగాలినీ, మంచి ఆహారాన్నీ, మంచి నిద్రనూ ఇచ్చేది.. ధనం

■ అందరి నుంచి మహావినయ విధేయతలని అందించేది...... ధనం

■ స్నేహితులూ, చుట్టాలూ, చుట్టుప్రక్కలవారూ అంతా మీరు చెప్పిందే వేదమని భావించేలా చేసేది...... ధనం

■ సమాజంలో పెద్ద మనిషిగా నిలబెట్టేది...... ధనం

■ మహా అదృష్టాల్లో ఒకటైన పుణ్యతీర్థ విహారప్రదేశాలను చూపించేది...... ధనం

■ చంద్రుడు చండాలుడి ఇంట కూడా ప్రకాశించినట్టు ధనం ఒక్కోసారి నీతిరహితమైన వార్నీ అనుగ్రహిస్తుంది. కానీ అది శాశ్వతానందం కాదు.

## ఇవి చేస్తే శ్రీమహాలక్ష్మి అరక్షణం కూడా ఉండదు

- శుభ పర్వదినాల్లో భార్యభర్తలు కలవటము
- రెండు చేతులతో తలను గోక్కోవటము
- గోళ్ళని తినటము
- సూర్యభగవానునికి ఎదురుగా పళ్ళు తోముకోవటము
- ఒంటిమీద నూలుపోగు లేకుండా నిద్రించటము
- కటిక చీకటిలో నిద్రించటము
- నిండా ముసుగుతన్ని పడుకోవటము
- పక్కవారు పెట్టుకున్న పూలమాలలను ధరించటము
- పుస్తకాలను కాలితో తన్నటము
- నట్టింటిలో నిద్రపోవటము

■ క్షవరం, గడ్డం వంటివి చేసుకొని స్నానం చెయ్యకుండా నడి ఇంట్లో తిరగటము.

■ ఎక్కువ భోజనము చెయ్యటము ఇత్యాదివన్నీ చెయ్యటము, ప్రవర్తించటమంటే శ్రీమహాలక్ష్మికి వీడ్కోలు చెప్పటమే.

## సంపదను పొందటానికి కావలసినవి

■ ముఖ్యంగా మూడు గుణాలు. బలం... శౌర్యం.. వేగం. ఈ గుణాలే మిమ్మల్ని కుబేరుడంతటి వాణ్ని చేస్తాయి. ఈ త్రిగుణాలే మీకూ, మీ కుటుంబానికీ మహా సౌఖ్యాలను అందిస్తాయి.





## ఈ ఈ సమయాల్లో నిద్రించకూడదు

■ బ్రహ్మీముహూర్తాన నిద్రించరాదు. అలాగే పగటి నిద్రా, పగటి మైథునం అరిష్టమే. సంపదలూ నాశనమవుతాయి.

పరులపాలు అవుతాయి. పగలు పని చేయాలి. రాత్రి సుఖించాలి. అటూ ఇటూ అయితే పగలూ, రాత్రీ దుఃఖమే.

## ఫలవృక్షాల కొమ్మలు లక్ష్మీ స్థానాలు

■ సీతాఫలం, దానిమ్మ, పూలతీగ చెట్లు లక్ష్మీ స్థానాలు. వాటిని విరవటం, వంట చెరుకుగా ఉపయోగించటం ఇత్యాదివన్నీ లక్ష్మీదేవికి చేసే దోషాలు.

పూల చెట్లను అపరిశుభ్రంగా ఉంచటము అంటే శ్రీలక్ష్మీదేవిని అగౌరవ పరిచినట్టే. అలాగే పువ్వుల చెట్లకి మురికి నీరు, మిగిలిన నీరు పొయ్యటం ఇత్యాది దోషాలు చేస్తే శ్రీలక్ష్మీదేవితో పాటు భూదేవి కూడా సహించదు.

## స్త్రీవల్లే సంపద కలుగుతుంది

■ ఇంటి ఇల్లాలి సహకారం లేకపోతే ఎంతటి తెలివి గలవాడైనా, శక్తివంతుడైనా, బలవంతుడైనా ధనాన్ని పొందలేడు. పుట్టుకే లేని నారాయణుడు జగన్మాతతో కలవటం వల్లే నారాయణుడు... శ్రీమన్నారాయణుడయ్యాడు. శ్రీమహాలక్ష్మిని పొంది శ్రీమంతుడయ్యాడు.



# మీ సొమ్ము తిన్నవారే మీ ధనాన్ని పోగొడతారు

■ స్నేహితుడనీ, తన వాడనీ రకరకాల కారణాలతో ఇష్టపడి మంచి వేస్తారు. జీవితంలో అన్ని రకాలుగా ఎదగటానికి సహాయం చేస్తారు. అందరూ కాకపోవచ్చు. అయితే మీకు అపకారం జరిగినా వారి వల్లే, సకల సంపలు దూరమైనా వారి వల్లే. ఒక్కోసారి వారి వల్ల ప్రాణాలు కూడా పోయే ప్రమాదం రావచ్చు. అలాంటి మనస్తత్వం గలవార్ని మొదటే గమనించండి. అభిమానంలో పడి ఏముందిలే అని అనుకుంటే మీ పాలు తాగి శరీరమంతా విషం నింపుకొని మిమ్మల్నే కాటు వేయటానికి చూస్తారు.



# ధనమే వయసుని తగ్గిస్తుంది

■ డబ్బు సమస్య మనిషిని పదేళ్ళు ముందుకు పంపిస్తుంది. శరీరంలో శక్తినీ, మనశ్శాంతినీ, ఆత్మ విశ్వాసాన్నీ తగ్గిస్తుంది. ధైర్యాన్ని పంపించి, పిరికి తనాన్ని ఆహ్వానిస్తుంది. ధనము ఉన్నప్పుడు మీ ఆత్మవిశ్వాసానికీ, ధనము లేనప్పుడు మీ ఆత్మవిశ్వాసానికీ తేడాను మీరే గమనించవచ్చు.

మీరలా గమనించి జాగ్రత్త వహిస్తే ఇక మీకు తిరుగుండదు. విజయలక్ష్మి, ఆరోగ్యలక్ష్మి, ధనలక్ష్ముల దీవెనలను పొందుతారు. ఘోరారణ్యంలో నలుడు కాంతి విహీనమై, బక్కచిక్కిన శరీరంతో గుర్తు పట్టనంతగా గడిపాడు. అదే తిరిగి రాజ్యలక్ష్మిని పొందిన తర్వాత భూమిపై ఇంద్రునిలా దమయంతితో జీవించాడు. ధనం శక్తినే కాదు, ధైర్యాన్నీ, యవ్వనాన్ని కూడా ఇస్తుంది.







# వెళ్ళేటప్పుడు వెనక్కి పిలవద్దు

■ చాలా మంది పనిమీద వెళ్ళే వాళ్ళని అసంకల్పితంగానో, అవసరార్థమో వెనక్కి పిలుస్తుంటారు. ఇంట్లో ఉండగా గుర్తుకు రానిది గుమ్మం దాటడం ఆలస్యం గుర్తుకు వస్తుంది. వెంటనే పిలుస్తారు. దానితో వెనుతిరగాల్సి వస్తుంది. ఆ తిరగటం అంతటితో ఆగదు. ఆ రోజంతా ప్రతి పనీ ఎదురు తిరుగుతుంది. దానికి కారణం వెనక్కి పిలవటమే.

చెయ్యాల్సిన పనుల గూర్చి స్థిర నిశ్చయంతో ఆలోచిస్తూ గుమ్మం దాటుతారు. వెంటనే వెనక్కి పిలవటంతో తెలియని చిరాకూ, విసుగూ వస్తాయి. ఆ ప్రభావము ప్రతి పని మీదా పడుతుంది. తద్వారా ప్రతీ ప్రక్రియ ఆలస్యం అవుతుంది. ఆలస్యం అంటే డబ్బు అనుకున్న సమయానికి రాకపోవటం.

అనుకున్న సమయానికి ధనము రాకపోతే అప్పు చేయాలి. అప్పు చేస్తే వడ్డీ... వెరసి సంపద తగ్గుదల. అలా వేటకి వెళ్తున్న భక్త కన్నప్పను భార్య పిలవటం వల్లే ఆ రోజంతా ఒక్క వేట కూడా దొరకలేదు. గుమ్మం దాటుతున్న వారిని పిలవవద్దు. సంబంధించిన పని గడప దాటక ముందే చెప్పి గుర్తు చేయండి.



# మహా ఆభరణాలు

■ అడిగిన వారికి లేదనకుండా ఇచ్చే చేతులు... నీతి తప్పని, ఆడి తప్పని నైజం... ఆపదలోనున్న వారిని రక్షించే తత్వము.. స్త్రీకి శీలం... ఇవే సకల సృష్టిలోనూ వున్న మహా సంపదలు. అవే వారికి మహా విలువైన ఆభరణాలు.



## బంగారము దొంగిలిస్తే

■ అంతకు మించిన పాపదోషం మరొకటి లేదు. దాన్ని కోల్పోయిన వారి వ్యధ మహా శాపమై వార్ని ఆవహిస్తుంది. అలా చేసిన వారు వ్యాధుల బారిన పడటమో, మహా వ్యసనాల్లో చిక్కుకోవటమో జరుగుతుంది. అధికారం కూడా కోల్పోవాల్సి వస్తుంది.

వంశపారపర్యం ఆ పాపఫలాన్ని పొందాల్సి ఉంటుంది. భారతదేశంలోని బంగారంపైనా, వజ్రాలపైనా కన్నేసిన ఎంతోమంది ఫ్రెంచి, జర్మన్ చక్రవర్తులు అకాల మరణాలు పొందాల్సివచ్చింది.



## నెమలి సింహాసనము

■ అయిదు గజముల ఎత్తుతో, మూడుంపావు గజముల పొడుగుతో, రెండున్నర గజముల వెడల్పుతో వజ్రవైఢూర్య మణిమరకతాలతో ధగధగ మెరిసిపోయేలా ఉంటుంది.

■ షాజహాను అధిష్టించిన సింహాసనమునకు పై కప్పు ఊతగా పచ్చలతో చేసిన పన్నెండు స్థంభాలను నిర్మించారు.

■ నవరత్నాలు పొదిగిన రెండు నెమళ్ళు, వాటి మధ్య వజ్రాలూ, కెంపులూ, పచ్చలూ, ముత్యాలూ తాపడం చేసిన బంగారు వృక్షం.. సింహాసనం ఎక్కటానికి మూడు బంగారపు మెట్లు.

■ చక్రవర్తి కూర్చోవటానికి వీలుగా సింహాసనంలో పదకొండు బంగారు ఆనుడు పీటలు.

■ నెమలి సింహాసనం నిర్మించటానికి ఏడు సంవత్సరాలు పట్టింది. నిర్మాణ వ్యయం ఆ రోజుల్లోనే కోటి రూపాయలు.







## బంగారు ఆభరణం స్వామికి సమర్పిస్తే

■ అనారోగ్యంతో బాధపడేవారూ, దీర్ఘకాలంగా తగ్గని వ్యాధులున్న వారూ ఇష్టదైవానికి బంగారు ఆభరణం సమర్పిస్తే దోషాలు తొలగిపోతాయి. రాజులూ, చక్రవర్తులూ విజయము చేకూరినప్పుడూ, వారింట శుభకార్యాల సమయాలలో స్వామివార్లకు ఆభరణాలు ఇవ్వటం తెలిసిందే. కానీ చక్రవర్తులూ, రాజులూ తమకిగానీ, తమవారికి గానీ అనారోగ్యం కలిగినప్పుడు కూడా స్వామికి మొక్కుకుని అరోగ్యవంతులయ్యాక నవరత్నహారాలను సమర్పించేవారు. కాన అనారోగ్యం కలవారు ఇష్టదైవానికి మొక్కుకుని శక్తిమేర సమర్పించటం ద్వారా దోషాలు తొలగిపోతాయి.



## అసలు సిసలు సమస్య

■ ఓ సంసారి ఓ యోగి పుంగవుని దగ్గరికి వెళ్ళాడు. తన బాధనంతా చెప్పుకున్నాడు. స్వామీ మా అమ్మకు నా భార్యంటే పడదు. ఎప్పుడూ తిడుతూ, విసుక్కుంటూ ఉంటుంది. అలాగే నా భార్యకూ అమ్మంటే పడదు. రుస రుస లాడుతూ వుంటుంది. వాళ్ళ కోపాలకీ, విసుగుకీ కారణం ఉండదు. ఇక వాళ్ళిద్దరూ పిల్లల మీద కోపాన్నీ, ద్వేషాన్నీ చూపిస్తుంటారు. పిల్లలూ వారిద్దరి మీద రుసరుసలాడుతూ ఉంటారు. వారి ప్రవర్తనకి కారణం ఉండదు. ఇక నా సంగతి. నా కుటుంబ సభ్యుల మీద అనవసర చికాకూ, అసహ్యం, విసుగూ కలుగుతుంటాయి. దానికి నాకు కారణం కనపడదు. ఇలా ఎందుకు ఉంటుందో అర్థం కాక మీ దగ్గరకు వచ్చాను స్వామి. దానికి ఆ యోగి ఒకే ఒక మాట చెప్పాడు.

'చాలినంత ధనం సంపాదించలేక పోవటమే కారణం నాయనా' అని.



## శ్రీ మహాలక్ష్మి, శ్రీ జ్యేష్ఠాదేవిలలో ఎవరు అందగత్తెలు

■ ఇద్దరూ సౌందర్యనిధులే. అమృత మూర్తులే. కమలాల వంటి కన్నులు గలవారే. అందానికి ప్రతిరూపాలే. అయినా శ్రీమహాలక్ష్మీదేవి వచ్చేటప్పుడు అద్భుత అందంతో మెరిసిపోతుంటుంది. శ్రీ జ్యేష్ఠాదేవి వెళ్ళేటప్పుడు అనంతమైన అందంతో విలసిల్లిపోతుంటుంది.



## పక్కవారితో పోల్చుకుని మీ నగలని నిర్లక్ష్యం చేయద్దు

■ మీకంటే పెద్ద నగ పక్కంటి ఆమె చేయించుకుందని ఆ కోపాన్ని మీ భర్త మీద చూపించొద్దు. నీవు మహా చేయించావులే అని నగను విసిరేయవద్దు. అది మహా దోషం. కైక అలా చేస్తే ఏమయిందో తెలియనిది కాదు. బంగారపు నగ వందకాసులదయినా, గ్రాముదయినా లక్ష్మీ రూపమే. అందుకే శ్రీవరలక్ష్మీ వ్రతమప్పుడు చిన్న లక్ష్మీరూపు పెట్టుకుని పూజ చేసేది. మీకు నగలు లేని కోపాన్ని భర్త మీద అదీ బంగారాన్ని నిర్లక్ష్యం చేస్తూ ప్రవర్తించటం, మాట్లాడటం తగదు.



## శ్రీమహాలక్ష్మి, జ్యేష్ఠాదేవిల రాకపోకలు

■ గృహ ప్రధాన ద్వారంలో శ్రీమహాలక్ష్మి అడుగుపెడుతుంటే దొడ్డి గుమ్మం నుంచి శ్రీజ్యేష్ఠాదేవి వెళ్ళిపోతుంది. శుక్రవారం అర్ధరాత్రి శ్రీమహాలక్ష్మి గృహం నుంచి వెళ్ళిపోతుంటే, అదే సమయంలో అర్ధరాత్రి జ్యేష్ఠాదేవి ప్రవేశిస్తుంది. ఆ ఇద్దరు తల్లుల రాకపోకల సమయాలు అవే.







## మహా ధన ప్రాప్తి కోసం

■ ప్రతిరోజూ శ్రీసూక్తం చదివితే అఖండ లక్ష్మి కరుణిస్తుంది. ఆర్థికంగానే కాదు ఆరోగ్యంగానూ, శక్తిగానూ, తేజస్సుగానూ ఉంటారు. శ్రీసూక్తం పఠించిన గృహం నుంచి పెద్దమ్మ వెళుతుంది. చిన్నమ్మ ఐశ్వర్యలక్ష్మి ప్రవేశిస్తుంది.



## అడిగి పుచ్చుకుంటే అధిక లాభం

■ వ్యాపారం కావచ్చు, వ్యవహారం కావచ్చు. మీ విద్వత్తుకు మెచ్చి ఏం కావాలి, ఎంత కావాలి అని అడిగినప్పుడు ఖచ్చితంగా మీ శ్రమకీ, తెలివి తేటలకీ తగ్గట్టుగా అడగాలి. శ్రీకృష్ణుడు కుచేలుణ్ని 'ఏం కావాలి' అని అడిగితే 'నీ ఇష్టం' అన్నాడు సుధాముడు.

దాని వల్ల కలలో కూడా చూడని, ఊహించని ధనాన్ని పొందాడు. కానీ ఈ కలియుగంలో మీ ఇష్టమంటే... పదో, పరకో చేతిలో పెడతారు. దానితో మీరు లోపల బాధపడుతూ పైకి మాత్రం నవ్వుతూ తీసుకోవాల్సి వస్తుంది.



## అలక్ష్మి లక్షణాలు

■ మహా ఆకలి... వేళ కాని వేళ నిద్ర.. అపరిశుభ్రత... నిన్న పని రేపు చేద్దామనుకునే మహా బద్ధకము. బానలాంటి పొట్ట. విరబోసుకుని ఉన్న జుట్టు. అకాల భోజనము.

దైవారాధన లేని గృహము. ఎడమ చేతితో తలగోక్కోవటము, గుమ్మాన్ని తన్నటము.



# అత్యంత దురదృష్టవంతుడు

■ మహా ఆపదలు పడిన వాడు కాదు. తినటానికి తిండి లేని సమయంలో వచ్చిన బంధువులకి తిండి పెట్టలేని వాడు కాదు. రారాజుగా బ్రతికి శరీర యాత్ర కోసం దాస్యము చేసేవాడు కాదు. పధ్నాలుగు భువన భాండాల్లో అత్యంత తేలికైనది అయిన గడ్డి పరక కూడా దురదృష్ట వంతురాలు కాదు. అత్యంత తేలికయ్యేవాడూ, దురదృష్టవంతుడూ ఎవరో కుచేలుడు చెప్పాడు. ఆ ఒక్కడు ఎవరో కాదు ధనాన్ని యాచించేవాడంట.



# ధనం గొప్పదా? జ్ఞానం గొప్పదా?

■ ఇదే విషయంలో ఓసారి శ్రీమహాలక్ష్మి, సరస్వతీ దేవిల మధ్య వాదన వచ్చింది. ధనం గొప్పదని శ్రీవైకుంఠ వాసినీ, కాదు జ్ఞానమే గొప్పదని సృష్టికర్త భార్యా తీవ్రస్థాయిలో నొక్కి చెప్పారు. ఆ వివాదం తెగకపోవటంతో పార్వతీదేవిని సంప్రదించారు. అర్థనారీశ్వరి ఆ సమస్యని పరమశివునికి విన్నవించింది.

దానితో ఈశ్వరుడు పిడికెడు విభూదిని ఇచ్చాడు. ఇది పాండిత్యము. దానికి తగ్గ ధనమివ్వమన్నాడు. శ్రీమహాలక్ష్మి ఆ విభూది బరువుకి మహా ధనరాసులను కురిపించింది. అయినా తూగలేదు. దానితో శ్రీమహాలక్ష్మి జ్ఞానమే గొప్పదని అంగీకరించింది. అప్పుడు చెప్పింది ఆదిలక్ష్మి....

ధనంకన్నా జ్ఞానం గొప్పది. జ్ఞానం కన్నా ధనం గొప్పది. కాని ధనం, జ్ఞానం కలవగలిగితే అంతకు మించిన గొప్పది ఈ పధ్నాలుగు భువన భాండాల్లో ఏదీ లేదు అని.







# గీత లోపలే ధనాన్ని ఖర్చు పెట్టండి

■ డబ్బుంది కదా, వయసుంది కదా, కోరికలున్నాయి కదా అని మహా సుఖాలను పొందితే, శృంగార వైభోగాలు అంది పుచ్చుకుంటే అష్టైశ్వర్యాలైనా తరిగిపోతాయి. నెలలో ఇరవై నాలుగు రోజులు ధనాన్ని సంపాదించాలి. ఆరు రోజులు సుఖాలను పొందాలి. అలా కాకుండా ఇరవై నాలుగు రోజులు సుఖాలకి లోనయినందువల్లే మహా ఐశ్వర్యాలు గల శ్రీనాథ కవి సార్వభౌముడంతటి వాడు కూడా సకలం పోగొట్టుకోవాల్సి వచ్చింది. మహా గౌరవాలను పొందిన విజయనగర రాజుల చేతిలోనే బందీ అవ్వాల్సి వచ్చింది.



# జ్యేష్ఠాదేవి రూప వర్ణన

■ తనని పట్టించుకోకుండా శ్రీమహావిష్ణువుని ధ్యానం చేస్తుండటంతో జ్యేష్ఠాదేవికి భర్త మీద కోపం వచ్చింది. నేను పిలుస్తుంటే నావైపు చూడవా... అందుకు ఇదిగో నా శాపం. నీ దృష్టి ఎవరిపై పడితే వారు మహా భ్రష్టులవుతారని శపించింది. అంతటి కోప స్వభావమే కాదు శాంత స్వభావం కూడా ఆమెకి వుంది.

దానికి తగ్గ రూపం కూడా. ఉదయించే సూర్యభగవానుని ప్రకాశంతో, మహా చిరునవ్వులను చిందిస్తూ ఎర్రరంగు చీరను ధరించి అక్షయ పాత్రనూ, అంకుశాన్నీ, బంగారు కలశాన్నీ, పాశాన్ని ధరించి ఉంటుంది. కమలాల వంటి కన్నులు గలది. సౌందర్య రూపిణి. పద్మమునందు నివాసమై ధర్మపరుల ఇంట ప్రవేశించక అధర్మపరుల ఇంట ఏదో ఒకరూపంతో తిష్ఠ వేస్తుంది.



## ఈ లక్ష్మి పోతే
## అష్టలక్ష్ములు పోయినట్టే

■ ధనం పోవచ్చు. అయినవారూ, స్నేహితులూ దూరమవ్వచ్చు. కీర్తి పోవచ్చు. పలుకుబడి పోవచ్చు. ధైర్యలక్ష్మి కూడా పోవచ్చు. ఎన్ని లక్ష్ములు పోయినా ఆరోగ్యలక్ష్మి మాత్రం పోకూడదు.

అదే పోతే అష్టలక్ష్ములు శాశ్వతంగా దూరమయినట్టే. అలవాట్ల వల్లగానీ, ఆవేశము వల్లగానీ, పగాప్రతీకారాలతో ఆరోగ్యం నాశనం చేసుకుంటే జీవితం అయిపోయినట్టే.

దురలవాట్లతో సతీ అనసూయ భర్త కూడా వ్యాధులకి గురి కావాల్సి వచ్చింది. ఇది ధర్మయుగం కాదు. కలియుగం. దేన్నైనా సరే ఒక్కసారి పోగొట్టుకుంటే అది పోయినట్టే. తిరిగి రానట్టే.



## సకల అవమానాలకీ, దరిద్రాలకీ
## కారణం శనీశ్వరుడు కాదు

■ శని గ్రహాలకి అధిపతి. శ్రీమహాలక్ష్మి అక్క జ్యేష్ఠాదేవి భర్త అయిన శనీశ్వరుడు కర్మలను బట్టీ, పూర్వ జన్మ సుకృతాలని బట్టీ, మనిషి జన్మించిన లగ్న కాలాదుల ప్రకారం తన ధర్మం తాను చేస్తాడు. అలాగే మహా ప్రాణాంతకమైన ప్రమాదాలను నివారించేది శనీశ్వరుడు. ధనం పోవటానికీ, తద్వారా వచ్చే సకల బాధలకీ కారణం జ్యేష్ఠాదేవి. తన భర్త శనీశ్వరుని ద్వారా స్థిర లక్ష్మిని దూరం చేస్తుంది.

అన్యాయంగా ధనం సంపాదించటం, పరులను బాధ పెట్టి పొందే సంపద ఇత్యాదివన్నింటిలో జ్యేష్ఠాదేవి నివాసం ఉంటుంది. అందుకే ఆ లక్ష్మీస్థానాలకి దూరంగా ఉండాలి.







## శ్రీ లక్ష్మీదేవి, జ్యేష్ఠాదేవిల
## మధ్య ఎప్పుడూ దూరమే

■ గోవు సకల దేవతలకీ నివాసస్థానము. ఆవు ముఖములో శ్రీలక్ష్మీదేవి ఉంటుంది. అదే గోవు తోక వద్ద జ్యేష్ఠాదేవి ఉంటుంది. అలాగే వారు ప్రవేశించే దారులూ వేరే. లక్ష్మీదేవి ఇంటి ముఖ ద్వారం నుంచి గృహంలోకి ప్రవేశిస్తుంది. అదే జ్యేష్ఠాదేవి దొడ్డి దారిన వస్తుంది.



## శ్రీ కనకధారా
## స్తవ మహాత్మ్యము

■ శ్రీ ఆది శంకరాచార్యుల వారు ఓసారి భిక్షాటనకు వెళ్ళారు. అష్ట దరిద్రాలను అనుభవిస్తున్న ఓ గృహిణి అంత దరిద్రంలోనూ ఆదిశంకరాచార్యులకి దానం చేసింది. ఆమె దాతృత్వానికి పరమానందం చెంది ఆ ఇల్లాలికై కనకధారాస్తవము చేశాడు.

లక్ష్మీదేవి ఆ స్తుతికి మెచ్చి బంగారు ఉసిరికాయలను కురిపించింది. కాన కనకధారాస్తవము చేస్తే అపార సంపద చేకూరుతుంది.



## ఎదుటవార్ని తక్కువగా
## అంచనా వేయద్దు

■ చూడటానికి చక్కగా, బుద్ధిగా కనిపిస్తుంటారు. వినయ విధేయతలతో వుంటారు. పైకి కనిపించే రూపం ప్రవర్తనలో ఉండదు. అలాంటి వారితో వ్యవహారం ఒక్కోసారి అసలకే మోసం వస్తుంది. తీరా తెలిసిన తర్వాత 'అతనా' నన్నిలా ఇరికించిందని ఆశ్చర్యపోవటం

మీ వంతు అవుతుంది. అలా తక్కువగా అంచనా వేసే బలి చక్రవర్తి వామనుడితో చెబుతాడు. 'మహానుభావా... ఇంత ముద్దుగా, బుద్ధిగా ఉన్నావు. ఎంతో జ్ఞానసంపన్నుడిలా ఉన్నావు. ఏం కావాలో కోరుకో, కోరింది ఇస్తా'నని. అంతే ముద్దుగా మూడు అడుగులు అడిగి వింధ్యావళి భర్త బలిని పాతాళానికి నెట్టేశాడు వామనుడు.



## శ్రీమహాలక్ష్మీదేవి వర్ణన

■ ఐశ్వర్యాలనూ, మంగళకరమైన జీవితాన్నీ ఇచ్చే శ్రీమహాలక్ష్మి మామిడి చిగురు వర్ణంతో, పద్దెనిమిది హస్తాలతో, పగడపు తేజస్సుతో ప్రకాశిస్తూ తామర పువ్వుపై కొలువై ఉంటుంది. కుడివైపు హస్తాలలో శూలాన్నీ, జపమాలనూ, పద్మాన్నీ, దండాన్నీ, శక్తినీ, ఖడ్గాన్నీ, పరశువునూ, సుదర్శన చక్రాన్నీ, బాణాన్నీ ధరించి వుంటుంది. ఎడమ హస్తములలో అమృతకలశాన్నీ, కుండికనూ, గదనూ, ఘంటనూ, సురాపాత్రనూ, వజ్రాన్నీ, శంఖాన్నీ, ధనస్సునూ, వరద హస్తములో నవరత్న ఖచిత ఆభరణాలతో బ్రహ్మాండాన్ని కూడా ప్రకాశింప చేసే వెలుగుల మధ్య శోభిల్లుతూ భక్తులకు లేమి అన్నది లేకుండా చేస్తుంది.



## శ్రీ మహాలక్ష్మీదేవి నోములూ, వ్రతాలు

■ సిరి సంపదల సిద్ధి కొరకు గౌరీ నోము చేయటం ద్వారా మహాధనప్రాప్తి కలుగుతుంది.

■ మార్గశిర లక్ష్మీవార నోము నోచటం ద్వారా అత్తిల్లూ, పుట్టిల్లూ మహా ధనరాసులతో విలసిల్లుతాయి.





■ సంతానములేని వారు పండు, తాంబూలముల నోము చేయటం ద్వారా పుత్ర సంతానం కలుగుతుంది.

ఆ సంతానం మహా సంపదలను పొంది తల్లీ, తండ్రీ, సోదరులూ, సోదరీమణులు, బంధుమిత్ర హితులందరికీ సుఖసంతోషాలను కలిగిస్తారు.

■ మాఘపాదివారపు నోము నోచి కథను భర్తకూ, సంతానానికీ, కోడళ్ళకీ విన్పించటం ద్వారా అందరికీ అన్ని విషయాల్లో మహా విజయం కలుగుతుంది. వారికి శ్రీమహాలక్ష్మి 'సౌభాగ్యవతీభవ' అన్న దీవెనను ఇస్తుంది.

■ అన్నం ముట్టని ఆదివారం నోము చేయటం ద్వారా గృహంలోని అందరి వ్యాధులూ సమసిపోతాయి. ఈ నోము స్వయంగా సూర్యభగవానుడు తన భక్తురాలికి ఉపదేశించినాడు.

■ శ్రీమహావిష్ణువు వంటి రూప గుణ శౌర్య ప్రేమ గుణాలు గల భర్త కొరకు కన్యకామణులు విష్ణుకమలాల నోము ఆచరిస్తే సుందరమైన భర్తను పొందుతారు.

■ మహా దరిద్రాన్ని ప్రారద్రోలేందుకు శుక్రవారము నోము నోచుకోవాలి. సకల పిండి వంటలతో శ్రీమహాలక్ష్మికి నైవేద్యం పెట్టాలి. ఈ నోము చేయటమంటే శ్రీమహాలక్ష్మీదేవిని ఆహ్వానించటమే.

■ 'ఏ ఇంట అభాగ్యులకు సేవలు చేస్తారో, భోజనాదులు ఏర్పాటు చేస్తారో, పితృదేవతలకు తగు విధులు చేస్తారో, అసత్యం పలుకరో, నిత్య దేవతా పూజలు చేస్తారో, దాన ధర్మాలను చేస్తారో, సాటి వారి పట్ల సమభావంతో ఉంటారో, నిరాడంబరంతో నిత్య సంతోషం కలిగి ఉంటారో ఆ ఇంట నేను సుస్థిరంగా వుంటాను' అని ఆ తల్లి వైభవలక్ష్మి స్వయంగా తన వ్రతం చేస్తున్న భక్తురాలికి చెప్పింది.

■ శ్రావణ మాసంలో వరలక్ష్మీ వ్రతం చేసిన గృహానికి సర్వసౌభాగ్యములు కలుగుతాయి. ఈ వ్రత విధానాన్ని పరమేశ్వరుడు పార్వతీదేవికి స్వయంగా చెప్పాడు. వ్రతమనంతరం శ్రీవరలక్ష్మీదేవి ప్రసాదం స్వీకరించటం వల్ల సకల కార్యాలూ నెరవేరతాయి. భోగాలూ, భాగ్యాలూ కలుగుతాయి.

■ శ్రీమంగళగౌరీ దేవి వ్రతాన్ని పట్టిన ఇల్లాలు నిండు నూరేళ్ళు భర్తా, పిల్లా పాపలతో సుఖంగా జీవిస్తుంది. ఈ వ్రత కథనూ, విధానాన్నీ శ్రీకృష్ణభగవానుడు ద్రౌపదికి చెప్పి చేయించాడు.

■ సోమవారలక్ష్మి వ్రతం చేయటం ద్వారా కీర్తి తెచ్చే సంతానం కలుగుతుంది.



## శ్రీకృష్ణుని అష్టభార్యలే అష్టలక్ష్ములు

■ ఆదిలక్ష్మి రుక్మిణీదేవి. ధాన్యలక్ష్మి జాంబవతీదేవి. ధైర్యలక్ష్మి సత్యభామాదేవి. గజలక్ష్మి కాళిందీదేవి. సంతానలక్ష్మి నాగ్నజితి దేవి. విజయలక్ష్మి మిత్రవిందాదేవి. విద్యాలక్ష్మీదేవి లక్షణ. ధనలక్ష్మీదేవి భద్ర.



## ఇంద్రుడు చేసిన అష్టోత్తరము

■ సకల ఈతిబాధలూ, ధన సమస్యలూ పోవాలంటే శ్రీలక్ష్మీ అష్టోత్తరమును మూడు పూటలా ధ్యానించాలి. పరమేశ్వరుడు పార్వతీదేవికి ఉపదేశించాడు. దేవేంద్రుడు నిత్యమూ స్తుతించే ఈ స్తోత్రము పఠించటం వల్ల సకల దరిద్రాలూ తీరిపోతాయి. శుక్రవారము ఏకాదశ తిథి ప్రారంభించటము పరమ ప్రశస్తము. ఈశాన్య వాయవ్యములలో శుచియై ఆరాధించటం మరింత శ్రేష్ఠం.







## దారిద్ర్య నాశనం కొరకు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ మావహ ॥**

■ బంగారు వర్ణం కలదీ, మహా ఐశ్వర్యాలను ఇచ్చునదీ, వైకుంఠ వాసునికి ప్రియమైనదీ, బీజాక్షరము గలదీ, సూర్యనాడీ, చంద్రనాడీ అను హారములను ధరించునదీ, శ్రీవిద్యకు మూలమైనదీ, క్షీర సాగరమథనమున చంద్రుని తర్వాత జన్మించినదీ, బంగారు రంగుతో మెరిసే చంద్ర సోదరి అయిన నారాయణ శక్తీ నన్ను అనుగ్రహించు.

■ ఈ మొదటి ఋక్కు నిత్యం పదిహేనురోజులు పఠించటం ద్వారా జన్మజన్మల రుణబాధలు తొలగి సుఖసంపదలు కలుగుతాయి.



## మహా దుఃఖనాశనము (శ్రీసూక్తం)

**మంత్రము :-**

**తాం మ ఆవహ జాతవేదో౹ లక్ష్మీమనపగామినీమ్ ।**
**యస్యాంహిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్॥**

■ యజ్ఞ సంపదల ద్వారా సుఖసంతోషాలని కలిగించే ఓ అగ్నిహోత్రుడా! ధనకనకపు సంపదలనూ, కోరిన కోర్కెలనూ, సేవకులనూ, బంధుమిత్ర పరివారాలనూ ఇచ్చు శ్రీదేవి అనుగ్రహాన్ని మాపై ఆవాహన చేయుము.

■ ఈ రెండో ఋక్కు పదిహేను రోజులు పఠించటం ద్వారా గృహంలో శాంతి సమస్యలు ఏర్పడి మీకు కలిగిన అనేక దుఃఖకారణాలు అగ్నిలో పడిన సమిథిల వలే మాడిపోతాయి.



## మహా ఘోర కష్టములు పోవుటకు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్ ।**
**శ్రియం దేవీముపహ్వాయే శ్రీర్మా దేవీ జుషతామ్ ॥**

■ సకల ప్రాణికోటి మనస్సులనందు ఆశీనురాలైన ఆ సామ్రాజ్య లక్ష్మినీ, గజ ఘీంకారములతో మేల్కొనే శ్రీమహావిష్ణు సతిని మహాశ్రద్ధతో, శుచితో, భక్తితో సేవిస్తున్నాను. ఆ తల్లి నన్ను అనుగ్రహించుగాక.

■ ఈ మూడో ఋక్కు పఠించినవారికి అనుకోకుండా వచ్చిన సకల కష్టాలూ, బాధలూ, వ్యధలూ కనుచూపులో కూడా కానరాకుండా పోతాయి.

## ధాన్య వస్త్రముల కొరకు

**మంత్రము :**

**కాంసోఽ స్మితాం హిరణ్యప్రాకారా**
**మార్ద్రాదం జ్వలంతీం తృప్తాం తర్పయన్తీమ్ ।**
**పద్మేస్థితాం పద్మవర్ణాం**
**తామిహోపహ్వాయే శ్రియమ్ ॥**





■ కనకపు ప్రాకారాల మధ్య నివశించునదీ, సకల ప్రాణికోటిపై ఆర్ద్రతను కలిగినదీ, కోరిన కోర్కెలు తీర్చునదీ, పద్మమునందు ఆసీనురాలై ఉండునదీ అయిన శ్రీవిష్ణుదేవుని ఇల్లాలు శ్రీమహాలక్ష్మిని శరణు వేడుతున్నాను.

■ ఈ నాలుగో ఋక్కు పఠించిన వారిని ధాన్యరాసులతో ఆశీర్వదిస్తుంది తల్లి. పంటలు బాగా పండుతాయి. వ్యాపారంలో ఉన్నతి చేకూరుతుంది. కుటుంబంలో సుఖానికి కొదవ వుండదు.

## భర్తతో మహాసఖ్యత కొరకు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**చంద్రాం ప్రభాసాం యశసా జ్వలన్తీమ్**
**శ్రియంలోకే దేవజుష్టా ముదారామ్ ।**
**తాం పద్మినీ మీం శరణమహం ప్రపద్యే**
**ఽ లక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే ॥**

■ 'ఈం' అనే బీజాక్షరము కలిగినది అయిన శ్రీదేవికి నేను సేవకుడను.

సకల ఈతి బాధలకు కారణమైన శనీశ్వరుని భార్య, శ్రీమహాలక్ష్మి సోదరీ అయిన జ్యేష్ఠాదేవిని నా గృహం నుంచి వెడలిపోయేలా చేయునదీ, మహా ఆనందాలకి కారణమైన అష్టైశ్వర్యాలను ఇచ్చునదీ అయిన ఆదిలక్ష్మిని నా గృహమునకు ఆహ్వానిస్తున్నాను.

■ ఈ అయిదో ఋక్కు పఠనం సకల సమస్యలను దూరం చేస్తుంది. అన్యోన్య దాంపత్యాన్నిచ్చి సుఖాలను పొందేలా చేస్తుంది.

## మనోవేదనను

## తీర్చుటకు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**ఆదిత్య వర్ణే తపసోఽ ధిజాతో**
**వనస్పతిస్తవ వృక్షోఽ థబిల్వః।**
**తస్య ఫలాని తపసా నుదన్తు**
**మాయాన్తరాయాశ్చ బాహ్యాలక్ష్మీః ॥**

■ సూర్యభగవానుడి తేజస్సును మించిన తేజస్సుతో వెలిగే విష్ణు హృదయమునున్న శ్రీలక్ష్మీదేవికి నా ప్రార్థనలు.

లోకహితంకై మారేడు వృక్షం క్రింద తపస్సు చేయుచున్న శ్రీలక్ష్మి నా అమంగళాలన్నింటినీ నశింపచేయి.

మారేడు ఫలాలను పూజించిన వారికీ, వాటితో స్నానం చేసిన వారికీ లక్ష్మీ కటాక్షాన్ని సిద్ధింపచేయు ఓ లక్ష్మీ నీకు నా నమస్కారములు.

## సంపూర్ణ ఆరోగ్యం

## కొరకు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**ఉపైతు మాం దేవసఖః**
**కీర్తిశ్చ మణినా సహ।**
**ప్రాదుర్భూతోఽ స్మి రాష్ట్రే ఽ స్మిన్**
**కీర్తి మృద్ధిం దదాతుమే ॥**





■ యక్షులకు అధిపతి, సంపదలకు అధిపతి అయిన కుబేర యంత్రము, మహా యశస్సును ఇచ్చే చింతామణి యంత్రమును పూజించి శ్రీసూక్తంలోని ఏడవ ఋక్కుని పఠించిన వారికి సంపూర్ణ ఆరోగ్యం కలుగుతుంది. కీర్తి, ధనం వృద్ధి అవుతాయి.

## అలక్ష్మిని సాగనంపు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**క్షుత్పిపాసామలాం జ్యేష్ఠా**
**మలక్ష్మీ ర్నాశయామ్యహమ్।**
**అభూతిమసమృద్ధిం చ**
**సర్వాంనిర్ణుదమే గృహాత్ ॥**

■ ఓ మహాలక్ష్మీ, అలక్ష్మి నా శరీరమనే గృహంలో తిష్ఠ వేసినది. ఆకలితో, నిద్రతో, దప్పికతో, అశుభ్రతలతో, బద్ధకముతో నేను గడుపుతున్నాను. వాటి వల్ల మహా క్షోభ, దరిద్రం కలిగినవి. ఓ త్రిభువన సుందరీ, శ్రీమహావిష్ణువు ప్రియసఖీ... సకల అరిష్టములను నశింప చేసి మా ఇంటికి సౌభాగ్యలక్ష్మిగా రమ్ము. మమ్ము అనగ్రహించుము.

## ధన, ధాన్య, పశు

## సమృద్ధి కొరకు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**గంధద్వారాం దురాధర్షాం**
**నిత్యపుష్టాం కరీషిణీమ్।**
**ఈశ్వరీగ్ం సర్వభూతానాం**
**తామిహోపహ్వయే శ్రియమ్ ॥**

■ ఆత్మస్వరూపిణీ, సర్వభూతములకూ అనాహత చక్రమగు హృదయ కేంద్రమందు ఉండు మహాశక్తి శ్రీదేవిని మనస్ఫూర్తిగా ప్రార్థిస్తున్నాను. అనురాగ వర్షిణి, శ్రీదేవిని పవిత్ర గోమయంతో అలికిన ప్రదేశంలో పుష్పాలను పరిచి ఆసీనురాలిని చేసి పూజిస్తున్నాను. అలా శ్రీలక్ష్మిని పూజించిన వారికి ధన, ధాన్య, పశు సమృద్ధిని వృద్ధి చేస్తుంది. శ్రీసూక్తంలోని ఈ తొమ్మిదో ఋక్కు పఠించి అన్నదానం చేయటం ద్వారా త్వరితంగా ఫలితం కాన వస్తుంది.



## మహా వరాలు పొందుటకు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**మనసః కామమాకూతిం**
**వాచ స్సత్యమశీమహి।**
**పశూనాగ్ం రూపమన్నస్య**
**మయి శ్రీ శ్శ్రయతాం యశః॥**

■ మనస్సులో మహా గట్టి స్థిర కోరికలూ, ఇష్టాలూ తీరేందుకూ, నోటి నుంచి వచ్చిన సకల మాటలను సత్యము చేయుటకూ, అన్న వస్త్ర ధన గోసంపదలు సదా మా యింటి యందు ఉండుటకై క్షీరసముద్రరాజ తనయి శ్రీలక్ష్మీదేవిని భక్తితో సేవిస్తూ ఆశ్రయిస్తున్నాను.



## తరతరాలకు శ్రీలక్ష్మి అనుగ్రహంకొరకై (శ్రీసూక్తం)

**మంత్రము :**

**కర్దమేన ప్రజా భూతా, మయిసంభవ కర్దమ।**
**శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్॥**





■ కర్దమ మహర్షి కోరికపై వాని పుత్రికగా జన్మించిన శ్రీమహాలక్ష్మి సర్వ జగుత్తుకు మాతృమూర్తి.

తామర పువ్వులను మాలలుగా ధరించునది అయిన శ్రీమహాలక్ష్మిని నా వంశమునందు స్థిరముగా ఉండుమని ప్రార్థిస్తూ గృహమున శ్రీమహాలక్ష్మీదేవిని ప్రతిష్ఠించుకుంటే ఆ తల్లి వారి వంశాన్ని సదా సంపదలతో, సుఖాలతో ఉండేలా దీవిస్తుంటుంది.



## శ్రీమహావిష్ణు ప్రీతి కొరకు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**అపస్సృజన్తుస్నిగ్ధాని, చిక్లీత! వస మే గృహే।**
**ని చ దేవీం మాతరం, శ్రియం వాసయ మే కులే॥**

■ సకల సంసార బంధములనుంచి విముక్తికై, ఈ మాయా దేహమును విడుచుటకై, లక్ష్మీ పుత్రుడు మన్మథుణ్ని జయించుటకై నారాయణశక్తి అగు నారాయణిని ప్రార్థిస్తున్నాను.

తద్వారా నారాయణుని అనుగ్రహమును పొందగలను. జగన్మాత స్వరూపిణి అయిన మా మహాలక్ష్మి మా వంశమును తరింపచేయును.



## కుటుంబ సుఖ శ్రేయస్సుల కొరకు (శ్రీసూక్తం)

**మంత్రము :**

**ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం, సువర్ణాం హేమమాలినీమ్।**
**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥**

▪ క్షీరసముద్రంలో జనియించుటవల్ల ఎల్లప్పుడూ తేమగా ఉండే పద్మమాలాధారిణి, బంగారు వర్ణం గల ఓ లక్ష్మీ నా గృహమునందూ, నా వారి యందూ, నా యందూ సర్వదా అనుగ్రహం చూపుము.



## సకల వ్యాధులూ పోయి సౌఖ్యములు వచ్చుటకు

**మంత్రము :**

**ఆర్ద్రాం యఃకరిణీం యష్టిం పింగళాం పద్మమాలినీమ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో! మమావహ॥**

▪ పచ్చని రంగు కలదీ, తామర పూలమాల గలదీ, సకల సౌఖ్యాలనీ ఇచ్చేదీ, ఏనుగు తొండాలతో అభిషేకించుట ద్వారా తడిసినదీ, చేత దండం ధరించినదీ, సువర్ణాభరణాలను ధరించినదీ అయిన శ్రీమహాలక్ష్మిని నా కోసం నా గృహానికి ఆహ్వానిస్తున్నాను అగ్నిదేవా.



## అష్టైశ్వర్యాల కోసం

**మంత్రము :**

**తాం మ ఆవహ జాతేవదో !**
**లక్ష్మీ మనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం ప్రభూతం**
**గావో దాస్యో ౭ శ్వాన్ విన్దేయం పురుషానహమ్ ॥**

▪ ఓ అగ్నిదేవా, శ్రీమహాలక్ష్మి నా గృహానికి రావటం వల్ల ధనం, గోసంపద, సేవకులు, పరిచారికలు, వాహనాలు ఇలా ఎన్నో లభిస్తాయి.





అట్టి మహా వైభోగాలను ఇచ్చే లక్ష్మీదేవిని నా ఇంట స్థిరంగా ఉండేలా చేయుము. నాకై నీవు ఆమెను ఆహ్వానించుము.



## మహా సంపన్నుడు

▪ ఉప్పులేని భోజనం తిన్నా పర్వాలేదు, పప్పులేని తిండి తిన్నా పర్వాలేదు. ఆ రెండూ లేకుండా తినవద్దన్నాడు వేమన. అయినా సరే అవిలేకుండా తినయినా సరే అప్పు లేకుండా వుంటే చాలు. అట్టివాడు మహా సంపన్నుడు. అందరికన్నా అధికుడు, సుఖశాలి, అదృష్టవంతుడు.



## ధనం పోయినప్పుడే

▪ ఆపదలు కలిగినప్పుడు హితులెవ్వరో, అహితులెవ్వరో తెలుస్తుంది. అలాంటప్పుడే సేవకులకి యజమాని ధైర్యం తెలుస్తుంది.

▪ అనారోగ్యం కలిగినప్పుడే ఆరోగ్యం విలువ తెలుస్తుంది.

▪ ఆకలేసినప్పుడే తిండి విలువ తెలుస్తుంది.

▪ కడుపు మండినప్పుడే ఆవేశం తన్నుకు వస్తుంది.

▪ అదే ధనం పోతే హితులూ, సేవకులూ, ఆరోగ్యమూ, కోరికలూ, ఆవేశమూ అన్నీ పోతాయి. ఒక్కోసారి భార్య కూడా పోవచ్చు.



## శ్రీమహాలక్ష్మి శ్రీమహావిష్ణువుని ఎందుకు వరించింది

▪ అదృష్టం వేరు, కష్టం వేరు. అదృష్టముంటే అదే వచ్చి వరిస్తుంది. క్షీరసాగర మథనంలో సకల సంపదలకీ మూల స్వరూపిణి అయిన శ్రీమహాలక్ష్మి జన్మించింది. శ్రీమహావిష్ణువుని వరించింది. అలాగే అదే క్షీరసముద్రంలో జనియించిన విషమును శివుడు గ్రహించి గరళకంఠుడు

అయ్యాడు. దాన్నేమంటారు... ప్రాప్తమా, అదృష్టమా, దురదృష్టమా. అవేమీ కావు. శ్రీమహావిష్ణువుది ప్రాప్తం కాదు. కష్టం.

అకుంఠిత దీక్ష. నాయకత్వ లక్షణము. దేవరాక్షసులని ఒక్కటిగా చేశాడు. అమృతాన్ని ఎలా పొందాలో చెప్పాడు. కూర్మావతారమెత్తి మంధర గిరిని మోశాడు. అంత కష్టం చేశాడు కాబట్టే శ్రీమహాలక్ష్మి తనకై తనే అందర్నీ దాటుకుంటూ వెళ్ళి శ్రీమహావిష్ణువును వరించింది. వక్షస్థలంలో స్థిర నివాసం ఏర్పరుచుకుంది.



## క్షేమకారిణి శ్రీదేవిని పూజించాల్సిన తిథులు

■ అష్టమీ, చతుర్థశీ, నవమీ, శుక్రవారం, మంగళవారం, పౌర్ణమి అమావాస్యలలో శ్రీలక్ష్మిని పూజించుట ద్వారా సకల కార్యాలలో విజయం సాధిస్తారని సనత్కుమారుడు శెలవిచ్చాడు.



## ఈ రెంటిని చూస్తే ఎంతటి వాడికయినా...

■ ధనాన్నీ, అందమైన స్త్రీనీ చూస్తే కన్ను కుడుతుంది. నక్క వినయాలు ప్రదర్శించయినా, కుటిలత్వంతోనయినా, ఏం చేసైనా సరే లోబరుచుకోవాలని ప్రయత్నిస్తూనే ఉంటారు.

ఒకరుప్రేమతో, మరొకరుదర్పంతో, ఇంకొకరు అమాయకత్వంతో, ఇంకొందరు దౌర్జన్యంతో... దారులు వేరయినా గమ్యం ఒక్కటే. దోచుకోవటం.. అందుకే వేమన కూడా బంగారాన్నీ, సొగసు కత్తెలనూ చూస్తే ఎలాంటి వాడికైనా రిమ్మ తెగులు కలుగుతుంది అది ఆ బ్రహ్మదేవునికి కూడా మినహాయింపు కాదని చెప్పాడు.





కాన సంపదలు కలిగివారూ, ఆ సంపదలకు సాటి రాగల అందగత్తెలు ఇరువురూ సదా వారి వారి ఆస్తులపై ఎంతో ఏమరుపాటుగా ఉండాలి. ఆ రెండూ ఒక్కసారి పోతే ఈ జన్మకి తిరిగిరానట్టే.



## కౌటిల్యుని అర్థశాస్త్రం మథించైనా సరే

■ తాంబూలం వేసుకోని నోరు

■ అందమైన స్తనాల మీద రాయని శరీరము

■ తామర పూలు లేని కొలను

■ చంద్రుడు లేని రాత్రి.. ఇవన్నీ హీనమైనవి. అంతకు మించిన హీనాతి హీనమైనది ధనంలేని జీవితము.

■ ఆ దుర్భర జీవితం భరించలేకే ద్రోణాచార్యుడూ, కుచేలుడూ మిత్రుల్ని ఆశ్రయించారు, అర్థించారు. కండలు కరిగించయినా, తెలివిని పెట్టుబడిగా పెట్టయినా కౌటిల్యుని అర్థశాస్త్రం మథించైనాసరే ధనాన్ని సంపాదించాలి. దాని ద్వారానే సుఖాలు కలుగుతాయి. అహం సంతృప్తి పడుతుంది. కీర్తి పెరుగుతుంది.



## ధనం రాక.. ధనం పోక

■ కొబ్బరి కాయలో కొబ్బరి నీరు చేరినట్టు చేరుతుంది. అదే సిరి పోవాలన్న యోగముంటే (అలాంటి యోగము కలగటానికి మీరే కారణము) ఏనుగు మింగిన వెలగపండులోని గుజ్జు ఏ విధంగా మాయమౌతుందో అలా మీ ధనం పోతుంది. ఆ తర్వాత ఎంత తల బద్ధలు కొట్టుకున్నా గుజ్జు అనే సంపద తిరిగి మీకు అందదు.



# ఐదు బ్రహ్మల స్వరూపిణి లక్ష్మీదేవికి చెయ్యాల్సిన అభిషేకం

■ ఆవునెయ్యితో గానీ, చెరుకు రసంతోగానీ, ఇంకా సువర్ణ జలంతో గానీ, తేనెతో (శ్రీమహాలక్ష్మి నివాస స్థలాల్లో ఒకటి) గానీ శ్రీవిష్ణుదేవుని ఇల్లాలికి అభిషేకం చేయటం ద్వారా ఐశ్వర్య వృద్ధి కలుగుతుంది. విశాలమైన కనులుగల శ్రీమహాలక్ష్మిని గృహంలో పూజించేటప్పుడు ఇంటిని పసుపు నీళ్ళతో తుడిచి, విధి విధానాలతో ఎర్రని పూలతో పూజిస్తే మంచి ఫలితం ఆ సుమంగళీదేవి ఇస్తుంది.



# బంగారు వర్ణ రూపిణికి ఏ సంఖ్య అంటే ప్రీతి

■ ప్రసన్న వదన, సర్వాభీష్టములను తీర్చునదీ, శరత్కాల పండు వెన్నెల వంటి దరహాసం గలిగినదీ, పంచభూతములకు అధిదేవత శ్రీలక్ష్మీదేవికి అయిదు సంఖ్య ప్రీతికరము. అందుకే ధనలక్ష్మికి పంచహారతులను ఇస్తారు. శ్రీపంచమి పర్వదినం. అలాగే అయిదు సంఖ్య బుధునికి ప్రీతికరమైనది. వ్యాపార కారకుడు బుధుడు. శ్రీమహావిష్ణువుకి అన్నీ తానే అయిన శ్రీలక్ష్మీదేవిని ప్రార్థించి బుధుడు తన భక్తులకు స్థిరలక్ష్మిని ప్రసాదించేలా చేస్తాడు.



# గృహంలో లక్ష్మీ పూజ చేసేటప్పుడు

■ ముందుగా గృహాన్ని పసుపు నీళ్ళతో తుడుచుకోవాలి. వీలయినన్ని ఎర్రని పూలు సేకరించాలి. అరవై నాలుగు సేవలు చేయాలి. శ్రీ బీజాక్షరాలతో పూజించాలి. తీపి పదార్థాలను నైవేద్యంగా పెట్టాలి.







# భృగునందినిని ఏ రూపంలో పూజించాలి

■ క్షీరసాగర తనయ శ్రీలక్ష్మీదేవి పద్మవాసినియై అనగా యంత్రమున ఆసీనురాలై ఉండాలి. సర్వలోక జననికి ఇరువైపులా శలభం, గుగ్గిలం అను తెల్ల ఏనుగులు అమృత కలశాలతో అభిషేకిస్తూ ఉండాలి. కామధేనువూ, కల్పవృక్షమూ, చింతామణీ, ఐరావతము, శంఖ నిధి, పద్మనిధిలతో పాటు నవ నిధులతో సేవించేలా ఉండాలి. తెల్లని ఛత్రమూ, రెండు చామరములతో మహా సేవలు పొందుతూ, రెండు చేతులలో పద్మాలను ధరించి వరద, అభయ ముద్రలతో సర్వాభరణభూషితురాలై ఉండాలి.



# పదహారు (షోడశ) అక్షరాలతో

■ కూడిన మంత్రమూర్తి లక్ష్మీదేవి హోమంలో తప్పని సరిగా వాడాల్సినవి మారేడు సమిధలు(ఎండినవి), అట్లే ఎండిన తామర పూలు, చందనము, తేనె, మోదుగ సమిధలతో చేసిన ఉత్తరేణి, తులసి సమిధలను ఉపయోగించాలి. వీటితో శీతగిరి పుత్రిక హోమం చేయించుకుంటే పూర్ణ సిద్ధి కలుగుతుంది. హరివల్లభ ఆ కుటుంబానికి మహా శక్తిని ప్రసాదిస్తుంది. ఇంద్రునికి సకల దరిద్రాలని పోగొట్టినట్టు వారి గృహంలో లేమన్నది లేకుండా చేస్తుంది.



# గోళ్ళలో మట్టి

■ అదే అసలు సిసలు దరిద్రం.

■ అలాగే గోళ్ళని కట్ చేసి ఇంట్లో వెయ్యరాదు. అలా వేస్తే జ్యేష్ఠాదేవిని ఉపాసించి రమ్మన్నట్టే.



## లోకాలకి దీపం శ్రీలక్ష్మీదేవి అష్టసిద్ధులను ఎలా కలిగిస్తుంది

■ ధన, ధాన్య, విద్య, ఐశ్వర్య, సంతాన, విజయ, ధైర్య, గజలక్ష్ములను శ్రావణమాసంలో శుక్రవారం పూజించటం ద్వారా, మార్గశిర మాసంలో లక్ష్మివారాల వ్రతం చెయ్యటం ద్వారా, శ్రీలక్ష్మి సహస్రనామం పఠించటం ద్వారా, శ్రీమహా విష్ణు స్తోత్ర పారాయణం ద్వారా, ఉపవాస దీక్షల ద్వారా అష్టసిద్ధులను సిద్ధింప చేస్తుంది.



## అగ్నిరూపధారిణి శ్రీమహాలక్ష్మి ద్వాదశరాశులు

■ అష్టమీ, చతుర్థశీ, నవమీ, శుక్రవారం, మంగళవారం, పౌర్ణమి, అమావాస్యలలో శ్రీలక్ష్మిని పూజించుట ద్వారా సకల కార్యాలలో విజయం సాధిస్తారని సనత్కుమారుడు శెలవిచ్చాడు. మూలమంత్రాలు శ్రీ శక్తి బీజాత్మికమైనవి.

వారి వారి రాశుల ప్రకారం మూల మంత్రాన్ని పఠించడం ద్వారా సత్వరలక్ష్మి అనుగ్రహం కలుగుతుంది.

| | | |
|---|---|---|
| ■ ■ | మేషరాశి | ఓం ఐం క్లీం సౌః |
| ■ ■ | వృషభరాశి | ఓం ఐం క్లీం శ్రీం |
| ■ ■ | మిధునరాశి | ఓం క్లీం ఐం సౌః |
| ■ ■ | కర్కాటకరాశి | ఓం ఐం క్లీం శ్రీం |
| ■ ■ | సింహరాశి | ఓం క్లీం శ్రీం సౌః |
| ■ ■ | కన్యారాశి | ఓం శ్రీం ఐం సౌః |





| | | |
|---|---|---|
| ■ ■ | తులారాశి | ఓం బ్లూం క్లీం శ్రీం |
| ■ ■ | వృశ్చికరాశి | ఓం ఐం క్లీం సౌః |
| ■ ■ | ధనూరాశి | ఓం బ్లూం క్లీం సౌః |
| ■ ■ | మకరరాశి | ఓం ఐం క్లీం బ్లూం శ్రీం సౌః |
| ■ ■ | కుంభరాశి | ఓం బ్లూం ఐం క్లీం శ్రీం |
| ■ ■ | మీనరాశి | ఓం బ్లూం క్లీం సౌః |

## భార్యని అవమానపరిస్తే

■ కోప్పడినా, తిట్టినా, ఆఖరుకు కుటుంబాన్ని పట్టించు కోకపోయినా, ప్రేమ పంచకపోయినా భరిస్తుంది. మగ మహారాజు ఎన్ని సుఖాలు పొందుతున్నా, తాను సాధారణంగానే జీవిస్తుంది.

ఉన్న దాంట్లో సర్దుకుపోతుంది. కష్టాలు కలిగితే శ్రీరాముని వెంట అడవులకి నడిచినట్టు నడుస్తుంది. అదే అవమానిస్తే, తిరస్కరిస్తే ముఖం కూడా చూడదు.

పట్టాభిషేకం తర్వాత అడవుల్లో తనని వదలినందుకు తిరిగి పట్టాభిషేక అనంతరము శ్రీరాముని ముఖం కూడా చూడటం ఇష్టం లేక తల్లి భూదేవి ఒడిలోకి వెళ్ళిపోయింది లక్ష్మి.

శ్రీలక్ష్మి దూరమవ్వటమంటే సకల సుఖశాంతులూ శాశ్వతంగా పోయినట్టే. భార్యని అవమానిస్తే మిగిలేది శ్రీరాముని దుఃఖమే.

## పూజా మందిరంలో గవ్వలు

■పూజా మందిరంలో పసుపు వర్ణంగల లక్ష్మి గవ్వలుంచుకుంటే, చేతిలో చిల్లి గవ్వ లేదనే పరిస్థితి రాదు. చెప్పే పరిస్థితి కూడా రాదు.



## వ్యాపార, గృహ ద్వారాల ముందు రాక్షసుని బొమ్మ

■దిష్టి కోసం పెట్టామని భావిస్తారు. కానీ నిజానికి రాక్షస గృహం లేదా పిశాచ నివాస ప్రాంతమని అర్థం. వైకుంఠ ద్వారానికి ముందు జయ విజయులుంటారు. కైలాసానికి నందీశ్వరుడు, అదే రావణాసురుని గృహానికి లంకిణి ఉంటుంది. అలాగే మధుకైటభుల ప్రధాన ద్వారం ముందు రాక్షసులుంటారు. కాబట్టి అలాంటి పటాలు ఉండటం వల్ల దేవతలు ప్రవేశించరు.

రాక్షసులు ఇష్టానుసారంగా వచ్చి వెళ్తుంటారు. దేవతలు లేని చోట శ్రీమహాలక్ష్మి అయిష్టంగానే ఉంటుంది. అవకాశం తగిన సమయం చూసుకొని వెళ్ళిపోతుంది.



## చెప్పులతో గృహంలోకి రావటమంటే జ్యేష్ఠాదేవిని ఆహ్వానించటమా?

■ సకల దుష్ట శక్తులన్నీ మట్టిలో కలిసి ఉంటాయి. అవి సదా తగు నివాసం కోసం ప్రయత్నిస్తుంటాయి. రాక్షసాదులూ, పిశాచగణాలూ మనుజుడి కాళ్ళ చెప్పులకి ధూళి రూపంలో అంటి పెట్టుకొని ఇంటిలోకి ప్రవేశిస్తాయి.

తద్వారా వారి ఆహారమైన అశాంతి, ఆవేశం, ద్వేషం, పగ, ప్రతీకారం, నీచం ఆ గృహంలో వారికి ఆవహింప చేసి వారిని సర్వ నాశనం చేస్తాయి. అందుకే కాలి చెప్పులను గుమ్మం బైటే వదలాలి. కాళ్ళు కడుక్కొని లోపలికెళ్ళాలి.







## మంగళ, శుక్రవారములు, అమావాస్య రోజులలో బూజును ఎందుకు దులపకూడదు

■ అష్టమీ, చతుర్థశీ, నవమీ, శుక్రవారం, మంగళవారం, పౌర్ణమి, అమావాస్యలలో శ్రీలక్ష్మిని పూజించుట ద్వారా సకల కార్యాలలో విజయం సాధిస్తారని సనత్కుమారుడు శెలవిచ్చాడు.

ఆ రోజులు శ్రీమహాలక్ష్మి గృహంలోకి ప్రవేశించే శుభవారాలు. రావణాసురుడు తన సోదరుడైన కుబేరుణ్ని అన్ని విధాలుగా భంగపరచటంతో తన వ్యధ చెప్పుకుని మహాశివుణ్ని వేడుకున్నాడు. కుబేరుడి స్థితి చూసి తన నుదుటిని తుడిచి ధూళిని ప్రసాదించాడు.

ఆ ధూళే మహా సిరులను కురిపించింది. అందుకే శ్రీమహాలక్ష్మి గృహంలోకి ప్రవేశించే సమయంలో మంగళ, శుక్ర, అమావాస్యలలో ధూళి దులిపి పారేస్తే లక్ష్మీదేవిని బయటికి వెళ్ళమన్నట్టే. అందుకే పెద్దలు ఆ రోజుల్లో అనగా లక్ష్మి ఇంట్లోకి ప్రవేశించే ఆ రోజుల్లో బూజును దులపకూడదని చెప్పారు.



## తప్పుడు పనులు చేసే వారి దగ్గర అపార సంపద ఎందుకుంటుంది

■దానికి కారణం పూర్వజన్మ సుకృతమే. చంద్రుడు మంచివారితో పాటు చండాలుని ఇంట కూడా వెన్నెలని ప్రసాదిస్తాడు. అది శాశ్వతమే. కానీ లక్ష్మి అనుగ్రహం అలా కాదు. ఈ జన్మలో చేసిన పాపాలు ఈ జన్మలోనే తీరకపోతే మలి జన్మలో అనుభవించాలి. గత జన్మల్లో ఋణ పడిన వారంతా వారి వారి ఋణాలను ఈ జన్మలో వారికి తీర్చేసుకోవటం

ద్వారా సంపన్నుడవుతాడు. ధనం వార్ని అంటి పెట్టుకొని ఉంటుంది. గత జన్మల్లో వారు చేసిన పుణ్య, దాన, వ్రత, హోమ పూజాదికాల ఫలమే ఆ సంపదలూ, గౌరవము. ఆ పుణ్య ఫలం ఉన్నంత వరకూ సంపదలు వారికుంటాయి.



## వైకుంఠాన్ని వదలి శ్రీమహాలక్ష్మి భూమి మీదకు ఎందుకొచ్చింది

■ భృగుమహర్షి శ్రీమహావిష్ణువు వక్షస్థలంపై తన్నాడు. తన నివాసమైన ఆ స్థానాన్ని అవమానం చేయటంతో శ్రీమహాలక్ష్మి ఆగ్రహం చెందింది. అంత చేసిన భృగుమహర్షిని ఇంకా శాంతవచనాలతో పలకరిస్తుండటంతో తట్టుకోలేకపోయింది. భార్యని అవమానించినా చలించనందుకు ఉడికిపోయి భూమి మీదకొచ్చింది. లక్ష్మీ... లక్ష్మీ... లక్ష్మీ... అంటూ శ్రీమహావిష్ణువు తిరుమల కొండల్లో తిరిగాడు. పద్నాలుగు భువన భాండాలని పాలించే శ్రీమహావిష్ణువు శ్రీమహాలక్ష్మి కొల్హాపూర్‌లో వుందని తెలుసుకోలేకపోయాడు. భర్త స్థితి చూసి లక్ష్మీదేవి ఆవు రూపంలో పాలిచ్చి భర్తని క్షుద్బాధనుంచి రక్షించింది. కాన పరాయి వాడు భార్యని అవమానిస్తే ఏ కారణంగానైనా మౌనంగా ఉంటే శ్రీమహావిష్ణువులా పిచ్చివాడిలా తిరగాల్సి వస్తుంది.



## శ్రీమహాలక్ష్మి లోపలికొస్తుంటే గుమ్మం వద్దే అడ్డుపడేదెవ్వరు

■ నవగ్రహాలు... ఉదాహరణకి కుజునికి మంగళవారం పూట క్షవరం చేసుకుంటే ఇష్టముండదు. అలాంటి గృహస్థు ఇంటిలోకి శ్రీమహాలక్ష్మి ప్రవేశిస్తుంటే బుధుడు సాష్టాంగ నమస్కారం చేసి 'తల్లీ, నీ భక్తుడు నాకు అపచారం చేశాడు. కాన నీవు లోనికెళ్ళద్దు' అని





ప్రార్థిస్తాడు. దానితో శ్రీలక్ష్మి వెనక్కి వెళుతుంది. అందుకే ఆయా గ్రహాలకి ప్రీతికరమైనవి చేయటం ద్వారా నవగ్రహాలు శ్రీమహాలక్ష్మి గృహప్రవేశానికి అభ్యంతరం చెప్పవు.

పితృదేవతలు... పితృకార్యాలు చేయకపోతే వంశస్థులు ఆ లోకాల్లో విలవిలలాడుతుంటారు. వారి బాధ వర్ణనాతీతం. వారంతా లక్ష్మికి అడ్డుపడి 'లోకమాతా! మా వ్యధలు చూస్తున్నావుగా? ఎంత భక్తుడైనా, వాడి పుట్టుకకి కారణమైన మమ్ము మరిచాడు. మాకు వేదనను మిగిల్చాడు. కాన నీవు వాని ఇంట ప్రవేశించవద్దు తల్లీ' అని వేడుకుంటారు. దానితో శ్రీవిష్ణుసతి వెనక్కి తిరుగుతుంది. కాన పితృదేవతలకి సకల విధులూ తప్పనిసరిగా చేయాలి.

బాధితులు... మీ వల్ల బాధపడినవారూ, నష్టపడినవారూ, వేదన అనుభవించిన వారూ... అలా వారందరి ఆక్రోశం ఓ శక్తిగా మారి, శ్రీమహాలక్ష్మి వద్దకెళ్ళి అందరి గోడు వెళ్ళబోస్తుంది. దానితో అలాంటి వానిని లక్ష్మి అనుగ్రహించదు.

శ్రీమహాలక్ష్మి గృహంలోకి రావాలంటే నవగ్రహాలూ, పితృదేవతలూ, చుట్టూ సమాజం... అలా అంతా అడ్డంకి చెప్పనప్పుడే సంపూర్ణ లక్ష్మీ కటాక్షం సిద్ధిస్తుంది.



## శ్రీమహాలక్ష్మిని ఎలా చూడాలి

■ తల్లిలా.... ప్రేమాభిగౌరవాలను చూపాలి

■ తండ్రిలా... భయభక్తులు చూపాలి

■ కూతురిలా.... గారాబం చేయాలి. వైభవోపేతంగా ఉంచాలి (పిసినారిలా కాకుండా)

■ కొడుకులా... క్రమశిక్షణగా ఉంచాలి

■ సోదరునిలా .... ప్రతిక్షణం గమనిస్తుండాలి (లెక్కా పత్రం సరిచూసుకోవాలి)

■ స్నేహితునిలా... సన్నిహితంగా మెలగాలి.

■ అల్లుడిలా... గౌరవాభిమానాలతో చూడాలి.

## జూదంలో గెలవటం ద్వారా వచ్చేది ధనలక్ష్మి కాదు

■ జ్యేష్ఠాదేవి... తాత్కాలికంగా కొన్ని రోజులు ఆనందాలనీ, అనుభవాలనీ ఇచ్చినా వడ్డీతో కూడా కలిపి పోగొట్టి మహా కష్టాలకు గురి చేస్తుంది. సర్వం సహా పోగొడుతుంది.

జూదంలో ఓడిపోయిన ధర్మరాజూ, నలుడూ తిరిగి మహా రాజ్యలక్ష్మిని పొందారు. గెలిచిన వారేమయ్యారో తెలియనిది కాదు.

## సర్పంలా జన్మించాలని వుందా?

■ అయితే ధనాన్ని దాచకండి. బీరువాల్లో మగ్గి మగ్గి ఉండేలా చేయకండి. భూమిలోనూ ఇతరత్రా బిగించి ఉంచకండి. సంపదకు స్వేచ్ఛని ఇవ్వాలి. దాన్ని సద్వినియోగం చేస్తూ సంపదను వృద్ధి చేస్తూ పదిమందికీ పని ఇవ్వండి.

అలా కాదని గోడల్లో, నేలల్లో, బీరువాల్లో, పరుపుల్లో దాస్తే, మీ వారికీ అందక ఆ వ్యామోహం వీడక సర్పంలా పుట్టి తాను దాచిన ధనం కోసం వెదుకుతూ గడపాల్సి ఉంటుంది. లక్ష్మిని బంధిస్తే సర్పమై చెట్టూ, పుట్టలను శోధిస్తూ జన్మించాల్సి వుంటుంది. ఈ మాటలను వశిష్ఠ మహర్షి సుమన భర్త అయిన సోమశర్మకి పద్మపురాణంలో చెబుతాడు.





## గుడిలో దక్షిణలు వేసేటప్పుడు

■ భగవంతుణ్ని దర్శించుకొని, ఆత్మ శుద్ధి చేసుకొని హుండీలోనో లేదా హారతి పళ్ళెంలోనో దక్షిణ వేసేటప్పుడు చాలా మంది జేబులో చెయ్యి పెట్టి నాణెం సైజు చూసి మరీ వేస్తుంటారు.

మీ జేబుల్లో లక్షలూ, కోట్లూ వుండవు. సర్వస్వమూ వెంట తెచ్చుకోరు. దేవాలయాల్లో ఇచ్చే ధనం ధర్మకార్యాలకే ఉపయోగపడేది.

అలాంటి ధర్మసంస్థల్లో కూడా సైజు చూసి చిన్న నోట్లు వెదికి మరీ వేస్తే మహాలక్ష్మి కూడా అలాగే మీకు ఆలోచించి ఆలోచించి మరీ ఇస్తుంది.

## సరస్వతికి కోపం తెప్పించి శ్రీలక్ష్మిని దూరం చేసుకోవద్దు

■ రచన కావచ్చు, నాట్యం కావచ్చు, చిత్ర లేఖనం కావచ్చు, గానం కావచ్చు, నటన కావచ్చు... లేదా సంగీతం కావచ్చు. అరవై నాలుగు కళలకు సంబంధించిన వారు సరస్వతీ పుత్రులు. ఎప్పుడూ ఆ చదువుల తల్లి తన బిడ్డలకు లక్ష్మి చాలినంత వుందో లేదోనని బాధపడుతూ వుంటుంది.

అలాంటి ఆమె బిడ్డలతో పని చేయించుకొని డబ్బులివ్వకపోతే, వార్ని మోసం చేస్తే సరస్వతీదేవి హుటాహుటిన వైకుంఠానికి వెళ్ళి లక్ష్మిని దబాయించి మరీ తప్పు చేసిన వార్ని దండించమంటుంది.

శ్రీమహాలక్ష్మి సంపదలివ్వమంటే సందేహిస్తుందిగాని తీసెయ్యమంటే ఎంతసేపు. పెట్టమంటే అత్త పెట్టదు గానీ, కోడలు వద్దంటే అత్త పెడుతుందా?

## శ్రీ లక్ష్మీదేవి

■ వేదాలలో 'శ్రీ', 'లక్ష్మి' అను నామాలతో స్తుతించబడుతున్నది.

■ జాహ్నవి తొలి అవతారం 'భృగువూ ఖ్యాతి'ల సంతానము.

– హంసవాహిని సత్తువకీ, ఉత్పత్తికీ, శక్తికీ, నీటికీ, వ్యవసాయానికీ అధిదేవత.

■ శ్రీమహావిష్ణువు సమస్త పురుషలోక ప్రకృతికీ ప్రతీకయితే, నారాయణి సమస్త స్త్రీ లోక ప్రకృతికీ ప్రతీక.

■ పద్మంపై నిలబడి మహా సౌందర్యంతో విరాజిల్లుతుండటంతో లక్ష్మీదేవికి పద్మవాణి అన్న నామం ఏర్పడింది.

■ శ్రీ మహావిష్ణువుతో ఉన్నప్పుడు రెండు చేతులతో ఉంటుంది.

■ యజ్ఞవాటిక శ్రీమహాలక్ష్మి రెండుచేతులలో రెండు పద్మాలు, మిగిలిన రెండు చేతులు అభయ వరద ముద్రలతో ఉంటాయి.

## మీకు రావాల్సిన సంపదలు మీకు రావటానికి

■ సిరి వస్తుంటే మోకాలు అడ్డుపెట్టే వాళ్ళు కూడా ఉంటారు. అలాంటి వారి వల్లే మీకు దుఃఖాలూ, నష్టాలు. అలాంటి వారు వైదొలిగి మీకు సుఖసంపదలు రావాలంటే ఈ మంత్రాన్ని 108 సార్లు ప్రతిరోజూ శుచియై ఉత్తరముఖియై జపించాలి. మిమ్మ బాధ పెట్టేవారూ, సుఖాలకీ, శాంతికీ అడ్డం వచ్చేవారు దూరమవుతారు.

ఓం శివశివశక్తి మహిశక్తి మహేశ్వరశక్తి నశిమశి హుం

ఇది క్రోధ బీజము. ఈ ఏకాక్షరీ మంత్రాన్ని పఠిస్తే శత్రునాశనం తథ్యం.





## పూలమ్మిన చోట...

■ కష్టాలు శ్రీమహాలక్ష్మి పతయిన శ్రీమహావిష్ణువుకే తప్పలేదు. గుక్కెడు పాలకోసం తిరుమల కొండల్లో అరవాల్సి వచ్చింది. ధనం పోయి గౌరవం పోయిందని దిగులుపడితే సంపద రాదు.

పూలమ్మిన చోటే కట్టెలు కొట్టాల్సి వచ్చినా చలించరాదు. కుక్కల అరుపుల వంటి నిందలూ, అవహేళనలూ లెక్కచెయ్యద్దు. ముందుకు సాగండి. మునుముందుకు సాగండి. స్వామీ వివేకానంద చెప్పిన అమృత భావమిది.



## శ్రీమహాలక్ష్మి ఏ వర్ణంతో వుంటే ఏ సూచనలంటే

■ నల్లగా ఉంటే వైకుంఠవాసునితో కూడి వున్నదని అర్థం.

■ కనకపు వర్ణంతో ఉంటే అనగా పసుపు పచ్చగా ఉంటే సకల సంపదలకీ అధినేత్రిగా భావించాలి.

■ తెల్లగా ఉంటే ప్రకృతి మాతగా, శుద్ధ ప్రకృతిగా గుర్తించాలి.

■ గులాబీ వర్ణంలో ఉంటే సకల ప్రాణికోటిపై దయతో చేసిన తప్పులను కడుపులో దాచుకునే తల్లియని భావించాలి.

■ సనంద నామధారి నాలుగు చేతులు చతిర్విధ పురుషార్థాలు ప్రసాదిస్తాయి.

■ ధన స్వరూపిణి వాహనం పగలు చూడలేని గుడ్లగూబ. 'ఉలూక' మని కూడా అంటారు. ఉలూకమంటే ఇంద్రుడని కూడా అర్థం. అందుకే శ్రీమహాలక్ష్మి రాత్రి పూట గృహంలో ప్రవేశిస్తుంది.



## వ్యక్తిగతమైన కోపాన్నీ, ద్వేషాలనీ వదిలెయ్యాలి

■ చంద్రవంక ప్రకాశంతో వెలిగే దంతాలు గల శ్రీలక్ష్మి అనుగ్రహం అంత తేలిక కాదు. శక్తి, ధైర్యం.. తెలివి ఈ మూడింటినీ రంగరిస్తేనే అపర సంపదలు లభిస్తాయి.

అవతల వారు దుర్మార్గులే కావచ్చు. కొన్నిసార్లు తప్పనిసరిగా కలసి పని చేయాల్సిన అవసరం పడచ్చు. అలాంటప్పుడు శత్రువుతోనయినా జతకట్టాలి. కార్యాన్ని సాధించాలి. దూర్వాసమహర్షి శాపంతో స్వర్గలోక సంపదలు పోగొట్టుకున్నాడు ఇంద్రుడు.

సంపదలు రాక్షసుల వశం అయ్యాయి. అప్పుడే శ్రీమహావిష్ణువు ఆదేశంతో శత్రువులైన రాక్షసులతో చేయి కలిపి సముద్రాన్ని మధించారు. అమృతాన్ని పొందారు. దుర్మార్గులైన దానవులని ఎంతవరకు ఉపయోగించాలో అంతవరకే ఉపయోగించుకున్నారు. ఆ తర్వాత వదిలేశారు.



## అలక్ష్మి

■ శ్రీలక్ష్మీదేవికి పూర్తిగా విరుద్ధం. క్షీరసాగర మథనంలో జన్మించింది. పురాణాలను పరిశీలిస్తే ఈ తల్లిని దుస్సహుడు చేపట్టాడు. వీని సంతానమే అధర్ముడు. ఈ తల్లి ముసలి రూప లక్షణాలతో, గాడిద వాహనాన్ని ఎక్కి చేతిలో చీపురు ధరించి ఉంటుంది.

కాకి గుర్తు గల జెండా రెప రెప లాడుతూ ఉంటుంది. లక్ష్మీదేవికి అక్క అయిన జ్యేష్ఠాదేవిని స్మరించి స్తుతిస్తే సంపదలు ఇవ్వకపోయినా పోగొట్టదు. చెల్లి లక్ష్మికి అడ్డు చెప్పదు.







## పోతన శ్రీభాగవతములో లక్ష్మీ స్తుతి

హరికిన్ బట్టపుదేవి, పున్నెములు ప్రోవర్థంపు పెన్నిక్క చం
దురు తోబుట్టువు, భారతీగిరిసుతల్‌తో నాడు పూబోణి, తా
మరలందుండెడి ముద్దరాలు,
జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములు వాపు తల్లి,
సిరి యిచ్చున్ నిత్య కళ్యాణముల్.



## భార్యాభర్తల అన్యోన్య దాంపత్యానికీ, సుఖ సంపదలకీ

ఉచ్ఛిష్ట చాండాలిని సుముఖిదేవి మహాపిశాచిని హ్రీం ఠః ఠః ఠః

■ ఈ మంత్రాన్ని భార్యాభర్తలు ప్రతిరోజూ వెయ్యి నూటపదహార్లు జపించి శ్రీలక్ష్మీపూజ చేసి సకల పిండి వంటలను నైవేద్యంగా పెట్టి భర్త ఆశీర్వాదం తీసుకుంటే ఆ స్త్రీకి సుఖాలూ, సంపదలూ సమృద్ధిగా కలుగుతాయి.



## ఋణ విమోచక శ్లోకము

ఓం ఐం హ్రీం శ్రీం శ్రియైః నమో భగవతి మమ సమృద్ధౌ ।
జ్వల జ్వల మేం సర్వ సంపదో దేహి దేహి మమ
అలక్ష్మీం నాశయ నాశయ ॥



## మీ శక్తేమిటో మీకు తెలీదు

■ 'గొప్పవాళ్ళ గూర్చి మాట్లాడుకుంటే గొప్పవాళ్ళయి పోరు. మీలోనూ మహా శక్తి దాగి వుంది. దాన్ని బైటికి తీస్తే కీర్తీ, ధనమూ, వైభోగాలూ మీ స్వంతమే. సమస్త గ్రంథాలలోని జ్ఞానమంతా మీలోనూ ఉంది. ఇంకా చెప్పాలంటే అంతకన్నా వేయి రెట్లు వుంది. ఆత్మవిశ్వాసాన్ని కోల్పోకుండా ఉండు విశ్వంలో దేన్నయినా సాధించగలవు' గుర్తుంచుకొని ముందుకు సాగితే నీవే ధనవంతుడవు, గుణవంతుడవు.



## అందంగా ఉండాలి, మందంగా వుండాలి, ఒక్కరూపాయికే ఇవ్వాలి

■ అదే మహా విజయ రహస్యం. మీరు అలా మీ ప్రాడక్ట్‌ని ఇవ్వగలిగితే, మలచగలిగితే మీరే అపర కుబేరులు. బాగా ఆలోచించండి. అలా అని రూపాయికి ఏ ప్రాడక్ట్ ఇవ్వాలా అని ఆలోచిస్తే నేను చెయ్యగలిగిందేమీ లేదు. ఈ పుస్తకం చదివి కూడా ప్రయోజనం లేదు.



## సకల దరిద్రాలూ పోవాలంటే తీయాల్సిన దిష్టి

ధూం ధూం ధూమావతిస్వాహా

■ ఈ మంత్రాన్ని పఠిస్తూ పిడికిలితో అన్నం తీసుకొని అందులో కుంకుమనూ, నెయ్యినీ కలిపి ఎర్రటి ముద్దగా చేసి ఆ ముద్దను తల చుట్టూ తనకితానే మూడుసార్లు తిప్పుకొని, ఆ ఎర్రని ముద్దను ఎవరికీ కనబడనిచోట వేయాలి. ఇదే మంత్రాన్ని వ్యాపారంలో నష్టాలు వచ్చే వారు పఠించటం వల్ల వ్యాపార వ్యవహారాదుల్లో నష్టాలు తగ్గిపోతాయి.







## అఖండ సంపదలకు చేయాల్సిన హోమం

■ 'ఓం శ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద శ్రీం క్షం' అని జపిస్తూ స్తుతిస్తూ 108 తామర గింజలతో లక్ష్మీ జపం చేసి తామర పూలతో మహాహోమం చేస్తే మహా సంపదలు సిద్ధిస్తాయి అని శ్రీలక్ష్మీ పురాణం శెలవిస్తోంది.



## శ్రీ మహాలక్ష్మి ఏకాక్షరీ మంత్రము

■ యజ్ఞ వాటిక అయిన శ్రీమహాలక్ష్మి మహాశివునికి పుత్రిక వంటిది. అట్టి శ్రీమహాలక్ష్మి ఏకాక్షరీ మంత్రం 'శ్రీం'. ఈ లక్ష్మీ బీజము జపించిన వారికి మహా ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది.



## సంపదలు లేకపోవటం తలరాత కాదు

■ నాకెవ్వరూ సహాయం చెయ్యటం లేదు. అంతా నా తలరాత. నాకూ, నా భార్యకీ, పిల్లలకీ తినే రాతలేదు. ఇలాంటివన్నీ మూర్ఖుడు మాత్రమే మాట్లాడతాడు.

భగవంతుడు జీవితాన్నిచ్చింది సాధించటానికీ, సుఖపడటానికి, కీర్తి గడించటానికి, అదృష్టాన్ని గూర్చి మాట్లాడటానికి ఒక్క ముసలి వానికే హక్కు ఉందని వివేకానందుడు ప్రపంచానికి శెలవిచ్చాడు. కాదు నాకు చేతకాదంటే చేతనయినది ఒక్క సంసారం చెయ్యటమే. అదే నేను చెప్పగలను. ఏదయినా సరే అంటే, అనుకుంటే సముద్ర మథనం ఒక్కడివే చేసి అమృతాన్ని సంపాదించగలవు.

## ఆర్థిక మూలాలతో జాగ్రత్త

- మిమ్మల్ని నాశనం చెయ్యటానికి 70 శాతం మంది ఎంచుకునేది అదే.
- పదిశాతం మీ పరువుపై.
- పదిశాతం మీ చుట్టూ వున్న వాళ్ళని దూరం చెయ్యటం.
- మీ మీద దుష్ప్రచారం 5 శాతం.
- మరో అయిదు శాతం ఇన్నీ చేస్తూ మీరంటే కోపం లేదని చెప్పటం.

## పక్కవాళ్ళు మీకంటే గొప్పవాళ్ళు కానే కాదు

■ వారిలోని శక్తిని బైటికి తీశారు. సర్వం సహ అడ్డం పెట్టి అంతస్థాయికి వెళ్ళారు. నీళ్ళలో మునిపోతున్నప్పుడు ప్రాణభయంతో చేసే ఆ మహా ప్రయత్నాన్ని చేసి ఒడ్డుకి చేరారు. కీర్తినీ, ధనాన్నీ సంపాదించారు. సంకల్పానికి జీవితాన్ని పణంగా పెట్టారు. సంపాదించారు. మీరూ చెయ్యగలరు. దానికి కావాల్సింది శ్రద్ధ, పట్టుదల. అహర్నిశం శ్రమ, శక్తి మీలోనూ ఉంది. దాన్ని విశ్వసించండి. బలహీనులమని భావించకండి. లేవండి. మీలో అంతర్లీనంగా వున్న శక్తిని బైటికి తీయండి. ప్రతివారిలోనూ వారి దుఃఖాలని తొలగించుకునే శక్తి వుంది. ఈ మాటలు చెప్పింది శ్రీ వివేకానందుడు. అమెరికా అధ్యక్షుడు అబ్రహం లింకన్ తన జీవితంలో అధ్యక్షుడు అయ్యే వరకూ ప్రతి విషయంలోనూ ఓడిపోతూనే ఉన్నాడు. అయినా ప్రయత్నం చేస్తూనే వున్నాడు. చివరకు గెలిచాడు.





## రాత్రికి రాత్రి కోటీశ్వరుడవ్వటం కల్లే... కలే

■ కేవలం ఊహల్లో మాత్రమే సాధ్యం. ఏ మార్గాల్లోనూ రాత్రికి రాత్రే సంపదలు పొందలేరు. ఇలాంటి వారి గూర్చే వివేకానందుడు చెప్పి ఉంటారు. పట్టుదల వదలకుండా చేసే ప్రయత్నం చివరకు విజయాన్ని కలిగిస్తుంది. ఒక్క రోజులో దేన్నీ సాధించలే అని.

## ధనం గూర్చి శ్రీరామకృష్ణ పరమహంస భావం

■ ధనం కూడు,గుడ్డలను మాత్రమే సమపార్జించి పెడుతుంది. దానికీ నీకూ ఏదో రక్త సంబంధం ఉన్నట్టు ప్రాకులాడకు. అదే జీవిత పరమార్థంగా భావించి బ్రతుకకు.

కప్ప వంటి నీవు పాము వంటి ధనం ముందు నాట్యం చేయి. అంతేగాని ఆ ధనమనే పాము కప్ప అనే నిన్ను మ్రింగేసేలా చేసుకోకు.

భార్యా, పిల్లలూ, సోదరులూ, బంధువులూ, హితులూ, సన్నిహితులూ, అభిమానులూ అంతా నీ పక్కనున్నప్పుడే నీవు సంపాదించిన ధనానికి గౌరవము. గౌరవమున్న చోట శ్రీలక్ష్మి స్థిరంగా వుంటుంది.

## దారిద్ర్య నాశన మంత్రం

ఓం హ్రీం త్రిభువన పాలిన్యై । మహాలక్ష్మై ।
అస్మాకం దారిద్ర్యం నాశయ నాశయ ।
ప్రచురం ధనం మే దేహి దేహి । క్లీం హ్రీం శ్రీం ఓం ॥



# శ్రీ మహాలక్ష్మీ మంత్రం

ఓం శ్రీం హ్రీం శ్రీం కమలే కమలాలయే ప్రసీద ప్రసీద ।

శ్రీం హ్రీం శ్రీం ఓం మహాలక్ష్మీ దేవ్యై నమః ॥



# ఏ నక్షత్రం వాళ్ళు ఏ చెట్టునీ లేదా వృక్షాన్ని పెంచితే శ్రీమహాలక్ష్మి అనుగ్రహం కలుగుతుంది

| | | |
|---|---|---|
| ■ | అశ్విని | పూలచెట్లు |
| ■ | భరణి | ఉసిరిక |
| ■ | కృత్తిక | కాయల చెట్లు |
| ■ | రోహిణి | జంబూవృక్షము, నేరేడు |
| ■ | మృగశిర | మామిడి, జామ |
| ■ | ఆరుద్ర | ఆకుకూరలు |
| ■ | పునర్వసు | దుంప సంబంధితమైనవి |
| ■ | పుష్యమి | పిప్పల, రావి |
| ■ | ఆశ్లేష | నాగ, తులసి |
| ■ | మఖ | బంతి, చామంతి |
| ■ | పుబ్బ | పలానము, మోదుగ |
| ■ | ఉత్తర | సరస్వతి చెట్టు |
| ■ | హస్త | అరటి |





| | | |
|---|---|---|
| ■ | చిత్త | బిల్వ, మారేడు |
| ■ | స్వాతి | అర్జున, మద్ది |
| ■ | విశాఖ | తీగచెట్లు |
| ■ | అనూరాధ | వకుళ, గుమ్మడి |
| ■ | జ్యేష్ఠ | కరివేపాకు, మునగ |
| ■ | మూల | దానిమ్మ |
| ■ | పూర్వాషాఢ | వంజుల |
| ■ | ఉత్తరాషాఢ | పనస |
| ■ | శ్రవణం | తులసి |
| ■ | ధనిష్ఠ | శమీ, జమ్మి |
| ■ | శతభిషం | కదంబ, కడిమి |
| ■ | పూర్వాభాద్ర | వేప, నిమ్మ |
| ■ | ఉత్తరాభాద్ర | ఆమ్ర, మామిడి |
| ■ | రేవతి | ఇప్ప |



# లక్ష్మీపుత్రుడు జన్మించాలంటే

■ మూలా నక్షత్రం రోజున గర్భం ధరించిన స్త్రీకి పసుపు, కుంకుమలు ఇస్తే మహా పుణ్యం కలుగుతుంది. సంతానం లేని వారికి మహర్జాతకుడైన పుత్రుడు కలుగుతాడు. వంశాభివృద్ధి చేస్తాడు. సుఖాలనూ, కీర్తిని పొందుతాడు.

## గుడులూ, విగ్రహాల్లో వజ్రాలుండవు

■ శిల్పాల్లో వజ్రాలూ, వైఢూర్యాలూ ఉండవు.

■ విలువైన వస్తువులు శిల్పాల్లో ఉంటాయని కొందరి నమ్మకం. అది అబద్ధం.

■ నంది విగ్రహాల్లో విలువైన సంపద ఉండదు. అలా ఉంచిన నందిని నిర్మించటం శాస్త్ర విరుద్ధం. మన పూర్వీకులు శాస్త్ర విరుద్ధమైన పనిచేయరు.

■ గుప్త నిధుల కోసం నిమ్మకాయలతో, గుమ్మడికాయలతో, కొబ్బరికాయలతో, పసుపు కుంకుమలతో బలిలాంటివి ఇవ్వటం ద్వారా నిధుల లభించవని మంత్రశాస్త్రం శెలవిస్తోంది.

## అడుగు వెనక్కి వేయద్దు

■ శ్రీమహాలక్ష్మీదేవి అనుగ్రహించాలని భావిస్తే గ్రహాలు చెప్పినా, పెద్దక్క చెప్పినా, పితృదేవతలు చెప్పినా వెనకడుగు వేయదు. అదే పిరికివాడని తెలిస్తే వంద అడుగులు వెనక్కి వేస్తుంది. అందుకే శ్రీవివేకానందుడు ఇలా చెప్పాడు. ఒక్క అడుగు వెనక్కి వేయద్దు. ఎలాంటి పరిస్థితినయినా ఎదుర్కోండి.

నక్షత్రాలు స్థానభ్రంశం చెందుగాక, మొత్తం ప్రపంచమే ఎదురు నిలుచును గాక. పోరాడండి, పిరికి తనంతో వెనకడుగు వేస్తే ఏదీ సాధించలేరు. అడుగు వెనక్కి వేయటం ద్వారా ఏ విపత్కర పరిస్థితి నుంచీ తప్పించుకోలేరని.





## పరస్త్రీని తల్లిగా చూసేవారినీ, మద్యపానం చెయ్యని వారినీ లక్ష్మి అనుగ్రహిస్తుంది

■ స్త్రీ ముఖం చూసి మాట్లాడవద్దు. ఆమె పాదాల వైపు చూసి మాట్లాడు. ఆ తల్లి శ్రీమహాలక్ష్మి అనుగ్రహం కలుగుతుందని శ్రీరామకృష్ణ పరమహంస శెలవిచ్చారు.

స్త్రీ వ్యామోహం గలవారి లక్షణం జ్యేష్టాదేవిది. అలాగే మద్యపానం కూడా. వృత్రాసురుడు కూడా అందమైన కనుదోయి గలదీ, బలిసిన చన్నులు గల రంభని మోహించి, మద్యపానం చేసి కామాతురుడై సంచరించటంతో ఇంద్ర సింహాసనాన్ని పోగొట్టుకున్నాడు.

వజ్రా యుధంతో సంహరించబడ్డాడు.వైద్య పరిభాషలో మద్యపానం చేసేవారు ప్రపంచంలో ఏదైనా చేసేస్తామనీ, చెయ్యగలమనీ భావిస్తారట. కాని చిన్న పని కూడా ప్రాక్టికల్‌గా చెయ్యలేరట.

చెయ్యగలమనుకుంటారు గానీ ఏదీ చెయ్యలేరు. మద్యపానం శక్తినీ, తెలివినీ హరించివేస్తుంది. అదే మద్యపానం చెయ్యనివాడు ఇసుమంత అయినా ఆచరణలో పెడతారు. వివేకానందుడు చెప్పినట్టు ఇసుమంత ఆచరణే ఇరవై వేల టన్నుల వ్యర్థమైన మాటలతో సమానం.

## నష్టాలూ, దరిద్రాలూ పోగొట్టుకోవటానికి

■ 'తిలాః పునంతుమే పాపం' అని పద్మపురాణం చెబుతోంది. తిలలు సర్వపాపాలూ, దోషాలూ పోగొడతాయి. సుఖాలనూ, సంపదలనూ పొందాలంటే తిలదానము చేయాలి.



## వీళ్ళని నమ్మితే
## నీ సంపద పోయినట్టే

■ పనిలేకపోయినా నీ చుట్టూ తిరిగేవాణ్ని.

■ నీ కిష్టంలేని వారి గూర్చి పదే పదే విమర్శించే వాణ్ని.

■ నీపై అతి చనువును ప్రదర్శించేవాణ్ని.

■ కలిసిన ప్రతిసారీ దబ్బు గూర్చే మాట్లాదేవాణ్ని.

■ నీ సేవకులపై జులుం ప్రదర్శించేవాణ్ని.

■ స్త్రీ వ్యామోహం గలవాణ్ని.

■ మద్యపానం, జూదం ఇత్యాది అలవాట్లున్న వారినీ.

■ కోపస్వభావం గలవాడినీ...

■ వీళ్ళలో ఏ ఒక్కరిని పక్కనుంచుకున్నా పోయేది స్త్రీ ,సిరులు కూడా. ఇలాంటి లక్ష్మణములు అనగా కోపము, త్రాగుబోతు, తిరుగుబోతు, మోసము, అసూయ, పరనింద, చెడు ఉద్దేశ్యములు ... ఇలాంటి లక్షణములు అపరిశుద్ధ లక్షణములని గౌతమ బుద్ధుడు శెలవిచ్చాడు. అపరిశుభ్రత గల గృహంలోనే కాదు అపరిశుద్ధ లక్షణాలు గల వారినీ, వారిని అంటిపెట్టుకున్న వారినీ, వారితో కలిసి తిరిగే వారినీ శ్రీలక్ష్మీదేవి అనుగ్రహించదు.



## అష్ట ఆర్ఘ్యాలతో
## పూజ లక్ష్మికి ప్రీతి

■ పెరుగు, తేనె, నెయ్యి, అక్షితలు, గరిక, నువ్వులు, దర్భలు, పువ్వులు.







## యుగాది రోజు
## లక్ష్మీ పూజ

■ ఉగాది రోజు లక్ష్మీదేవి నువ్వుల నూనెలో ఉంటుంది. ఆ రోజు నువ్వుల నూనెను వళ్ళంతా రాసుకొని సున్నిపిండితో స్నానం చేసి లక్ష్మీదేవిని స్మరిస్తే లక్ష్మీ యాగం చేసిన ఫలమని శాస్త్ర వచనం. సృష్టి ప్రారంభమైన ఉగాదినాడు తలస్నానం చేయకపోవటం ఇంకా ఆ రోజు చినిగిన వస్త్రాలను ధరిస్తే సంవత్సరం పొడవునా ఆర్థిక బాధలు తప్పవు.

## అరటిగెల ఏవైపుకి
## పెడితే ధనలాభం

■ గృహంలో తేనెటీగలు తేనెపట్టు తూర్పు వైపున పెడితే ధనలాభం. అదే వాయువ్య దిశలో పెడితే సంపద తరుగుతుంది. అలాగే గృహంలో అరటిచెట్టుకి గెల ఉత్తరం వైపు పెడితే ధనలాభం. అదే ఈశాన్యంలో పెడితే కీర్తి కలుగుతుంది.

## పరుల ధనాన్ని
## పోగొట్టవద్దు

■ అలా ఎగ్గొట్టిన వాడు మీ పుత్రుడిగా జన్మిస్తాడు. మహా దుఃఖాలను కలిగిస్తాడు. మీరు కష్టపడి సంపాదించిన ధనాన్ని సకల వ్యసనాలకీ ఖర్చుపెడతాడు. మహా క్షోభకి గురి చేస్తాడు. ఇంటి ద్రవ్యాన్ని అనుభవిస్తూ తల్లినీ, తండ్రినీ నిందిస్తాడు. రోళ్ళతో, రోకళ్ళతో, మాటలతో గాయపరుస్తాడు. ఋణం తీరిన తర్వాత రోగాలతో చనిపోయి వడ్డీగా మీకు వేదనను మిగులుస్తాడు. ఇంతటి ధర్మసూక్ష్మాన్ని శ్రీపద్మపురాణం చెబుతోంది.



## ఈ జన్మలో దరిద్రాన్ని ఎందుకు అనుభవించాల్సి వస్తోంది

■ గత జన్మలో పుణ్య కార్యములను చేయకపోవటం వల్ల.

■ ఆకలితోనున్న వానికి అన్నం పెట్టగలిగీ పెట్టకపోవటం వల్ల.

■ పితృదేవతలకు తగు కార్యాలు చేయకపోవటం వల్ల.

■ మహా దానాన్ని పొంది కూడా లోభముతో ఒక్క రూక కూడా ఖర్చు చెయ్యకపోవటం వల్ల

■ లోభాన్నే తల్లిగా, తండ్రిగా, పితృదేవతలుగా భావించటం వల్ల.

■ హోమాదులు చేయకపోవటం వల్ల.

■ భార్యా పుత్రులకి కూడా నీ ధన విషయాలని చెప్పకుండా మరణించటం వల్ల

■ తీర్థయాత్రలను చేయకపోవటం వల్ల...

■ ఎంత కష్టపడ్డా, ధర్మబద్ధంగా ఉన్న సంపదలు ఈ జన్మలో పొందలేకపోటానికి కారణాలని శ్రీ పద్మ పురాణం చెబుతోంది. అలాంటి వారు ఈ జన్మలోనైనా చేతనయినంత సకల పుణ్యకార్యాలు చేయటం ద్వారా కొంతలో కొంతైనా ఆ దోషాలు పోయి సంపదలనే సుఖాలు పొందవచ్చని కూడా శ్రీ పద్మ పురాణం శెలవిస్తోంది.



## స్త్రీకే, పురుషునికే అసలు సిసలు సంపదలు

■స్త్రీకి తొలి అలంకారము రూపము. రెండవ ఆభరణము శీలము. మూడవది సత్యం. నిజాయితీ నాలుగవది. అయిదవది ధర్మము. ఆరవది మాధుర్యము. ఏడవది బాహ్యాంతర శుద్ధి. ఎనిమిదవది పితృభావాను





సరణము. శుశ్రూష తొమ్మిదవది. సహనం పదవది. రతి పదకొండవది. పన్నెండవది పాతివ్రత్యము.

ఈ పన్నెండూ స్త్రీలకి మహా సంపదలని పద్మ పురాణం శెలవిస్తోంది. మరి పురుషునికి ఈ పన్నెండు గుణాలు గల స్త్రీ లభించటమే మహా సంపద. అంతకు మించిన సంపద భువిపై లేదు.



## రారాజుగా బ్రతికి ఉండచ్చు

■ ఆకాశవాహనాలూ, మహా వైభోగాలూ అనుభవించి వుండచ్చు. అడిగిన వారికి లేదనకుండా ఇచ్చిన తత్వముతో కీర్తి గడించి ఉండచ్చు. చుట్టూ మనుష్యుల వల్ల ధనం కోల్పోయి ఉండచ్చు.

పిల్లల స్కూల్ ఫీజుకీ, ఇంటి అద్దెకీ వెదుక్కునే పరిస్థితి రావచ్చు. అయినా సరే... దిగులు పడవద్దు. బాధనీ, ఆవేశాన్నీ అదుపులో ఉంచుకోండి. ఎంతో కాలం పట్టదు. తిరిగి మీ వైభోగాన్ని ప్రపంచానికి చూపటానికి.

చరిత్రని పరిశీలిస్తే జపాన్ ఎన్ని సమస్యలను తట్టుకుంది. ఎంత సాధించింది. మళ్ళీ ఇప్పుడూ అదే స్టేజీలో ఉన్నా వాళ్ళు ఆత్మ విశ్వాసం కోల్పోలేదు. మళ్ళీ పూర్వ వైభోగం అతి త్వరలో తెస్తామని అంటున్నారు. దాన్ని ఆదర్శంగా తీసుకోండి.

రారాజు గరీబు అవ్వచ్చు. అది పెద్ద విషయం కాదు. గరీబు మళ్ళీ రారాజు అవ్వటం అసలు సిసలు మొగతనం.

■ గొప్పతనం. అది మీరు చెయ్యగలరు. ఆ శక్తి మీలో ఉంది అనే వివేకానందుని భావాన్ని స్మరించండి చాలు.



## మల్లెపూలతో లక్ష్మిని పూజిస్తే మహా సంపదలు

■ పరమశివుణ్ని ఉమ్మెత్త పూలతోపూజిస్తే సంతానం కలుగుతుంది. అవిసె పూలతో కీర్తి, అలాగే విష్ణుమూర్తిని కదంబ పుష్పాలతో పూజిస్తే మోక్షం.

■ శ్రీలక్ష్మీదేవిని మల్లెపూలతో పూజిస్తే ధనంతో పాటు సుఖశాంతులు కలుగుతాయి.



## ఏడేడు జన్మల దోషాలు పోయి సంపదని పొందాలంటే

■ శ్రీపద్మపురాణంలోని పృథు చక్రవర్తి గాథను చదవటం ద్వారా దోషాలు సమసిపోతాయి. పృథు గాథ పరమపవిత్రం. సర్వ పాప నాశనము. కీర్తినీ, సంపదలను అపారంగా ఇచ్చేది వేనుని పుత్రుడు పృథు చక్రవర్తి గాథ. ఆయుః ప్రదము, స్వర్గ ప్రదము కూడా.



## ఎవరు గొప్పవారు కాదు

■ నేను వారికంటే తక్కువ. ఏమీ చెయ్యలేకపోతున్నాను. నాకు పెద్ద పెద్ద వాళ్ళంతా అడ్డం. అందుకే జీవితంలో ఎదగలేకపోతున్నాను అని అనుకుంటారు కొందరు. ఎవరూ గొప్ప కాదు.

స్వజాతి కష్టాలూ, బాధలూ అన్ని ప్రాణులకీ ఉన్నాయి. మిగతా జాతులకి ఆహారం ద్రవ్యమైతే మనుష్యులకి మధ్య ప్రతిచర్య కూడా ధనం గూర్చే. ఆ ధనం కోసమే తమ శక్తినీ, తెలివినీ, లౌక్యాన్నీ





ప్రదర్శిస్తారు. కార్తవీర్యార్జునుడికి వేయి బాహువులున్నాయి. జమదగ్ని పుత్రుడు పరశురాముడు వాటిని ఖండించాడు.

ఆ పరశురాముడి బలాన్ని శ్రీరాముడు నశింపచేశాడు. అలాగే జరాసంధుడ్ని భీముడు ఓడించాడు. భీముని బలాన్ని హనుమంతుడు నశింపచేశాడు.

హనుమంతుణ్ని సూర్యుడు విసిరేశాడు. అ సూర్యుడు కూడా మేఘాలతో కప్పి వేయబడతాడు. ఆ మేఘాన్ని వాయువు వేరు చేస్తాడు. ఆ వాయుబలాన్ని పర్వతాలు హరించి వేస్తాయి.

కాన ఎవరూ గొప్ప కాదు. ఆ గొప్పవారిపై విజయం సాధించుతూ ముందుకెళితేనే సంపద, కీర్తి, వైభోగాలు.



## సజ్జన సావాసమే సంపదలకి మూలం

■ మద్యపానం చేసేవాడితో తిరిగితే మద్యానికి బానిసవ్వక తప్పదు ఏ రోజుకైనా. ధూమపానం చేసేవాడితో తిరిగితే అలవాటు అయినా అవ్వకపోయినా పక్కనుండటం ద్వారా అనారోగ్యం కలుగుతుంది.

అలాగే అబద్ధాలూ, కుట్రలూ చేసేవారితో తిరిగితే ఏదో ఒకరోజు వారు మీమీదే ఆ ప్రయోగం చేస్తారు. అలాంటి వారితో స్నేహం వల్ల ధనం పోతుంది. పరువు పోతుంది.

మీరు నిప్పులాంటి వారే కావచ్చు. అయినా ఇనుము అనే కఠినమనస్కులతో తిరిగితే సమ్మెట పోటు తప్పదు. ఆ సమ్మెట దెబ్బ ఒక్కోసారి మీ సంపదకే కాదు మీ కుటుంబానికీ తగులుతుంది. సజ్జన సావాసం అగ్ని వంటిది. అది బంగారానికి పట్టిన మలినాన్ని కూడా తొలగించగలదు.

## శ్రీమహాలక్ష్మి వీరిని పుష్కరాల వరకు క్షమించదు

■ దీనుల ధనాన్ని అపహరించటం

■ బంగారం, వెండి వస్తువులను దొంగలించటం

■ అన్నదానానికి వచ్చిన విరాళాలని దిగమ్రింగిన వాడిని

■ యోగ్యురాలైన కన్యకు అయోగ్యుణ్ని ఇచ్చిన తండ్రినీ

■ తన కళ్ళ ముందే స్త్రీ బాధింప బడుతుంటే చూస్తూ ఊరుకుండే వాడినీ, ప్రోత్సహించే వాడినీ.

■ స్నేహితులూ, పనివారల భార్యలతో సంగమించేవారినీ

■ దానం ఇస్తానని చెప్పి ఇవ్వని వాడిని

■ ఆశ చూపి, కన్యలతో కలసినవాడిని

■ స్త్రీని కొట్టేవాడినీ, అపనింద వేసిన వాడినీ, శీలాన్ని శంకించిన వాడినీ

■ అన్నకు పెళ్ళి కాకుండా తాను వివాహం చేసుకున్నవాడినీ

■ పరస్త్రీని సంగమం కోసం ఆహ్వానించేవాడినీ

■ అక్కకి వివాహం కాకుండా గృహస్థ ధర్మాన్ని స్వీకరించిన స్త్రీనీ

■ పరపురుషుల నుంచి స్త్రీకి సంపూర్ణ భద్రతను కలిగించనివాడినీ

■ స్త్రీ ధనంతో తీర్థయాత్రలు చేసే వారినీ

■ పరుల భార్యలను చూపులతోనే రమించేవాడినీ

■ పరుల దోషాలనీ, లోపాలనూ వెదికేవాడినీ, ఇతరులకు చెప్పేవాడినీ శ్రీమహాలక్ష్మి కరుణించదని శ్రీపద్మపురాణం చెప్పటంతో పాటు అవి మహా పాతకాలని కూడా శెలవిస్తోంది.





## అంగట్లో అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శనంటే

■ లోభితనం.. అదే మహాశని. అంతకుమించిన దరిద్రం లేదు. ఉన్నదాన్ని అనుభవించాలి. మీ చుట్టూ వారినీ అనుభవించేలా చెయ్యాలి. అలా బ్రతికితే సింహం బ్రతుకవుతుంది.

మహా వైభవోపేతమైన జీవితం అవుతుంది. అదే నక్కల్లా, కుక్కల్లా లోపల లోపల దాచి తానూ తినక, తన వారినీ తిననీయకుండా నిల్వ చేసే సంపద కుళ్ళిన మాంసం వంటిది.

అట్టి వాడి సంపద తనకే కాదు, తన వారికి కూడా అంగట్లో అన్నీ వున్నా అల్లుడి నోట్లో శని ఉన్నట్టే అన్న చందంగా మారుతుంది.

## భూలక్ష్మిలా ఉంటేనే లక్ష్మీ అనుగ్రహం

■ వృక్షం పండ్లనూ, కాయలనూ ఇస్తుంది. అలా ఇచ్చినందుకు ప్రతిఫలంగా నాకూ, కొమ్మకీ పది పండ్లు కావాలని అడగదు. అలాగే నది దాహాన్ని తీరుస్తుంది.

వందల వేల ఎకరాల పంటలను పండిస్తుంది. నాకేంటని అడగదు. అలా జీవనం సాగించాలి.

పదిమందికీ మంచి పని చేస్తూ ఆ మంచి పని మీద ధ్యాస లేకుండా తన కొచ్చే కీర్తి మీదే ధ్యాసపెట్టి సకల కార్యాలూ చేస్తే నలుగురికీ ఆడంబరంగా, హుందాగా ఇచ్చిన చేతులే తిరిగి చాపాల్సి వస్తుంది.

## పరువుంటే లక్ష్మి స్థిరనివాసమున్నట్టే

■ మీ చుట్టూ ఉన్న హితులనీ, స్నేహితులనీ, బంధువులనీ, వ్యాపార వ్యవహారాదుల చేయువారందరినీ ఏదో రకంగా అనగా ధనం, అమ్మాయిలు, అధికారం లేదా బెదిరించి, భయపెట్టి అవతల వారు తమ వైపుకి తిప్పుకోవచ్చు.

తద్వారా మిమ్మల్ని సకల కష్టాల పాలు చేయచ్చు. ఎవరూ ఏమీ చేయలేనిదీ, మీ నుంచి దూరం చేయలేనిది కీర్తి మాత్రమే. కీర్తి అంటే లక్ష్మీదేవి స్థిర నివాసం. దానికి మరో పేరే పరువు.

పురాణ ఇతిహాసాల్లో ఎందరో రాజన్యులు సంపదలు పోయినా కీర్తిని పోగొట్టుకోనందుకే తిరిగి తమ సంపదలనూ, వైభోగాన్నీ పొందారు. ఆడదానికి శీలమెంత ముఖ్యమో, మగవాడికి పరువంత ముఖ్యం. దాన్నే ఆంగ్లంలో 'గుడ్‌విల్' అని అంటారు.

## నిధుల వేటలో మరణం

■ బలి తీసుకుంటుందన్న శక్తి అబద్ధం.

■ ఊపిరాడకా, ఆక్సిజన్ లేకపోవటము కారణము.

■ తాళపత్రాల్లో, రాగిరేకుల్లో, గుడికట్టు శాసనాలన్నీ అభూత కల్పనలే.

■ మేకలూ, నల్ల కోళ్లు ఇత్యాదివన్నీ బలివ్వటం ద్వారా నిధులు బయటపడవు.





■ ఆందోళనలతో, భయంతో, ఆకు కదిలినా అదేదో శక్తి కబళిస్తుందన్న మహా భయం మహా అనర్థాలకి దారి తీస్తుంది.

■ నిధులున్న దగ్గర మహా సర్పాలుంటాయన్నది కూడా అసత్యమే.

## అవతలి వారు నాశనమవుతుంటే

■ మీ కళ్ళలో ఆనందం కనిపించిందంటే, అలా మీరు ఆనందం చెందుతున్నారంటే ఖచ్చితంగా పతనం ప్రారంభమయిందన్న మాట. వారి నాశనానికి మీలో ఇసుమంతన్న ఆనందం కలిగిందంటే అర్థం ఆ పాపంలో ఎంతోకొంత భాగమున్నట్టేగా.

నాలుగు వేదాల్లో, ఉపనిషత్తుల్లో ఒక్కటే భావం ఉంది. తిట్టు, కసురుకో, కొట్టు, హింస చేయి పాపపరిహారం వుంది. కడుపు మీద కొట్టద్దు. అలా కొట్టే దెబ్బ ఆ ఒక్క కడుపు మీదే కాదు ఆ వ్యక్తి కుటుంబ సభ్యుల కడుపు మీద.

ఆ ఉసురు తగిలితే నాలుగు తరాల వరకూ తేరుకోలేరు. శ్రీమహాలక్ష్మి ఆ పాపం చేసిన వ్యక్తి పరిసరాల్లోకి కూడా రావటానికి ఇష్టపడదు. అప్పటికే గృహంలో ఉంటే వెళ్ళటానికి ప్రయత్నిస్తూనే ఉంటుంది.

## ఓడలు బండ్లు అవ్వచ్చు....

■ అలా అయినప్పుడు కృంగిపోకూడదు. ఆత్మ విశ్వాసం పోగొట్టుకోకూడదు. వందల కోట్ల ఆస్థి ఉంది. వయసు డెబ్భయి సంవత్సరాలు. నీ సంపదంతా తీసుకుని మళ్ళీ నిన్ను యవ్వవంతుణ్ని చేస్తాను అంటే ఏం కోరుకుంటారు. యవ్వనమనే వయసునేగా. వందల

కోట్లు ఎందుకొదిలేశారు. ఏదైనా చెయ్యగలననేగా! మళ్ళీ అంతకుమించిన సంపద సృష్టించగలననేగా! అందుకే ఆరోగ్యలక్ష్మి ఒక్కటి స్థిరంగా ఉంటే వేలకోట్లయినా మళ్ళీ సంపాదించవచ్చు.

వయసు సంగతి పక్కన పెట్టి ఎవరెస్ట్‌ని ఎక్కి విజయకేతనాన్ని ఎగుర వేయవచ్చు. తిరిగి బండ్లని ఓడలూ చేయచ్చు.



## శ్రీమహాలక్ష్మి తర్వాత ఏ గ్రహ పూజల వల్ల ధనం పొందవచ్చు

■ సకల ప్రాణికోటికీ అన్న ప్రదాత సూర్య భగవానుడు శౌర్యాన్నీ, తేజస్సునీ ఇస్తాడు. సకల శుభాలూ, మంగళకరమైన కార్యాలనూ కుజుడు అందిస్తాడు. శుక్రుని వల్ల సుఖాలూ, భోగాలూ కలుగుతాయి.

శనీశ్వరుని వల్ల ఆత్మవిశ్వాసము, రాహుకేతువుల వల్ల కీర్తి, పదిమందిలో గుర్తింపూ కలుగుతుంది. ఇక సంపద విషయానికొస్తే బుధ, గురువుల వల్ల మహా ధనం లభిస్తుంది. సంపద వృద్ధి అవుతుంది.



## నుదుటి రాతను తప్పించే భస్మ మహత్యం

■ వస్త్రాలపై చారలను అగ్ని కాల్చివేసినట్టు ఎవరి నుదుటి రాతనయినా మార్చే మహాశక్తి భస్మమునకు ఉంది. విభూతిని నుదుటిపై మూడు రేఖలుగా పెట్టుకుంటే త్రిమూర్తులను పూజించిన ఫలం. ముఖాన ధరిస్తే నోరు చేసిన పాపాలు పోతాయి.

చేతులపై ధరిస్తే చేతులు చేసిన పాపాలూ, హృదయంపై ధరిస్తే మహా దురాలోచనలూ, నీచ ఆలోచనలు చేసిన దోషాలూ పోతాయి. నాభిస్థానమున ధరిస్తే పరస్త్రీలను పొందిన పాపాలూ, నాభి పక్కల





ధరిస్తే పరస్త్రీ స్పర్శా దోషాలూ తొలగిపోతాయి. ఆయువు పెరుగుతుంది. గర్భిణీ స్త్రీలకు సుఖ ప్రసవము జరుగుతుంది.

భూత ప్రేతాది పిశాచ గణాలను పరిసరాల్లోంచి పారద్రోలుతుంది. భస్మము అనగా పాపాలను బెదిరించి పోగొట్టేదని పద్మపురాణంలో శివుడు శ్రీరామునితో చెప్పాడు.

పద్మపురాణంలో వచ్చే ఈ భస్మ మహత్యంలో భస్మధారణ గురించి ఒక్కటే చెప్పటం జరిగింది. మహా ధనసంపదలు పొందటానికి అలంకరించుకోవాల్సింది భస్మధారణే.



## శ్రీలక్ష్మీదేవిని పూజించేటప్పుడు...

■ లక్ష్మీదేవి మూర్తికి ఎదురుగా ఉండటం, నమస్కరించటం చేయకూడదు.

■ గడప శ్రీమహాలక్ష్మి పీఠం. నమస్కరించి దాటాలి.

■ ఒక చేతితో దండం పెట్టడం, ఇంకా పురుడూ, మైలా ఉన్నప్పుడు దర్శనము చేసుకోవటం చేయరాదు.

■ కోపాలూ, ఆవేశాలూ, చిరాకులూ వదిలేయాలి.

■ పూజామందిరం వద్ద గానీ, ఆలయాల్లోని మూర్తి ఎదురుగా గానీ ఎవ్వరినీ ఆశీర్వదించకూడదు. ఆశీర్వదించాల్సింది ఆ వైకుంఠవాసినియే.

■ అపాన వాయువు విడవరాదు. అలా చేస్తే తిరిగి స్నానం చేసి పూజ ప్రారంభించాలి. పూజామందిరం పక్కల లేదా దేవాలయ ప్రాంగణంలో గానీ కాళ్ళు చాపి కూర్చోకూడదు.

■ ఎంగిలి చేత్తో పూజించకూడదు. ఆచమనం చేసిన తర్వాత చేయి కడుక్కోవాలి.

■ ఆత్మ ప్రదక్షిణం చేయకూడదని కూడా పద్మపురాణం చెబుతోంది.



## భగవద్గీతలో ఏ అధ్యాయం పఠించటం ద్వారా సంపదలు కలుగుతాయి

- మొదటి అధ్యాయం - పూర్వజన్మ పాపాలు తొలగుతాయి
- రెండవ అధ్యాయం - సుఖశాంతులు
- మూడవ అధ్యాయం - తన వారు చేసిన పాపాలను కూడా పోగొడుతుంది
- నాల్గవ అధ్యాయం - భయద్వేషములు తొలగిపోతాయి
- అయిదవ అధ్యాయం - మహా పాపాలు తొలగుతాయి
- ఆరో అధ్యాయం - జ్ఞానసిద్ధి
- ఏడో అధ్యాయం - ఉత్తమోత్తమమైన జన్మ
- ఎనిమిదో అధ్యాయం - ముక్తి
- తొమ్మిదో అధ్యాయం - యజ్ఞము చేసిన ఫలము
- దశమాధ్యాయం - మహా ఐశ్వర్యాలను కలిగిస్తుంది
- పదకొండో అధ్యాయం - భూత ప్రేత పీడలు తొలగుతాయి
- పన్నెండో అధ్యాయం - ఏకాగ్రత, భగవంతుని ప్రీతి





- పదమూడో అధ్యాయం - కోరిన ఫలము సిద్ధిస్తుంది
- పధ్నాలుగో అధ్యాయం - మహా శక్తి
- పదిహేనో అధ్యాయం - మహా తపస్సు చేసిన ఫలం
- పదహారో అధ్యాయం - రాజాధిరాజులా వెలిగిపోతారు
- పదిహేడో అధ్యాయం - అనేక వ్యాధులు దూరం
- పద్దెనిమిదో అధ్యాయం - ధర్మ, దాన, యజ్ఞాలు చేసిన ఫలము



## అన్నమాచార్యుడు శ్రీమహాలక్ష్మిని సంబోధించిన విధం

■ పలుకు తేనెల తల్లిగా వర్ణించాడు. అలాగే లక్ష్మీదేవికి శ్రీసతి, భార్గవి ('భృగువు ఖ్యాతి'ల కుమార్తె గాన) అనీ, నిత్యాన్నపాయిని అనీ కీర్తించాడు. శ్రీలక్ష్మీదేవిని పురాతన నామాలతో మునులూ, తాపసులూ కీర్తించారు. ఆమె కరుణా కటాక్షాలతో, తేజస్సుతో విలసిల్లారు.



## ఈ నక్షత్రాన రజస్వల అయిన స్త్రీ భర్తకి మహా సంపదలను అందిస్తుంది

■ అశ్వనీ, రోహిణీ, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణ, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్రా, రేవతి...

మిగతా నక్షత్రాలలో అయిన వారు వారి జాతక రీత్యా కూడా మహా వైభోగాలను పొంది సంపదలు తెచ్చి పెట్టే వారు అయివుండటానికి చాలా ఆస్కారం వుంది.



# శ్రీలక్ష్మీ కటాక్ష పరమరహస్యం

■శ్రీమహావిష్ణువు నారదునితో పరమ రహస్యం ఇలా చెబుతాడు. 'నారదా, సూర్యోదయ అస్తమ సమయాల్లో భోజనం చేసిన వార్నీ, తడి కాళ్ళతో నిద్రపోతున్న వార్నీ, వివస్త్రులై నిద్రోపోయేవార్నీ, తన నూనెను అవతలి వారికి అంటించిన వార్నీ లక్ష్మి అనుగ్రహించదు.

ఏకాదశి, జన్మాష్టమి రోజులలో ఉపవాసం ఉండని వారింట ఉండదు. అలాంటి వార్ని సహితం శ్రీమహాలక్ష్మి అనుగ్రహిస్తుందేమో గాని అహంకారులనీ, గర్వపోతులనూ అసలు క్షమించదు.

శ్రీలక్ష్మి క్షమాగుణం, శాంత గుణం అనే ఆ రెండు గుణాల్లో ఉంటుంది. ఈ రెండు గుణాలు ఉన్న వార్ని లక్ష్మీదేవి సదా అనుగ్రహిస్తుంది.'



# శ్రీమహాలక్ష్మి వరమిచ్చినా పూజారి కూడా వరమివ్వాలి

■ఆ పూజారి పేరు శుక్రుడు. ధన వైభోగాలతో పాటు కీర్తి సుఖాలకి కారకుడు.

శుక్రగ్రహ ప్రభావం మహా సుఖాలనీ, కీర్తినీ, సంపదలనీ ఇస్తుంది. నైవేద్యంగా పులుపు సంబంధితమైనవీ, తెల్లని పదార్థాలనూ పెడితే శుభ వరాలనిస్తాడు. వజ్రము ధరించటము ఈయనకు ప్రీతి.

శ్రీకృష్ణుడు అనుగ్రహించి ఇచ్చిన అపార సంపదలను కుచేలుని నుంచి దొంగలించటానికి ప్రయత్నించి శివుని కోపానికి గురై ఆ భోళాశంకరుని కీర్తించి తప్పు క్షమించమని వేడుకున్నాడు. గ్రహప్రీతికి





అలచంద గుగ్గిళ్ళు, పటిక బెల్లం, నేయి కలిపిన అన్నము, పాలు, పెరుగు, పంచదార, ఏలకులు, కర్పూరము ఇత్యాది వాటిని నైవేద్యంగా పెడితే వారి యొక్క శుక్రగ్రహ చెడు ప్రభావం తొలగి రక్షణ పొందుతారు. సంపదలకూ, అలాగే ఔషధాలకూ అధిపతి అయిన శుక్రగ్రహ అనుగ్రహం పొందవచ్చు.



# లక్ష్మీదేవికి బొట్టు పెట్టి పిలవండి

■శ్రీమహాలక్ష్మిని గృహంలోకి ఆహ్వానిస్తూ, లక్ష్మీదేవిని స్తుతిస్తూ, పూజిస్తూ నారింజ, జామపండు, ఖర్జూర ఫలాలను నైవేద్యంగా పెట్టి సాంబ్రాణి ధూపముతో, అగరు గంధములను ప్రీతిగా సమర్పించి తామర పువ్వులతో పూజించి హరిమానస హారిణిని పిలిస్తే బొట్టు పెట్టి పిలిచినట్టు గృహాన్ని పావనం చేస్తుంది.



# వందల కోట్లు సంపాదించే పుత్రుడు పరోపకారమే పరమ సంపదలను ఇస్తుంది

■పదిమందికీ చేతనయినంత సహాయం చేయటం ద్వారా పుణ్యం సంగతి పక్కన పెట్టండి. కీర్తి కలుగుతుంది. ఆ కీర్తి వల్లే మీరంటే సమాజంలో గురి ఏర్పడుతుంది. అది చాలు. బంగారం లాంటి మీకు మీ మాట అనే బంగారం మీదే ఏ వస్తువూ పెట్టకుండా డబ్బు వస్తుంది. అలా పరోపకారం కోసం దేహాన్నే కోసి ఇచ్చిన మయూరధ్వజునికి వాని పేరుతోనే నెలకొల్పుతున్నారు దేవాలయాల్లో ధ్వజస్థంభం.



## శ్రీలక్ష్మీదేవి విగ్రహం ఏం సూచిస్తుంది

■ పద్మం నుంచి జన్మించినదీ, పద్మమాలినీ అయిన శ్రీలక్ష్మీదేవి చేతి శంఖములు అదృష్టాన్నీ, బిల్వఫలములు ప్రపంచాన్నీ, పద్మము సంపదనూ, రెండు గజములు శంఖు పద్మములు నిధుల సూచికలనీ విష్ణుధర్మోత్తర పురాణం చెబతోంది.



## ఈ రెండు రోజులూ మాంసాహారం వద్దు

■ శుక్రవారం సంపద సృష్టికర్తకు ప్రీతికరమైన రోజు. శనివారం శ్రీలక్ష్మీదేవికి తన భర్త శ్రీమహావిష్ణువుకి ప్రీతికరమైన ఆ రోజు కూడా శక్రవారం కన్నా ప్రీతి. కాన ఆ రోజు 'మ'కారాలు తగదు. శుక్రదేవునికి కూడా ప్రీతికరమైనది శుక్రవారం.



## గోళ్ళలో మట్టి....

■ చేతి, కాలివేళ్ళలో మట్టి అలక్ష్మి స్థానం. అనారోగ్యలక్ష్మినీ, దరిద్రలక్ష్మినీ పిలిచే ఆహ్వానించే సంకేతాలవి. ఆ దరిద్రం వల్లే కుచేలుడు మహా కష్టాలను పడ్డాడు. కుటుంబ ఆకలిని కూడా తీర్చలేకపోయాడు. తన చిన్ననాటి స్నేహితుడైన శ్రీకృష్ణుణ్ని కలుసుకోవటానికి వెళ్ళే ముందు కుచేలుడు తన కాలివేళ్ళ గోళ్ళని శుభ్రం చేసుకొని, శుచియై ఇల్లాలిచ్చిన అటుకుల మూటను తీసుకెళ్ళాడు. మహా సంపదలను పొందాడు. కార్యార్థియై వెళ్ళే వారు తప్పని సరిగా చేతి, కాలి వేళ్ళ గోళ్ళ విషయంలో శ్రద్ధ చూపించి, ఆపై వెళ్ళి కార్యాన్ని విజయవంతం చేసుకోవాలని కుచేలుని సంఘటన చెబుతోంది.







## పుట్టు మచ్చ లక్ష్మీ పాత్రులని చేస్తుంది

■ నుదుటి మీద ఉంటే ధనవంతులవుతారు. కుడి చేయి మణికట్టు మీద పుట్టు మచ్చ ఉంటే ఏడు వారాల నగలూ ధరిస్తారు. గడ్డం క్రింద ఉంటే ఆకస్మిక ధనలాభం.

బొడ్డు లోపలుంటే నిత్య సంపదలను పొందుతాడు. ఎడమ తొడ మీద వుంటే స్త్రీ లాభం అనంతం. అలాగే కుడి చేయి చూపుడు వేలి మీద ఉంటే కీర్తితో పాటు ధనమూ కలిసి వస్తుంది.



## బల్లి మీద పడితే ధనలాభం

■ బుగ్గల మీద పడితే ధనలాభం... అదే చేతిమీదా, మోచేతి మీదా పడితే ధననష్టం. అదే స్త్రీలకి కుడి చెవి మీదా, బాహువుల మీదా పడితే నూతన బంగారు ఆభరణాలు సమకూరతాయి.

తొడల మీద పడితే భర్తతో గొడవలు. కాలివేళ్ళ మీదపడితే మహా సంపదలను పొందే పుత్రుడు జన్మిస్తాడు.



## ఉంచుకొని మాకేం ఉందని ఏడ్వకండి...

■ గృహంలో ఉన్న బంగారమూ, వెండీ, రత్నాలూ, ధాన్యము, పసుపు ఇత్యాదివన్నీ మనస్థాపం చెందుతాయి. మీకన్నా మాకంత ఉంది, ఇంత ఉందని అహంకరిస్తే లక్ష్మీదేవికి కలిగే కోపము కన్నా, వుండీ లేదని పదుగురి దగ్గరా ఏడిస్తే లక్ష్మీదేవి శాశ్వతంగా వెళ్ళిపోతుంది.

చిన్నతనంలో తన దగ్గర ఆహారం ఉన్నా, శ్రీకృష్ణుడితో లేదని చెప్పినందుకే కుచేలునికి ఆకలి దప్పికలతో తానూ, తన కుటుంబమూ పస్తు ఉండాల్సి వచ్చింది.



## గుప్తనిధులు

- ఇవేమీ భూమిలో పుట్టేవి కావు.
- వందల సంవత్సరాల క్రితం మన పూర్వీకులు దాచినవి.
- బందిపోట్లు తాము దోచుకున్నవి భూమిలోనే పాతిపెట్టే వారు.
- రాజుల రాచరికాల కాలంలో తమ అమూల్య సంపదలను గుర్తుల ఆధారంగా ఉంచేవారు.
- దేవాలయ నిర్మాణశాస్త్రంలో నంది చూపు పడిన చోట బంగారమూ, వజ్రాలూ ఉంచాలన్న నియమం లేదు.
- లేని నిధుల కోసం చారిత్రిక అమూల్యమైన శిల్పాలనీ, నందులనీ భంగపరిచి నేరస్థులు కాకండి.



## ధనం లోని సుగుణాలు

■ ధనం లేని కులము తక్కువ అవుతుంది. ధనం లేని కీర్తి తొలగిపోతుంది. ధనము లేని సుచి తగ్గ బుద్ధి నీయదు. ధనము లేకుండా నిజమైన ఘనం చెప్పినా తప్పే అని ధనం శక్తి గూర్చి ప్రజాకవి వేమన తన పద్యాల్లో చెప్పాడు.

అలాగే ధనమొస్తే మదమొస్తుంది. మదమొస్తే దుర్గుణాలొస్తాయి. అట్టి వారికి ధనము అడుగంటితే మదము తగ్గుతుంది. మదం తగ్గితే దుర్గుణాలు పోతాయని కూడా చెప్పాడు.







## ధనము నిచ్చునది విద్య

■ మేధావులు కూడా మెచ్చేది నేర్పరితనము, రణము ద్వారా వచ్చునది పౌరుషము, గొడవల వల్ల, తగవుల వల్ల పోయేది ధనం, వచ్చేది చెడు. ధనముని ఇచ్చునది విద్య మాత్రమేనని సుమతీ శతకకారుడు సుమతీశతకంలో చెప్పాడు.

## అసలు సిసలు బంగారాన్ని నిర్లక్ష్యం చేయద్దు

■ ధనంతోనే సుఖాలనీ, సంపదే జీవితమనీ భ్రమిస్తే అసలు బంగారాలు దూరమవుతాయి. ధన సంపదలే జీవితంగా గల ఓ వ్యాపారి వ్యవహారం పనిపై అడవి గుండా ప్రయాణిస్తున్నాడు.

విశ్రాంతిగా ఓ చెట్టు క్రింద కూర్చున్నాడు. పక్కనే పూలతోట దాని పక్కనే గుడి. ఉచితమే కదాని పూలతో ఆ గుళ్ళో దేవతకి పూజ చేశాడు. దేవత ప్రత్యక్షమై ఏం కావాలో కోరుకోమందా దేవత.

పట్టిందల్లా బంగారం కావాలన్నాడు. తథాస్తు అందా దేవత. గృహానికొచ్చాడు. ఇంటికి ఏ అపరాత్రో వచ్చే భర్త సాయంత్రానికే రావటంతో భార్య ఆనంద పడింది. వ్యాపారి తన అత్యాశ ప్రకారం ఇంటి గోడలను పట్టుకున్నాడు.

ఇంట్లోని వస్తువులని పట్టుకున్నాడు. మట్టి గోడలు బంగారమయ్యాయి. అన్నీ ధగధగమని మెరిసిపోయాయి. అలసి పోయాడు. ఆకలివెయ్యటంతో భోజనం పెట్టమన్నాడు. ఆనందంగా తినబోయాడు. అన్నం మీద చెయ్యి పెట్టడం ఆలస్యం అంతా బంగారం

మయమయ్యింది. లబోదిబోమన్నాడు. భార్యని పట్టుకొని ఏడ్చాడు. అంతే భార్యా బంగారుమయమయ్యింది. మరింత దుఃఖానికి లోనయ్యాడు. పుత్రుడొచ్చి తల్లిని చూసి ఏడుపు లంకించుకున్నాడు.

కొడుకుని ఓదార్చటానికి దగ్గరకు తీసుకున్నాడు. అంతే వాడూ బంగారమయ్యాడు. ఏడ్చి ఏడ్చి దేవతను ప్రార్థించాడు.

తన కొద్దా వరమన్నాడు. ఆ దేవత ప్రత్యక్షమైంది. వ్యాపారితో చెప్పింది.

భార్యపిల్లలే అసలు సిసలు బంగారము. అలాంటి ఆ బంగారాలను వదిలేసి పగలూ, రాత్రి ధనం కోసం ప్రాకులాడితే చివరకు మిగిలేది ఇదే.. భార్య పిల్లలతో గడిపిన సమయం తూకం వేయాలంటే ఎంత ధనమైనా సరిపోదు.

## మత్స్య పురాణంలో ధనాధిదేవత

■ శ్రీరామావతారంలో సీతగా, శ్రీకృష్ణావతారంలో రుక్మిణిగా విష్ణుశక్తికీ, మాయకూ మూల కారణం అయిన శ్రీలక్ష్మీదేవి మత్స్యపురాణంలో....

అష్టభుజ మహాలక్ష్మి నిండు యవ్వనంతో, అపూర్వ సౌందర్యంతో, ఎర్రని పెదవులతో, చక్కని కనుబొమలతో సర్వాభరణాలను ధరించి ఎడమ చేతిలో పద్మం, కుడి చేతిలో బిల్వ ఫలాలు కలిగి ఉండి పద్మాశీనయై దర్శనమిస్తుంటుంది. బంగారు మేని కాంతిగల ఆ తల్లి చుట్టుపక్కల తుమ్మెదలు తిరుగుతూ ఉంటాయి. ఇరువైపులా తొండములతో గజరాజులు అభిషేకిస్తూ ఉండగా దేవికి ప్రణమిల్లుతూ యక్ష, గంధర్వులూ ఉంటారు.







## బంగారము... నగలు...

■ ఆడవాళ్ళ మధ్య గొప్పతనం కోసం.

■ ధనం ఎక్కువై..

■ ఎక్కువమందికి బంగారం మీదున్న శ్రద్ధ ఆరోగ్యం మీద ఉండదు.

■ బంగారం ధరించడం వల్ల శరీరంలో ఎలాంటి రసాయనిక చర్య జరగదు.

■ మగాళ్ళకి కష్టాల్లో ఆదుకునేది ఆడవాళ్ళ వంటి మీద నగలే.

■ బంగారం కూడా ఇనుము లాంటిదే. అయితే చాలా తక్కువగా భూమిలో దొరుకుతుంది. అన్నింటికీ మించి మెరుస్తుంటుంది. ఎంతకాలమైనా మెరుపు తగ్గదు. అలంకరణతో అద్భుత అందాన్ని తెస్తుంది.

■ మగాడి సంపాదన ఆడవారి వంటి మీద నగల వల్లే తెలుస్తుందంటారు.

■ ఆడవారు సాధించి సాధించి కొన్న నగలు మగాడికి అవసరం వస్తే అరక్షణంలో కరిగిపోతాయి.

■ బంగారపు వస్తువులు ధరిస్తే చేతులకీ, మెడకీ ఎలర్జీ వంటి సమస్యలు రావు.

■ నగలు ధరించేది కాసేపు. వాటిని కాపాడటానికీ, దాచటానికీ, జాగ్రత్త పరచడానికీ పడే ఆందోళనతో పోలిస్తే ధరించిన ఆనందం తక్కువే.



# దీపావళి

# శ్రీమహాలక్ష్మి పూజ

▪ దూర్వాస మహర్షి కోపానికి సర్వమూ కోల్పోయిన ఇంద్రుడు శ్రీమహావిష్ణువు బోధనతో జ్యోతిని వెలిగించి శ్రీమహాలక్ష్మి రూపంగా పూజించి తిరిగి సకల వైభోగాలనూ, త్రిలోకాధిపత్యాన్నీ పొందుతాడు. కాన దీపావళి రోజు లక్ష్మీ పూజ మహా సంపదలను కలిగిస్తుంది.

దీపావళి అనగా దీపోత్సవం. శ్రీమహాలక్ష్మి తన కరుణాకటాక్షాలతో లోకాలనున్న చీకట్లను పారద్రోలుతుంది. తేజోవంతము చేస్తుంది.

దీపావళినాడు శ్రీమహాలక్ష్మి నదులలో, బావులలో, చెరువులలో సూక్ష్మ రూపంలో ఉంటుంది.

కాన ఈ రోజు నువ్వుల నూనెతో తలంటుకొని సూర్యోదయానికి నాలుగు ఘడియల ముందు అభ్యంగన స్నానం చేసి లక్ష్మీదేవిని పూజించటం వల్ల సకల దరిద్రాలూ పోతాయి. గంగానదీ స్నానం చేసిన ఫలం కూడా పొందుతారు. దీపావళి నాడు కాల్చే బాణా సంచా శబ్దాలకీ, వెలుగులకీ దరిద్ర దుఃఖాలు పారిపోతాయి.

శ్రీరామచంద్రుడు రావణాసురుడ్ని సంహరించి సీతాసమేతుడై తిరిగి అయోధ్యకు వచ్చినప్పుడు సకల ప్రజలు బాణా సంచా కాల్చి తమ ఆనందాన్ని ప్రదర్శించారు.

ఈ దీపావళి రోజు సాయంత్రం ప్రదోషకాలంలో పిల్లల చేత దక్షిణ దిశగా నిలబడి వెలిగించే దీపం పితృదేవతలకి దారి చూపుతుంది. ఆపై కాళ్ళు కడుక్కొని తీపి పదార్థం తినాలి. దక్షిణాయన పాపకాలం నుంచి తప్పించుకోవటానికి ఈ ఉత్తరాయణ పుణ్యకాలంలో జ్యోతిని దానం చేస్తారు.







# అష్టలక్ష్ములు...

సిరిసంపదల దేవత..

అనేక భాగ్యాలనిచ్చే అధిదేవత శ్రీమహాలక్ష్మిని అష్టలక్ష్ముల రూపాలతో సేవించి పూజిస్తే మహా ఫలం.

▪ **ఆదిలక్ష్మి:** నాలుగు హస్తాలతో ఉంటుంది విష్ణుపత్ని ఆదిలక్ష్మి. ఈ సంపదల తల్లినే శ్రీమహాలక్ష్మి అని కూడా సంభోదిస్తారు. పద్మ, పతాక, అభయ వరద ముద్రలతో వుంటుంది.

▪ **ధాన్యలక్ష్మి:** పచ్చటి వస్త్రాలను ధరించి, ఎనిమిది చేతులతో ఉంటుంది. వరదాభయ ముద్రలతో రెండు చేతులలో పద్మం, ఓ చేత్తో గదా, మూడు చేతులలో వరి కంకులూ, చెరకుగడా, అరటిగెల ధరించి ఉంటుంది.

▪ **ధైర్యలక్ష్మి:** ఎనిమిది హస్తాలు గల వీరలక్ష్మి. ఎర్రని దుస్తులను ధరించి ఉంటుంది. చక్రాన్నీ, శంఖాన్నీ, ధనుర్బాణాలనూ, త్రిశూలాన్నీ, పుస్తకాన్నీ ధరించి ఇంకా వరదా, అభయ ముద్రలతో ఆశీర్వదిస్తూ ఉంటుంది.

▪ **గజలక్ష్మి:** అధికారమిచ్చు లక్ష్మి. ఎర్రని వస్త్రాలతో నాలుగు చేతులతో ఉంటుంది. వైకుంఠవాసినికి ఇరువైపులా రెండు గజములు అభిషేకం చేస్తుంటాయి. రెండు చేతుల్లో రెండు పద్మములతో, వరదాభయముద్రలతో భక్తులని లాలిస్తుంటుంది.

▪ **సంతానలక్ష్మి:** ఆరు చేతులతో రెండు కలశములనూ, ఖడ్గాన్నీ, డాలుతో పాటు తల్లి ఒడిలో బిడ్డను కలిగి దర్శనమిస్తుంది. అభయముద్రతో ఆశీర్వదిస్తుంది. బిడ్డ చేతిలో పద్మము ఉంటుంది.

■ **విజయలక్ష్మి:** శంఖ, చక్ర, ఖడ్గ, డాలు, పాశము, పద్మము, రెండు చేతులతో ఆశీర్వదిస్తూ వరదాభయ ముద్రలతో ఎనిమిది హస్తాలుగల ఈ విజయలక్ష్మి ఎర్రని వస్త్రాలను ధరించి చిరనవ్వులు చిందిస్తూ దర్శనమిస్తుంది.

■ **విద్యాలక్ష్మి :** నాలుగు చేతులతో ఉండునది. తెల్లని వస్త్రాలను ధరించి ప్రసన్న వదనంతో రెండు చేతులలో వికసించిన పద్మాలనూ, మరో రెండు చేతులు వరదాభయ ముద్రలతో దర్శనమిస్తుంది.

■ **ధనలక్ష్మి :** శంఖ చక్రాలూ, కలశమూ, ధనుర్బాణాలూ, పద్మమూ ధరించి ఆరో చేతినుంచి బంగారునాణేలను కురిపిస్తూ ఎర్రని వస్త్రాలను ధరించి ఉంటుంది సౌభాగ్యలక్ష్మి... వరలక్ష్మి... ఐశ్వర్యలక్ష్మి.



## శ్రీమహావిష్ణువుతో వివాహం

■ క్షీరసాగర మధనంలో జన్మించిన కామధేనువునూ, కల్పవృక్షాన్నీ, ఐరావతాన్నీ ఇంద్రుడు గ్రహించాడు. ఉచ్చైశ్రవాన్ని బలిచక్రవర్తి గ్రహించాడు. శ్రీమహాలక్ష్మి జన్మించగానే పుణ్యవతులు ఆ ధనాధిదేవతకి మంగళస్నానాలు చేయిస్తారు. తన తనయికి సముద్రుడు పసుపు బట్టలు సమర్పించాడు. వరుణదేవుడు వైజయంతి మాలనూ, విశ్వకర్మ సువర్ణాభరణాలనూ ఇచ్చారు. ఓరకంట శ్రీమహావిష్ణువును చూస్తున్న లక్ష్మీదేవిని శ్రీమహావిష్ణువు వద్దకు పూలమాలతో తీసుకెళ్ళారు. అప్పుడు లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువు మెడలో పూలమాల వేసింది. దేవదుంధుభులు మ్రోగాయి. లోకాలన్నీ తేజోవంత మయ్యాయి. సముద్రుడు అల్లుడికి కౌస్తుభమణిని ఇచ్చాడు. శ్రీమహావిష్ణువు ఆ కౌస్తుభమణితో పాటు శ్రీమహాలక్ష్మినీ తన వక్షస్థలంపై విరాజిల్లేలా చేసుకున్నాడు.







## లక్ష్మీ పీఠం అయిన గడపని త్రొక్కితే

■ అప్పుల పాలవ్వటం, చేయి చాపవల్సి రావటం, వయసులోనే ముసలి లక్షణాలు, వ్యభిచరించాల్సి రావటం, వున్న కొద్ది పాటి ఐశ్వర్యం దొంగల పాలవ్వటం, మహా దరిద్రము, దారిన పోయే రోగాలు కూడా చుట్టుకోవటం, ఆకలికి అలమటించటము.

ఇవేకాదు దూరప్రాంతాలకి వెళ్ళాల్సి రావటము, భార్య దూరమవ్వటము, శత్రువులతో కలసి పని చేయాల్సి రావటము, ఎంగిలి తినాల్సి రావటము, తమకే తింటానికి లేకపోతే బంధువులు రావటము, నమ్మిన వాళ్ళు మోసం చెయ్యటం...



## సువర్ణధారా స్తోత్రము

■ దీన్నే కనకధారా స్తోత్రము అని సంభోదించి పఠిస్తారు. కట్టుకోవటానికీ, సిగ్గును కప్పుకోవటానికీ సరైన దుస్తులు కూడా లేని ఓ నిరుపేద గృహిణి గృహానికి శంకరాచార్యులు వారు భిక్షకు వెళ్ళారు. ఆ ఇల్లాలు ఇల్లంతా వెదికి లభించిన ఉసిరి కాయను తలుపు చాటు నుంచి భిక్షగా వేసింది.

అప్పుడు శంకరాచార్యుల వారు లక్ష్మీదేవిని స్తుతిస్తూ చెప్పినదే కనకధారాస్తవము. ఇరవై అయిదు శ్లోకాలు గల ఈ కనకధారా స్తవము పఠించటం ద్వారా, పారాయణం చేయటం ద్వారా కుబేరునితో సమానమైన భోగాలనూ, సంపదలనూ పొందగలరు. ప్రతిరోజు మూడుసార్లు మూడు సంధ్యలలో పారాయణం చేయాలి.



## శ్రీలక్ష్మీదేవి పుట్టుక

■ చాక్షుషువు మనువు సమయంలో దేవతలూ, రాక్షసులూ అమృతం కోసం క్షీరసాగర మథనాన్ని చేశారు. కవ్వంగా మంథర గిరినీ, త్రాడుగా వాసుకినీ వినియోగించి పాలసముద్రాన్ని చిలుకుతారు. దేవతలు వాసుకి తల వైపునా, రాక్షసులు తోక వైపునా పట్టుకొని మథించారు.

మంథర గిరి పాలసముద్రం క్రింద నిలిచే ఆధారం లేకపోవటంతో శ్రీమహావిష్ణువు కూర్మావతారాన్ని ఎత్తి మంథర గిరిని తన వీపు మీద ధరించాడు.

తొలుత హాలాహలం పుట్టింది. అగ్రతాంబూలం స్వీకరించమని మహావిష్ణువు మహాశివుని ప్రార్థించగా మహాశివుడు లోకక్షేమం కోసం హాలాహలాన్ని స్వీకరించి కంఠంలో ఉంచుకొని గరళ కంఠుడయ్యాడు.

ఆ మహా విషప్రభావానికి మహాశివునికి తాపమెక్కువయ్యింది. ఆపై క్షీర సాగర మథనంలో పుట్టిన చంద్రుణ్ని తలపై ఉంచుకున్నాడు శివుడు. ఆ తర్వాత గంగాదేవిని తల మీద ధరించినా ఆ తాపం తగ్గక పోవటం వల్లే భక్తులు పరమేశ్వరునికి ఉదకాభిషేకం చేస్తారు. సురాభాండమూ, అప్సరసలూ, కౌస్తుభము, ఉచ్చైశ్రవము, కల్పవృక్షము, కామధేనువు, ఐరావతము ఆపై లక్ష్మీదేవి జన్మించారు.

## అష్టైశ్వరాల కోసం అష్టగంధాలతో....

■ శ్రీమహాలక్ష్మీ పూజ చేయాలి. కర్పూరం, కస్తూరి, పునుగు, జవ్వాజి, అగరు, పన్నీరు, అత్తరు, శ్రీగంధములతో పూజిస్తే సంపద, అధికారం, పరివారాలు.. కీర్తి, వాహనాలు, బంధువులు, ధాన్యము, పుత్రులు లభిస్తాయి.





## అగ్నిపురాణంలో పద్మమాలాధారిణి

■ సర్వశుభలక్షణ నిలయ పద్మాక్షి, సముద్రరాజతనయి శంఖ, చక్ర గదా పద్మం ధరించి ఉంటుంది. శ్రీమహావిష్ణువుతో ఉన్నప్పుడు ద్విభుజయై సర్వాభరణ భూషితురాలై ఉంటుంది.

చిరునవ్వులు చిందించే ఆ తల్లి చేతిలోని శంఖము అదృష్టాన్నీ, బిల్వపత్రాలు సృష్టినీ, పద్మము ధనాన్నీ సూచిస్తుంది. రెండు గజములు శంఖ పద్మ నిధులకు సూచికము.

## తథాస్తు దేవతలుంటారు

■ వాళ్ళెప్పుడూ లోకమంతా ఆవరించి ఉంటారు. తథాస్తు అని దీవిస్తుంటారు. ఎట్టి స్థితిలోనూ నా ఖర్మ ఇంతే... నా జీవితమింతే ఎప్పుడూ దరిద్ర జీవితమే అని ఎవర్నో ఒకర్ని సాధిస్తుంటే తథాస్తు అంటారు.

వారు అలా అన్నారంటే దాన్ని మార్చటం శ్రీమహాలక్ష్మికి కూడా చాలా కష్ట తరమవుతుంది.

యద్ధారంభంలో ధర్మరాజు తన సేనానాయకులతో విజయం సాధిద్దాం.. సకల భోగాలనూ, అధికారాలనూ, కీర్తినీ పొందుదామని చెబుతాడు.

అదే భీష్ముడు యుద్ధం స్వర్గద్వారం... వీర స్వర్గం పొందడమే రాజులకు ధ్యేయమని భీష్మ పర్వంలో చెబుతాడు. ఏం జరిగిందో మీకు తెలియనిది కాదు.

## జీవితంలో విజయం సాధించాలంటే?

- మాట.... మృదువుగా ఉండాలి
- తినడం.... అవసరం మేరకే
- శ్వాస... గట్టిగా పీల్చాలి
- నిద్ర.... చాలినంతగా
- వస్త్రాలు.... చక్కగానూ, శుభ్రంగానూ ఉండాలి
- చర్య.... అభయంగా
- పనులు.... సహనంతో చెయ్యాలి
- ఆలోచన.... సత్యంతో కూడి ఉండాలి
- నమ్మకం.... నిజమే పునాదిగా ఉండాలి
- ప్రవర్తన... సంస్కారయుతంగా ఉండాలి
- సంపాదన.... నిజాయితీతో కూడా ఉండాలి
- పొదుపు... క్రమం తప్పకుండా చెయ్యాలి
- ఖర్చు.... తెలివిడితో చెయ్యాలి
- పొదుపు పాటించండి.. కానీ పిసినారితనం వద్దు
- గొప్పవారి జీవితం నిరాడంబరం, సహజసిద్ధం
- పాపాలు చేయవద్దు... పరిహారం కోసం వెదకవద్దు
- గర్వం తియ్యని విషం

\- శ్రీ సత్యసాయిబాబా ప్రబోధం





## శ్రీమహాలక్ష్మి ప్రసాదించే సిద్ధులు

- అణిమ : ఈ సిద్ధి ద్వారా శరీరాన్ని చిన్నదిగా చేసుకోవచ్చు.
- మహిమ : ఎంత చిన్నదాన్నయినా పెద్దదిగా చేయచ్చు.
- గరిమ : శరీరాన్ని ఎంత బరువుగానైనా చేసుకోవచ్చు.
- లఘిమ : శరీరాన్ని అతి తేలికగా చేసుకోవచ్చు.
- ప్రాప్తి : విశ్వంలో ఏది కావాలన్నా పొందగలరు.
- ఈశత్వం : సకల అధికారాలు కోరినంతనే...
- వశీత్వం : సకల భూతాలూ అధీనంలో...

## అడ్డంగా పెరగకూడదు

■ భర్త సంపాధించిన ధనంతో నగలూ, చీరలూ కొనుక్కుని మురిసిపోవచ్చు. ఆడంబరంగా అందరికీ చూపించుకోవచ్చు. ఆ ఆనందంతో శరీరం సంగతి మరువద్దు.

అడ్డంగా పెరిగిపోతే, భర్త ఏ నయనానందకరమైన దాన్నో పట్టుకుంటాడు. చివరికి ఆ నగలూ, చీరలే మీకు మిగల్చవచ్చు. నగలూ, చీరలూ అందాన్ని మరింత పెంచటానికి.

అడ్డంగా పెరిగి ధరిస్తే అందరి ఆడవాళ్ళ చూపులు మీ మీద ఉండొచ్చేమో గానీ మీ భర్త చూపులు మాత్రం మరొకరి మీదకు వెళ్తాయి. అప్పుడు ఆ నగలూ, చీరలతోనే సంసారం చేయాల్సి వస్తుంది.



## శ్రావణ శుక్రవారం

■ శ్రావణ శుక్రవారం నాడు మహాలక్ష్మిని పూజించటం ద్వారా దీర్ఘసుమంగళి ప్రాప్తం లభిస్తుంది.

■ శ్రావణ మాసంలో ప్రతి శుక్రవారం మహాలక్ష్మిని పూజిస్తే సిరిసంపదలు వృద్ధి చెందుతాయి.

■ కొత్తగా పెళ్ళయిన నూతన వధువు చేత తొలి శ్రావణ శుక్రవారం వ్రతం చేయించటం ద్వారా భర్తకు ఆరోగ్యం, ఆయుష్షులతో పాటు సంపద వృద్ధి చెందుతుంది.

■ శ్రావణ శుక్రవార లక్ష్మీ పూజ అనంతరం పూర్ణాలూ, గారెలతో ముత్తైదువులకి వాయనాలని ఇప్పిస్తే అత్తింటా, పుట్టింటివారలకు శుభం.

■ శ్రావణ మాసంలో తులసిపూజా, దేవాలయాల్లో పాలూ, తేనెలతో అభిషేకాలు చేయించి కోర్కెని కోరుకుంటే రోజులలోనే శ్రీమహాలక్ష్మి ఆ కోర్కెని తీరుస్తుంది. ఆనందపరుస్తుంది.

■ శ్రీమహాలక్ష్మీదేవికి ఈ మాసంలో నేతితో దీపాలు వెలిగించి మల్లెపువ్వులూ, కస్తూరి, జాజి పువ్వులతో దేవిని అలంకరించి పూజించి బెల్లంపొంగలిని నైవేద్యంగా పెడితే సకల అభీష్టాలూ నెరవేరతాయి.

■ శ్రావణ శుక్రవారమే కాదు ఏ శుక్రవారమైనా పూజా, ఆలయ సందర్శనము మహా ఐశ్వర్యప్రాప్తిని కల్గిస్తుంది.



## ఉత్తర దిక్కు కుబేరస్థానం

■ వ్యాపారాదివ్యవహారాలకి వెళ్ళేటప్పుడు ఉత్తరదిశగా తిరిగి విష్ణుసతి లక్ష్మీదేవినీ, కుబేరుణ్నీ స్మరించి ముందుకు కదిలితే లాభసాటి కార్యక్రమం అవుతుంది.







## శ్రీలక్ష్మీనారాయణుల ఆలయాల్లో...

■ శ్రీలక్ష్మీనారాయణుల దేవాలయాల్లో ఇచ్చే పసుపుకుంకుమలను నుదుటి కుంకుమ క్రింద ధరించాలి. విభూతిని నుదుట పెట్టుకున్న బొట్టు పైన ధరించాలి.

అలాగే దేవాలయంలో కర్పూర దీపాలను వెలిగించటానికి పక్కవారి నుంచి అగ్నిని తీసుకోరాదు. ఒకరు వెలిగించిన దీపంతో మీ దీపాలను వెలిగించకండి. పుణ్యమనే సంపద వారికి వెళుతుంది.



## కోరిన కోర్కెలు తీరటం కోసం...

■ శుక్రవారం విఘ్నేశ్వరుని ఆలయానికి వెళ్తుంటే గరిక మాలను తీసుకెళ్ళి స్వామికి అర్పించండి. శివాలయానికి వెళితే బిల్వపత్రాలను తీసుకెళ్ళి సమర్పిస్తే ఈతి బాధలన్నీ తొలగిపోతాయి.

శుభాలు చేకూరుతాయి. ఆంజనేయ స్వామి ఆలయానికి వెళ్తుంటే వెన్నముద్దను సమర్పిస్తే వ్యాపారాభివృద్ధి. అలాగే లక్ష్మీనారాయణుల ఆలయానికి వెళ్తుంటే తులసీమాలను సమర్పించి సేవించండి. సకల శుభాలూ జరుగుతాయి.

అమ్మలగన్న అమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ దుర్గమ్మ తల్లి సేవకి వెళ్తుంటే పసుపూ, కుంకుమలతో పాటు ఎరుపు రంగు పువ్వులను తీసుకెళ్ళి సేవించండి. అష్టైశ్వరాలూ కలుగుతాయి. సుఖాలకీ, సంతోషాలకీ కొదువ ఉండదు.



## ధనుర్మాసంలో శ్రీరామపూజ

■ ఈ మాసంలో సీతారాముల పూజ సకల సంపదలనూ సిద్ధింపచేస్తుంది. వాటితో పాటు మోక్షము కలుగుతుంది. ఈ మాసంలో సీతారాములను పూజించిన దంపతులు అన్యోన్య జీవనంతో పదిమందికీ ఆదర్శంగా నిలుస్తారు. అలాగే ద్వాదశి రోజు శ్రీమహావిష్ణువు వామనావతారం ఎత్తిన రోజు. ఆ రోజు ఉపవాసం, పూజలు వలన ఏకాదశి ఉపవాస ఫలితం కలుగుతుంది. శ్రీలక్ష్మీదేవి ప్రీతి చెందుతుంది. ఇంతటి పుణ్య విషయాన్ని నారదుడు శెలవిచ్చాడని పురాణశాస్త్ర వచనం.



## శ్రీవేంకటేశ్వరస్వామికి పూలంగి సేవ

■ శనివారం నాడు దగ్గరిలోని వేంకటేశ్వర స్వామి ఆలయంలో స్వామికి పూలంగిసేవ చేయించటం వల్ల లక్ష్మీప్రీతి కలుగుతుంది. ఆర్థిక పరమైన చిక్కులూ, సమస్యలూ తొలగిపోతాయి. పూలంటే లక్ష్మీ స్వరూపం. తన భర్తకంతటి అలంకరణ చేసినందుకు లక్ష్మీదేవి సంపదలతో పాటు ఆరోగ్య సుఖాలనిస్తుంది.



## గోమాతను భంగపరిస్తే

■ ఆవు సకలదేవతలకీనిలయం. అలాంటి ఆవును చీపురుకర్రతో కొడితే మహా సంపదలైనా కరిగిపోతాయి. తమ కడుపు సంగతి అటుంచి పిల్లలకి కూడా కాసిన్న పాలు దొరకని దుర్భర స్థితి కలుగుతుంది. ఎన్నో సంవత్సరాలు ఆ పాపాన్ని అనుభవించాల్సి ఉంటుంది.







## మంగళవారం దుర్గాదేవికి నేతి దీపం...

■ రాహుకాలంలో దుర్గాదేవికి నేతి దీపదానంతో పాటు అన్నదానం కూడా చేస్తే సకలదోషాలూ తొలగిపోతాయి. నైవేద్యంగా పాయసాన్ని సమర్పించి దుర్గాదేవిని స్తుతిస్తే కోరిన కోర్కె తీరటంతో పాటు సంపదలు కరిగిపోవనీ, పై తరాల వారి వరకూ నిలబడతాయనీ శాస్త్రము శెలవిస్తోంది.



## కోటి మందిలో లక్ష్మి అనుగ్రహం మీకే కావాలనుకుంటే

■ శత్రువు ఉండకూడదు.

■ ఒకవేళ ఉంటే వానికంటే మీరెక్కువ పనిచేయాలి.

■ వానికంటే మీరెక్కువ వార్తల్లో కనపడాలి.

■ వానికంటే మీరెక్కువ ఆరోగ్యంగా ఉండాలి.

■ వానికంటే సహనంగా ఉండాలి.

■ వానికంటే అల్పంగా ఉండాలి.

■ వానికంటే ప్రపంచం దృష్టిలో మీపై సానుభూతి.

■ వానికంటే... సర్వం... మీ పేరే మంచిగాని, చెడుగాని వినపడాలి.

■ వానికంటే... ధర్మం, న్యాయం విషయాల్లో గొప్పగా ఉండాలి.

■ వానికంటే... గొప్పగా ఉండాలి.

■ అప్పుడే మీరు విజేత... ధర్మ విజేత.



## శనివారం విష్ణుపూజ ఎంత శక్తి కలది

■ శనివారం నారాయణునికి ప్రీతికరమైన రోజు. శ్రీమహావిష్ణువు పూజ చేసి తులసి కోట ముందు నేతితో లేదా నువ్వుల నూనెతో దీపాన్ని వెలిగిస్తే ఆ గృహంలో లక్ష్మి తాండవము చేస్తుంది. ఎల్లవేళలా ధనలక్ష్మి ఆ ఇంటిలో నివాసం ఉంటుంది. అలాగే శనివారం ఒంటిపూట భోజనం వల్ల శనిగ్రహం వల్ల జరిగే దోషాలు తొలగిపోతాయి.

తొమ్మిది శనివారాలు శ్రీలక్ష్మినారాయణుల పూజ చేసి ఉపవాసం ఉన్న దంపతులకి లక్ష్మీపుత్రుడు జన్మిస్తాడు. అనుకున్న కార్యం దిగ్విజయంగా నెరవేరుతుందని శ్రీవిష్ణుపురాణం వచియిస్తున్నది.



## లక్ష మల్లెపూలతో చేసే పూజకన్నా ఓ దుష్టుణ్ని తరిమెయ్యండి

■ శ్రీమహాలక్ష్మి తన భర్తకి శ్రమ తప్పించినందుకు మిమ్మల్ని కరుణిస్తుంది.

■ అది కూడా సహనంతోనే.

■ ధర్మంతోనే... న్యాయంతోనే, చట్టపరిధిలోనే.

■ డబ్బు, అహం... ధైర్యం.. బలగం.. ఇవే మనిషిని దుర్మార్గుణ్ని చేస్తాయి. వాటినే పడగొట్టాలి.

■ అలక్ష్మికి అత్యంత ప్రీతికరమైనది భయం.. భీతి.

■ అదే శ్రీమహాలక్ష్మికి ఇష్టమైన పాపాలనూ, పాపాత్ములనూ చీల్చి చెండాడే గల మనస్తత్వాలు శ్రీమహాలక్ష్మికి ఇష్టమైనవి.







## కార్తీకమాసంలో దీపదానం

■ వశిష్ఠుడు జనకమహారాజుకి చెప్పిన పుణ్య రహస్యం. కార్తీకమాసంలో వరిపిండితో లేదా గోధుమపిండితోగాని ప్రమిద చేసి అందులో నెయ్యి పోసి వత్తిని వెలిగించి బ్రాహ్మణునికి దానం ఇస్తే విద్య, దీర్ఘాయువులతో పాటు పెద్దలిచ్చిన సంపదలూ, కీర్తీ రెట్టింపు అవుతాయి.



## కొత్త సంవత్సరం తర్వాత వచ్చే శుక్రవారపు అభిషేకం

■ కొత్త సంవత్సరం తర్వాత అనగా ఉగాది తర్వాత వచ్చే శుక్రవారం మీ కిష్టమైన దేవతకి అభిషేకం చేయించటం ద్వారా సంవత్సరం పొడవునా డబ్బుకి మీకెలాంటి కొదవ ఉండదు.

కొంతమందికి జాతకరీత్యా వున్న దోషాలు కూడా ఈ కొత్త సంవత్సరపు శుక్రవారము అభిషేకం ద్వారా తొలగిపోతాయి.



## రథసప్తమి స్నానం

■ సకల సంపదలకు ప్రవేశం. ఆ రోజున ఏడు జిల్లేడు ఆకులను తలపై, భుజాలపై ధరించి నదీస్నానం చేస్తే ఏడుజన్మల పాపాలు తొలగిపోవటంతో పాటు ఏడు రకాల ఘోర వ్యాధులు దరిచేరవు.

సూర్యభగవానుడి మహా అనుగ్రహం పొంది ఆయురారోగ్యాలు కలగటంతో పాటు మహా ధనం కలసి వస్తుందని పురాణ వచనము.



# వరలక్ష్మీవ్రతం విశిష్టతలు

■ శ్రీపీఠనివాసిని, శంఖ చక్ర గదాధరి అయిన అష్టైశ్వర్య ప్రదాయినిని భక్తితో పూజించిన వారికి కొంగు బంగారము వరాలిచ్చే శ్రీమహాలక్ష్మి వరలక్ష్మి.

■ శుక్లపక్షంలో పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారమే వరలక్ష్మీ వ్రతం.

■ చారుమతీదేవి ఉత్తమోత్తమ ఇల్లాలు. అత్తమామల యెడల, బంధుమిత్రుల యెడల అనన్య గౌరవాది మర్యాదలు కలది. భర్త మనస్సెరిగి నడిచేది. శ్రీమహాలక్ష్మి భక్తురాలు.

■ తన భక్తురాలైన చారుమతికి శ్రావణ శుక్ల పూర్ణిమకు ముందు వచ్చే శుక్రవారం పూజ చేయమని కలలో సాక్షాత్కరించి శ్రీమహాలక్ష్మి చెప్పింది. ఆ ధనలక్ష్మి చెప్పిన విధంగా పూజచేసి చారుమతి మహా సంపదలను పొందింది.

■పై వరలక్ష్మి గాథను, ఫలాన్నీ స్వయంగా ఈశ్వరుడు పార్వతీదేవికి చెప్పాడు.

■ వరలక్ష్మివ్రతంలో పిలిచిన ముత్తైదువులని శ్రీమహాలక్ష్మిగా భావించి, స్మరించి తాంబూలము సమర్పించి, వాయనం ఇవ్వాలి.

■శ్రీమహావిష్ణువు జన్మనక్షత్రమైన శ్రవణం పేరుమీద వచ్చే శ్రావణ మాసంలో వరలక్ష్మీవ్రతం చెయ్యాల్సిన శుక్రవారం వస్తుంది.

■ ఆనాటి వ్రతం సర్వమంగళ సంప్రాప్తి. సకల కోరికలూ నెరవేరుతాయి. సకల శుభములు కలుగుతాయి. ఊహించని విధంగా వ్యాపార వ్యవహారాల్లో ఉన్నతి లభిస్తుంది.







# పురాతనమైన అలక్ష్మి లక్ష్మిల గాథలు

■ ఒకానొక గ్రామంలో పేద దంపతులుండేవారు. విష్ణుభక్తులు. ధర్మం, న్యాయం, శుచి, శుభ్రతలకు వారు ప్రతీకలు. ఉన్నట్లుండి ఆ గ్రామంలో ఒక్కొక్కరుగా ధనవంతులు కాసాగారు. పొలాలూ, బంగారమూ... వైభవోపేతమైన జీవితాలు.

కడకు ఆ గ్రామంలో ఆ పేద దంపతులు తప్ప అంతా ధనవంతులే. ఆ పేద ఇల్లాలికి ఇంటి పక్కన పెద్ద మేడలో ఉండే ఇల్లాలు ఆ రహస్యం చెప్పింది. మురికి నీటితో నూనెని కలిపి దేవత ముందు దీపం వెలిగిస్తే చుట్టూ ఉన్న సామాగ్రి అంతా బంగారం అవుతుందని. అందరం అదే చేస్తున్నాము.. నీవూ అదే చెయ్యమని సలహా ఇచ్చింది.

పేద ఇల్లాలు ఆ విషయాన్ని భర్తకి చెప్పింది. ఇంత దరిద్రంలో ఉన్నాము మనమూ ఆ పని చేద్దాము అని. దానికి ఆ గృహస్థుడు పాపం చెయ్యటం ఎంత పాపమో, చెప్పటం అంతకు మించిన పాపం.

చేసిన వారి పక్కనుండటం అంతకు మించిన పాపం.. పిచ్చిదానా.. అలా పాపపు పనులతో సాధించిన సంపద క్షణికమే అని కొద్దిపాటి వస్తువులను తీసుకొని వేరే ఊరికి భార్యతో బైలుదేరాడు.కొంత దూరం వెళ్ళాక, ఆ భర్త వెనక్కి చూడమన్నాడు భార్యని.

ఆ ఇల్లాలు తిరిగి చూసింది. మహా ఉప్పెనతో ఊరు కొట్టుకుపోతోంది. మహా భవంతులు నీటిలో పడి కొట్టుకుపోతున్నాయి. ఆ భర్త చెప్పాడు 'ధనసంపదలు పుణ్యఫలాలు.. ఏ జన్మలో ఏ పాపం చేశామో దరిద్రం అనుభవిస్తున్నాము. అలక్ష్మి ఇంకా తప్పుడు దారులు చూపించి మరింత క్షోభకి గురిచెయ్యాలని చూస్తుంది. లక్ష్మి సహనాన్ని పరీక్షిస్తుంది. దాన్ని సంతోషంగా అనుభవిస్తే ఈ జన్మలోనే అతి

కొద్దికాలంలోనే ఆ పాపం సమసిపోతుంది. లక్ష్మి అనుగ్రహం కలుగుతుంది' అని చెప్పాడు. ఆ తర్వాత కొంత కాలానికే రాజాశ్రయం కలిగింది. వారి జీవితంలో లేమి అన్నది ఇక దరిచేరలేదు.



## ఒక్కొక్కరికి ధనముండటం కూడా శాపమే

■భార్యతో సఖ్యతుండదు. పిల్లలలో వ్యతిరేకభావం. బంధువులంతా డబ్బు తమకి ఉపయోగపడనందుకు వ్యతిరేకం. ... మహాసమస్యలు. స్నేహితులూ, సన్నిహితులూ ఏం మాట్లాడినా, ఏం చేసినా వాడి సంపదను కోరే. చుట్టూ ప్రపంచం కూడా ఎంత వీలయితే అంత లాగే ప్రయత్నం. అనారోగ్యం.. నిముషం కూడా మనఃశాంతి లేకపోవటము.

అన్నీ ఉన్నా ఒంటరవ్వటము. ఇదంతా అన్యాయంగా, అధర్మంగా, దౌర్జన్యంగా సంపాదించిన ధనం వల్లే. లేదా వారి నీచ ప్రవర్తన వల్లే. అనగా అష్టనీచాలైన పక్కవాడి భార్యని ఆశించటము, పక్కవార్ని తొక్కి పైకి రావటము, జూదం, అమాయకుడిపై దౌర్జన్యం, పచ్చని సంసారంలో నిప్పు పెట్టడము, అన్నదమ్ముల్ని విడదీయటము, నమ్మి ఆశ్రయం అడిగిన వార్ని లోబరుచుకోవటము, స్నేహితుణ్ని మోసం చెయ్యటం ఇత్యాదివాటిల్లో ఏవో ఒక కారణం కావచ్చు.



## తప్పు చేస్తే ఎవర్నీ క్షమించకండి

■ ఆ తప్పు మిమ్మల్ని అధఃపాతాళానికి నెడుతుంది. చేతకాని వాడి పెళ్ళాం అందరికీ లోకువే అన్నట్టు మీ సంపదను చెడగొట్టడానికీ, దొంగిలించటానికి ఎలాంటి భీతి లేకుండా చేస్తారు. తేడా వస్తే మీరు రాక్షసులని తెలిస్తేనే అంతా వళ్ళు దగ్గర పెట్టుకొని నడుచుకుంటారు. శ్రీమహావిష్ణువు తప్పు చేస్తే శ్రీమహాలక్ష్మి సహితం భర్తని కూడా





చూడకుండా గెటవుట్ అంది. మళ్ళీ శ్రీమహావిష్ణువు అష్టకష్టాలు పడితేగాని లక్ష్మి కరుణించలేదు.



## కీర్తి కన్నా ధనం ఎప్పుడూ తక్కువే

■ కీర్తి లక్ష్మి కంటే ఈ సృష్టిలో గొప్ప సంపద లేదు. కీర్తి గల వానికిచ్చే మర్యాదా, మన్ననా లక్షల కోట్లున్నా రావు. పురాణాలూ, ఇతిహాసాలూ తీసుకుంటే చక్రవర్తులూ, రాజాధిరాజులూ వశిష్ఠుడూ, భృగువూ, వ్యాసుడూ, వాల్మీకిల వంటి వారు వస్తే తమ సింహాసనాన్ని ఇచ్చి వినయంగా పక్కన నిలబడ్డారు.లక్ష్మి ధనం ఎందరికో ఇస్తుంది. కాని కీర్తి అనే సంపదను మాత్రం మహాత్ములకీ, కారణజన్ములకే ఇస్తుంది.



## ధైర్యం, పరాక్రమంకన్నా శౌర్యమే లక్ష్మికి ప్రీతి

■ పరిస్థితులని బట్టి చుట్టూ ఉన్న వారిని బట్టి వచ్చేది ధైర్యం. అది పిరికి వాళ్ళకి కూడా తన సంపద వల్ల రావచ్చు. పరాక్రమం తన వారిని తనని నమ్ముకున్న వారి కోసం చూపించేది.

ఇక శౌర్యం. ఒక్కని శౌర్యం లక్షమంది పిరికి వాళ్ళని కూడా ధైర్యవంతులని చేస్తుంది.

సంకల్పంతో ముందుకు వెళ్ళిన అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్, మహాత్మాగాంధి, సుభాష్‌చంద్రబోస్ శౌర్యవంతులు. శౌర్యవంతుని కీర్తి చంద్రికల ముందు లక్ష బంగారు గనులు కూడా దిగదుడుపే.

## ఓడిపోయినట్టు కనిపించు, అదే విజయ రహస్యం

■ కాని ఓడిపోకు. కురుక్షేత్ర మహాసంగ్రామంలో శ్రీకృష్ణుడూ, అర్జునుడూ సహితం వెనక్కి తిరిగారు. మహామహులమనుకునే వారు విజయహాసం చేశారు.

సమయం తమది కానప్పుడు నరనారాయణులే వెనక్కి తగ్గారు మనమెంత? మళ్ళీ తెల్లారుతుంది. సమయం చేతికొస్తుంది.

విజయలక్ష్మి అందుతుంది. అవేశం అన్ని వేళలా తగదు. సింహం కూడా వేట తనకు దొరకదనుకుంటే తిరిగి గుహలోకి వెళుతుంది. ప్రయత్నించి విఫలమవ్వదు.

## ఆడపిల్ల శ్రీమహాలక్ష్మి ఇంటికొచ్చే కోడలు అష్టలక్ష్మి

■ కోడలంటే లక్ష్మికాదు అష్టలక్ష్మి వంటిది. అట్టి ఆడపిల్లను కోడలొచ్చిన వేళావిశేషం అంటూ మంచి జరిగితే పొగడటము, ఇబ్బందులెదురైతే గుసగుసలాడుతూ బాధపెట్టడం శ్రీలక్ష్మి మహాకోపానికి కారణమవుతాయి.

వైకుంఠపతి సీతమ్మ వారిగా అవతారం ఎత్తినప్పుడు పెళ్ళవ్వగానే శ్రీరాముడి పట్టాభిషేకం ఆగింది. అరణ్యవాసాలకి వెళ్ళాల్సి వచ్చింది. అన్నీ వ్యధలే.

అయినా మొత్తం శ్రీరామాయణంలో జనకరాజ పుత్రిని ఎవ్వరూ ఒక్క చిన్న పద ప్రయోగం చేయలేదు. అంటే కుటుంబంలో జరిగే ఏ అసౌకర్యానికీ కోడలు కారణం కాదు.







## వ్యాపార, వ్యవహారాదుల్లో నాలుగు గోడల మధ్యనున్న ఆడవారిని అవమానిస్తే....

■ దుర్యోధనుడిలా... దుశ్శాసనుడిలా.... కీచకుడిలా..... రావణాసురుడిలా.. నహుషుడిలా... శుక్తిమతిని అవమానించిన కోలాహల పర్వతునిలా... దమయంతి ఆక్రోషంలో మాడిమసైపోయిన కిరాతకుడిలా.... సురథునిలా.. జామద్రథునిలా (వీడు మరీ నీచుడు వరుసకి చెల్లెలు గూర్చే మాట్లాడాడు) అలాంటి వారు ఎప్పటికైనా.....!



## కుంకుమ తయారీ విధానం

- పసుపుకొమ్ములు - 200గ్రాములు
- పటిక - 20 గ్రాములు
- ఎలిగారం - 20 గ్రాములు
- నిమ్మకాయలు - 6
- నువ్వులనూనె - 10 గ్రాములు

■ పటికనూ, ఎలిగారంలనూ కచ్చాపచ్చాగా దంచి నిమ్మరసం బాగా కలపాలి. ఆపై పసుపుకొమ్ములు అందులో వేసి కలిపి ఓ రోజంతా ఉంచాలి. మరుసటిరోజు మరో పాత్రలోకి మార్చాలి. పసుపుకొమ్ములకి బాగా పట్టి వుంటాయి. వాటిని నీడ ఉండే ప్రదేశంలో ఉంచి ఎండబెట్టాలి. ఆ తర్వాత రోటిలో వేసి బాగా మెత్తగా దంచాలి. దంచిన కుంకుమని తెల్లబట్టలో వేసి జల్లించుకోవాలి. చాలా కొద్దిగా నూనె వేసి కలుపుకొని కుంకుమ భరిణలో పదిలం చేసుకోవాలి. మీరు చేసుకున్న కుంకుమను మీరే ఆనందంగా అలంకరించుకోండి, ధరించండి.



## స్త్రీకి నగలూ, వస్త్రాలకన్నా మించినవి

■ సత్యభామా దేవికి ద్రౌపది అరణ్యపర్వంలో చెబుతుంది... ఇంద్రప్రస్థపురంలో మణిమాణిక్యాలను ధరించిన నేను చెప్పిన మాటను నూరు వేలమంది పనివారలు ఆజ్ఞగా నిమిషాల్లో చేసేవారు. ఇప్పుడు సకల పనులూ నేనే చేసుకుంటున్నాను. అప్పుడూ, ఇప్పుడూ నా ఆనందంలో, సంతోషంలో మార్పులేదు. పతిప్రేమను పొందాను. ఆ అనురాగం ముందు నగలూ, చీరలూ ఎంత?

భర్తను ప్రేమతో, నా గృహధర్మాలతో గెలుచుకోగలిగాను. మందులూ మాకులూ వల్ల అనర్థమే జరగుతుంది. భర్తతో సఖ్యతకు మించిన సంపద స్త్రీకి వేరొకటి లేదు.



## ప్రేమ, తల్లీ, తండ్రి, సోదరుడు, సోదరి, భార్య, పిల్లలు... స్నేహితులూ, సన్నిహితులూ, బంధువులూ, పరిచయస్తులూ, తెలివితేటలూ, మేధావితనమూ, న్యాయం, ధర్మం, మంచితనం, పెద్దరికం.. సాత్వికం... అన్నింటికంటే పవర్‌ఫుల్

■■■ డబ్బు.







## కొల్హాపూర్ శ్రీమహాలక్ష్మిని దర్శించండి

■ పూర్వము కరివీర ప్రాంతము. ప్రస్తుతం కొల్హాపూర్. శ్రీవేంకటేశ్వరస్వామి పద్మావతీదేవిని వివాహమాడటంతో భృగు పుత్రి లక్ష్మీదేవి కోపించి ఇక్కడి పర్వత ప్రాంతానికి వచ్చింది. మహారాష్ట్రలోని కొల్హాపూర్‌లో పంచగంగానది ఒడ్డునున్నదీ దేవాలయం.

ఏడో శతాబ్దంలో చాళుక్యరాజు, తొమ్మిదోశతాబ్దంలో యాదవరాజు ఆలయాన్ని మెరుగుపరిచారు. చైత్రమాసంలో పౌర్ణమీ, శుక్రవారములలో మహా పూజలు జరుగుతాయి. ముంబయి నుంచి 396కి.మీ, షోలాపూర్ నుంచి 247కిమీ., పూనే నుంచి 233కి.మీ.

అన్ని ప్రధాన నగరాల నుంచి రైలు సౌకర్యం వుంది. ముంబయి నుంచి కొల్హాపూర్‌కి విమాన సౌకర్యం వుంది. అష్టలక్ష్ముల దేవాలయాలు చెన్నైలోనూ, ముంబాయిలోనూ ఉన్నాయి.



## తులసి మాల ధనసంపదలకి మూలం

■ పూజలకీ, నామార్చనకూ 108 పూసలుగలవి అనగా రుద్రాక్ష లేదా తులసిమాల వాడాలని పురాణ వచనము.

ఆ నూట ఎనిమిది జపమాల లేదా ధరించే మాలలో మహాశక్తికి పదిహేను పూసలూ, మంచి సంతానానికీ వారి యోగక్షేమాలకీ ఇరవై అయిదూ, కుటుంబ ఆరోగ్యానికి ఇరవైఏడూ, మహా సంపదలకి 30, మిగితా తొమ్మిది మోక్షానికీ ఆయా ఫలములనిస్తాయి.

## శ్రీమహాలక్ష్మి సంపదలనే కాదు

■ కీర్తి, జ్ఞానము, ధైర్యము, విజయము, చక్కని సంతానము, బంగారము, ధాన్యము, సంతోషము, తెలివితేటలూ, అందమూ, శౌర్యము, సంకల్పము, ఉన్నత విలువలు, ఆరోగ్యము, ఆయుష్షు... ఇలా వైకుంఠపతి సతి పదహారు విధాలైన సంపదలనిస్తుంది.

## ఇలా ఇస్తే తీసుకున్నా తిరిగిరావు, తీర్చలేరు

■ రెండు వేళ్ల మధ్య డబ్బులని పెట్టి అందిస్తే తీసుకున్నవారికి ఆ ధనం వృధా అవుతుంది. అదే అప్పుగా ఇస్తే అవి తిరిగిరావు.

ఎంత నిజాయితీ పరులైనా వారు తిరిగి ఇవ్వలేని అసక్తులవుతారు. అలాగే బుధవారం నాడు అప్పిస్తే ఎక్కువ శాతం ఆ ధనం తిరిగి రాలేని పరిస్థితి ఏర్పడుతుంది.

## శుక్రవారం విష్ణుసహస్రనామం, లలితా సహస్రనామం...

■ గృహంలో లేదా శుభకార్యాల్లో చదవటం వల్ల వచ్చే ఫలం కన్నా ఆలయాల్లో ముఖ్యంగా శ్రీమహావిష్ణువు దేవాలయాల్లో సహస్రం చేయించుకోవటం ద్వారా ఎక్కువ ఫలం కలుగుతుంది. శుక్రవారం లక్ష్మీదేవికి కుంకుమార్చన చేయిస్తే పోయిన సంపద వెతుక్కుంటూ వస్తుంది.





## కుబేరునికి అంతటి ధనమిచ్చింది

■ పరమేశ్వరుడు. రావణాసురుడితో భంగపడి కుబేరుడు లంకా నగరాన్నీ, సకల సంపదలనూ, పుష్పక విమానాన్నీ దశకంఠునికి సమర్పించి కాశీ చేరాడు. మహాశివుని గూర్చి మహా తపస్సు చేశాడు. కుబేరుని తపస్సు చెడగొట్టడానికి చెయ్యాల్సిన కార్యాలన్నీ చేశాడు ఇంద్రుడు. ఏవీ ఫలించలేదు కుబేరుని తపస్సు ముందు.

వాని మహాతీవ్ర తపస్సుకి మెచ్చి శివుడు ప్రత్యక్షమయ్యాడు. మహాసుందరమైన, సంపదమయమైన అలకాపురికి రాజును చేశాడు. ఉత్తర దిక్కుకి దిక్పాలకునిగా నియమించాడు. లోకంలో ధనవంతుడివి నీవేనని దీవించాడు. నా ప్రియమిత్రుడవి కూడానని సంపదలకి మించిన వరమిచ్చాడు.

## భర్తని సాధిస్తే భార్యకి సుఖం ఉండదు

■ ధనం సంపాదించని భర్తంటే కొంతమంది భార్యలకి లోకువ. సూటీపోటిమాటలతో ఏదో ఒకటి అంటుంటారు. పక్కవారి గొప్పతనం గూర్చి చెబుతుంటారు. అలా మాట్లాడటం వల్ల ఆ భర్త ఎప్పటికీ సంపదలనే సుఖాలని భార్యకి అందివ్వలేడు.

భర్త సుఖంగా, ధైర్యంగా, ప్రశాంతంగా ఉంటేనే ఏదైనా సాధించ గలడు. సకల సంపదలకీ మూలమైన ఆదిలక్ష్మి తన నివాసస్థానమైన పద్మాన్ని పరిత్యజించి పద్మాలయ భర్త పాదాలని సేవిస్తుంది. ఆరాధిస్తుంది. దానివల్లే మహావిష్ణువు జగద్రక్షకుడయ్యాడు. ప్రియసతి లక్ష్మీవిభుడయ్యాడు.

## అదృష్టం అంటే...

■ ధనం కాదు.

■ ఎంత వెధవ అయినా భార్య పతివ్రతగా ఉండటం.

■ వందలసార్లు వ్యభిచార, జూద కొంపల్లో గడిపినా ఇంతవరకూ దొరక్కపోవటము.

■ ఎన్ని తప్పుడు పనులు చేసినా ఈ రోజుకి సమాజానికి గొప్పవాడిగా కనపడటము.

■ మీ దగ్గర రూపాయి లేకున్నా మీ వద్ద కోట్లున్న వాళ్ళు వినయంగా ఉండటము.

■ పదిరూపాయలు లేని మిమ్మల్ని పదికోట్లున్న వాడు కూడా పొగడటము.

■ చుట్టూ అందరూ ద్రోహం చేసినా పదిపైసలు లేని మిమ్మల్ని 'సార్' అని కోట్లున్న వారు సంబోధించటము.

■ మీ రంగంలో లేమి ఉన్న వాడైనా, లేకి వాడైనా మిమ్మల్నే కథానాయకుడిగా చూడటము.

## తండ్రి స్థానంలో కన్యాదానం చేస్తే

■ కన్య శ్రీమహాలక్ష్మి వంటిది. అలాంటి లక్ష్మిదేవిని వరునికి కన్యాదానం చెయ్యటమంటే సాక్షాత్తు సముద్రుడితో సమానమే. సకల సంపదలు సముద్రాన్ని చేరినట్టే. ఆ వ్యక్తి రత్నాకరుడవుతాడు. మహా సంపదలు వారిని చేరతాయి.





## ధనము, శక్తి శాశ్వతములు కావు

■ ఓడలు బండ్లు అవ్వచ్చు, బండ్లు ఓడలవ్వచ్చు. ఈ రోజు కాసులేని వాడు కోట్లకు పడగలెత్తవచ్చు. కనకపు సింహాసనాన్ని అధిష్టించిన వాడు కాసిన్ని గంజి నీళ్ళు కూడా లేనివాడవ్వచ్చు.

రెండు చేతులతో బాణాలు వెయ్యగలిగే జగదేకవీరుడు అర్జునుడు. శ్రీకృష్ణుడి అంతఃపుర కన్యలైన పదహారువేలమందిని దొంగల నుంచి కాపాడలేకపోయాడు. కాన అవన్నీ అశాశ్వతాలు. శాశ్వతమైనది ఆ దేవదేవునిపై భక్తి మాత్రమే.



## లక్ష్మీదేవికి విన్నపము

■ 'ఓ సముద్రరాజ తనయా, పద్మవాసినీ, నీ భర్త అయిన శ్రీమహావిష్ణువు కటి స్థలమే భూలోకము. నాభి భువర్లోకం, హృదయం సువర్లోకం, వక్షం మహర్లోకం. కంఠం జనలోకం, స్తనాలు తపోలోకం, శిరస్సు సత్యలోకం, జఘనం అతలం, తొడలు వితలం, మోకాళ్ళు సుతలం, పిక్కలు తలాతలం, చీలమండలం మహాతలం.

కాలి మునివేళ్ళు రసాతలం, అరికాళ్ళు పాతాళలోకం. లోకమయుడైన శ్రీమహావిష్ణువుకి... అంతటి విశ్వస్వరూపునికీ ఇల్లాలివైన నిన్ను , స్వామినీ ఇరువురినీ ఏకకాలంలో ప్రార్థిస్తున్నాను.

నీ భర్త ద్వారా ధైర్యాన్ని ఇప్పించు. నీవు శక్తినీ, సందలనూ ఇవ్వు తల్లీ.... ' లక్ష్మీ పూజానంతరము విన్నపాన్ని వినిపించండి. త్వరితంగా వరాలను పొందండి. (శ్రీభాగవతము ఆధారంగా)



## అధర్మపరమైన ధన సంపాదన

■ భార్యా పిల్లలతో గడిపే మధురమైన సమయాన్ని హరించి వేస్తుంది.

■ మిత్రులందరినీ శత్రువులుగా చేస్తుంది.

■ ధైర్యాన్ని పోగొట్టి అభద్రతనీ, భయాన్నీ పెంచుతుంది.

■ చుట్టూ విషమొక్కలనే మనుష్యులు చేరుతారు. చేయాల్సిన హానంతా చేస్తారు.

■ వయసుని పదేళ్ళ ముందుకు తీసుకు వెళ్తుంది.

■ కోపాన్నీ, ద్వేషాన్నీ, ఆవేశాన్నీ పెంచుతుంది.

■ వచ్చే ధనానికి సరిసమానంగా వ్యాధులని మోసుకొస్తుంది.

■ అప్పుడు సంపాదించిన ధనమంతా ఖర్చు పెట్టినా పోయినవి ఏమీ తిరిగిరావు.



## ఓసే, ఏమే, వోయ్, నీ...

■ అని భార్యని సంబోధిస్తే లక్ష్మి దోషమే అవుతుంది. ఇంటి ఇల్లాలు గృహలక్ష్మి ఒక్క పడకగదిలోనే భార్య. మిగతా అన్ని వేళలా... అన్నం పెట్టేటప్పుడు తల్లి, మంచి చెప్పేటప్పుడు గరువు వంటిది, సేవలు చేసేటప్పుడు దాసి వంటిది.

అలాంటి ఇల్లాలిని అలా ప్రేమతో పిలిచినా దోషం దోషమే. భార్యని పేరు పెట్టి పిలవటం సంస్కారమే కాదు సంపదల వృద్ధికి కూడా హేతువు.







## ఒకటి ఎప్పుడూ ఒంటరి అంకే

■ మనం మన ప్రపంచం అంటూ దాంట్లోనే మునిగి అందర్నీ దూరం చేసుకుంటే జీవితంలో ఎదుగుదల ఉండదు. పదిమందితో కలిసి ఉండాలి.

ముఖ్యంగా మీ మీ వ్యవహారాల్లో అందరితో టచ్‌లో ఉండాలి. అప్పుడే ఎవరికి ఏం కావాల్సి వచ్చినా ముందు మీకు అవకాశం ఇస్తారు. అవకాశమంటే సంపాదన.

ధనం సంపాదించటానికి ఇల్లు ఆఫీసు అనుకుంటే చుట్టూ ప్రపంచానికి దూరమైతే అందరికీ అది విజయ మంత్రం కాకపోవచ్చు. ఏమైనా మగాడు తిరగాలి. లేకపోతే ధన సంపాదన కష్టమే.



## తోకచుక్క చూస్తే

■ పెళ్ళికాని అమ్మాయి చూస్తే మంచి భర్త లభిస్తాడు.

■ దంపతులు కలిసి చూస్తే లక్ష్మీదేవి అనుగ్రహానికి చిహ్నం.

■ జుట్టు విరబోసుకొని ఉన్నప్పుడు చూస్తే ఆర్థిక నష్టం.

■ భర్త లేదా భార్య ఒంటరిగా చూడాల్సి వస్తే భర్తనూ, భార్యనూ తలచుకుంటే అదృష్టం కలిసి వస్తుంది.

■ తోకచుక్క పడుతున్నప్పుడు పుట్టింటివార్ని తలుచుకుంటే త్వరలో మిమ్మల్ని వచ్చి తీసుకెళ్తారు.

■ పిల్లాడికి అన్నం పెడుతున్నప్పుడు చూస్తే ఆ పిల్లాడు మహారాజవుతాడు.



## లంకె బిందెలు

■ మన పూర్వీకులకి ఇప్పటిలా బ్యాంకులు లేవు. అందుకే తమ ధనాన్ని కుండలలో, వెండి పాత్రలలో ఉంచి భూమిలో దాచిపెట్టే వారు.

అవే లంకెబిందెలు.

వారు తిరిగి తీసుకోకపోవటం, కాలం చెయ్యటం, వరదలు ఇత్యాదివాటి వల్ల అప్పుడప్పుడు బయటపడుతుంటాయి. అలాంటి లంకెబిందెలు, దాచిపెట్టిన వారి వారి వంశస్థులకి తప్ప దొరకవని శాస్త్రం చెబుతోంది.



## జి.పి.ఆర్ టెక్నాలజీతో భూమిలోని నిధులని బయటికి తీయచ్చు

- ■ లోతుగా విశ్లేషిస్తుంది.
- ■ మంత్రాలు, తంత్రాలతో నిధులు బయటికి రావు.
- ■ నిధులున్నాయన్న ప్రాంతాలన్నీ పుకార్లు మాత్రమే.
- ■ అనుమానం ఉన్న చోటల్లా ప్రభుత్వం ప్రయత్నం చేసింది.
- ■ అనవసరంగా సమయం వృధా చేసుకోకండి.

■ ఆర్కియాలజీ డిపార్ట్‌మెంటే సూపర్ టెక్నాలజీని వాడుతోంది. కాన సాధారణ మనుష్యులకి అది సాధ్యం కానిపని.

■ నిధులెప్పటికైనా దొరుకుతాయని ప్రయత్నించే వారి సంఖ్య జీవితం అత్యున్నత స్థానంలో ఉండాలన్న ఆశయం ఉన్న వారికన్నా ఎక్కువే.







## నిధి, చాలా సుఖమా?

■ నిధి అంటే వజ్రవైఢూర్యాలూ, మరకత మాణిక్యాలే కాదు. తంజావూరు రాజు త్యాగరాజుకి మహా సంపదలిచ్చి రాజసభకి ఆహ్వానించినప్పుడు ఆ అపూర్వ ధనకనక వస్తు వాహనాలను చూసి కీర్తన పాడతాడు.

నిధి సుఖమా, రాముని సన్నిధి సుఖమా, దధి నవనీత క్షీరములు రుచా, దాశరథి ధ్యాన భజన సుఖమా, గంగా స్నానం సుఖమా, మమతలూ, అనురాగాలూ, ఆవేశాలూ గల నరుల స్తుతి సుఖమా, సుమతి త్యాగరాజు సుతుని కీర్తన సుఖమా అని. అన్ని సంపదలకంటే ఆ శ్రీరామచంద్రుని ధ్యాన భజనలో ఉన్న సుఖ నిధి వేరే ఏదీ లేదు.



## ముందు మీరు ప్రారంభించవద్దు

■ తప్పులు మనుష్యులు చేయక ఎవరు చేస్తారు. గోరంతలు కొండంతలు చేసుకొని ఆలోచించుకొని గొడవ ప్రారంభిస్తే నష్టపోయేది ఇద్దరూ. పక్కన వాడు నాశనమై తానూ నాశనం అవ్వటం రాక్షసుల లక్షణం.

ఏ గొడవైనా సరే అది చివరికి దారి తీసేది ఆర్థిక నష్టానికే. మీ కోపాలకీ, ఆవేశాలకీ కుటుంబాన్ని బలి చేయద్దు. కోపం, ఆవేశం భృగు మహర్షి అంతటి వానికే లొంగలేదు. ఆ మహాగ్రహంతోనే సరస్వతీ బ్రహ్మలను, శివపార్వతులను శపించాడు. శ్రీమహావిష్ణువు చేతిలో మూడో కన్ను పోగొట్టుకున్నాడు.

# గుప్త నిధి కాదు,
# రక్త నిధి

■ నిధుల కోసం వెళితే మిగిలేది రక్తకన్నీరే.

■ దురాశ దుఃఖానికి చేటు.

■ పాములున్న చోట పూర్వీకులు నిధులు దాస్తారన్నది కేవలం అపోహ మాత్రమే.

■ ఆ దిశగా వెళితే మిగిలేది మహా భయంకరమైన చావు.

■ భూమిలోని నిక్షేపాలు ఏమైనా అన్నీ ప్రభుత్వానివే. నిధుల కోసమే కాదు దేనికోసం ప్రయత్నించినా నేరమే.

■ నిధుల కోసం ప్రయత్నించిన వారంతా అర్థాంతరంగా పోయిన వారే.

■ నిధి వేటలో తాడును చూసి పామనుకొని భయంతో చచ్చిన వారే ఎక్కువ.

■ పురాతన కట్టడాల్లో, దేవాలయాల్లో శోధిస్తే నిధుల సంగతేమో గాని మహా భయంకర దోషం తగలక తప్పదు.

■ దేహశుద్ధి, కటకటాల పాలు కూడా అవ్వాల్సి వస్తుంది.



# భూమిలో
# నిధులు

– పూర్వము రాజులు విజయయాత్ర చేసి మహా సంపదలు తెచ్చి ప్రజా సంక్షేమం కోసం ఉపయోగించారే గాని భూమిలో పాతిపెట్టినట్టు చారిత్రక ఆధారాలు లేవు.





■ శ్రీకృష్ణ దేవరాయల కాలంలో రత్నాలను వీధులలో పెట్టి అమ్మేవారు. వీధిలో పెట్టి అమ్మే రత్నాలను భూమిలో పాతిపెట్టాల్సిన అవసరం లేదు.

■ ధ్వజస్థంభాలూ, రాజగోపురాలూ నిర్మించేటప్పుడు శాస్త్రానికి ఓ బంగారు నాణెం వెయ్యటం మాత్రమే సంప్రదాయం.

■ గృహనిర్మాణం, పెద్ద పెద్ద దేవాలయ కట్టడాలు నిర్మించేటప్పుడు శుభ సూచకంగా నవధాన్యాలతో పాటు నవరత్నాలను వెయ్యటం హిందూ సాంప్రదాయము. కేవలం ఆ చిన్న కారణంగా ఎక్కువగా ఊహించుకొని జీవితాన్ని పాడుచేసుకోవద్దు.

■ నిధి అంటే లక్ష్మీదేవి. కష్టం వల్ల, ధైర్యం వల్ల లక్ష్మీనిధి సిద్ధిస్తుంది కాని క్షుద్రపూజల వల్ల కాదు.

■ మీ ఇంట్లో లంకెబిందులున్నాయని ఎవడో దొంగస్వామి చెప్పిన మాట విని వీధిలో, ఊరిలో నవ్వుల పాలు కావద్దు. మీ కొంప మీరే కూల్చుకోవద్దు.



# నడమంత్రపు
# సిరి

■ అహం పెరిగితే వానికే నష్టం.. మిగితావారిపై తక్కువాభిప్రాయం కలిగితే వాని ఉనికికే ప్రమాదం కలుగుతుంది.

■ నడమంత్రపు సిరి కొత్త అలవాట్లను చేస్తుంది. సరికొత్త మనుష్యులను దగ్గరికి చేరుస్తుంది. చివరికి కొత్త గుణపాఠాలు నేర్పుతుంది. కాని అప్పటికే ఆలస్యం అవుతుంది.

ఆ తర్వాత ఉన్నప్పుడు కళ్ళు కనిపించలేదురా వీడికి అని అన్పించుకోవాల్సి వస్తుంది.



## ధనం ఉన్నప్పుడు, పోగొట్టుకున్నప్పుడు

■ అన్నీ ఎదురుగా అందుబాటులో ఉంటాయి. కానీ ఏమీ తినాలనిపించదు (ఉన్నప్పుడు)

■ బజ్జీలూ, పునుగులూ తినాలనిపిస్తుంది కానీ డబ్బులుండవు. (పోగొట్టుకున్నప్పుడు)

■ మెడలో పెద్ద హారం పెద్దగా తృప్తినివ్వదు (ఉన్నప్పుడు)

■ కనీసం చేతికి రెండు గాజులన్నా ఉంటే బావుండుననిపిస్తుంది (పోగొట్టుకున్నప్పుడు)

■ కారులో అంతదూరం వెళ్ళాలా (ఉన్నప్పుడు)

■ లగ్జరీ బస్‌లో సీటు దొరికినా వెళ్ళచ్చు (పోగొట్టుకున్నప్పుడు)

■ లక్షరూపాయలు పెద్ద విషయమా (ఉన్నప్పుడు)

■ కనీసం వెయ్యి రూపాయలు అప్పుగానైనా దొరికితే బావుండు (పోగొట్టుకున్నప్పుడు)

■ అందరూ నా దగ్గరికి రావాలి (ఉన్నప్పుడు)

■ నలుగురితో సఖ్యతగా ఉంటే బావుండేదేమో (పోగొట్టుకున్నప్పుడు)

■ డబ్బు దేమి ఉంది కుక్కని కొడితే కూడా రాలుతుంది (ఉన్నప్పుడు)

■ అంత పెద్ద మాట నేనే అన్నానా (పోగొట్టుకున్నప్పుడు)

■ భార్య, బంధువులూ, స్నేహితులూ అంతా వినయంగా ఉండాలి (ఉన్నప్పుడు)





■ బంధువులనీ, స్నేహితులనీ అలా అని ఉండాల్సింది కాదు (పోగొట్టుకున్నప్పుడు)

■ ఎవ్వరికేం కావాలన్నా నేను చూస్తాను (ఉన్నప్పుడు)

■ అందరికీ అన్నీ చూశాను, ఇప్పుడు పలకరించటం సంగతి అటుంచు, దూరం నుంచే పక్కకి వెళ్తున్నారు (పోగొట్టుకున్నప్పుడు)



## శుక్రవారం సంధ్యాసమయంలో దీపం

■ అలా ఆ సమయంలో దీపం ఎవరు వెలిగిస్తారో అట్టి వారందరి గృహాలకి తాను వస్తానని శ్రీమహాలక్ష్మీదేవి ఓ భక్తురాలికి వరం ఇస్తుంది. తన పేదరికం పోవటానికి ఓ మునీశ్వరుని ప్రార్థింపగా ఆయన ఓ ఉపదేశం చేస్తాడు.

అనుకోకుండా వచ్చిన ఓ అవకాశాన్ని వినియోగించుకొని ఆ రోజు రాజ్యంలో ఎవ్వరూ దీపం వెలిగించకుండా చేస్తుంది. ఆ భక్తురాలు మాత్రం సంధ్యా సమయంలో దీప కాంతులను వెలిగిస్తుంది. ఆ మహా వెలుగును భరించలేక నల్లని వస్త్రాలను ధరించిన అలక్ష్మి బయటికెళుతుంటే, నీవు వెళితే తిరిగి రాకూడదని చెబుతుంది.

సరేనని వెళ్తుంది. ధగధగలాడే పీతాంబరధారి బయట చీకటిలో ఉండలేక లోనికొస్తుంటే గుమ్మంలో కూర్చున్న భక్తురాలు ఆపి లోనికెళ్తే మళ్ళీ బయటికి రాకూడదని అంటుంది. సరేనని లక్ష్మీదేవి ఆమెకు అభయం ఇవ్వటంతో పాటు శుక్రవారం సంధ్యా సమయంలో ఎవరు దీపం వెలిగిస్తారో వారిని కూడా అనుగ్రహిస్తానని చెప్పి లోపలికి వెళ్తుంది.



## జ్ఞాన సంపద కోసం

■ సరస్వతి అనగా ప్రవహించునది అని ఋగ్వేద మూలం. జ్ఞానశక్తి స్వరూపిణీ దేవిని ఉపాసించటం ద్వారా అపర బ్రహ్మశక్తి స్వరూపాన్ని తెలసుకొనగలగుతాము. మేధాశక్తీ, సున్నితమైన శక్తి, ఆదిశక్తి సరస్వతీదేవి వాక్‌శుద్ధి. విద్యా జ్ఞానాలను అనుగ్రహిస్తుంది.శ్రీ వాగ్దేవిని ప్రాతః స్మరణముతో, శ్రీసరస్వతి ద్వాదశ నామ స్తోత్రముతో అలాగే శ్రీ మహా విష్ణువే స్తుతించిన శ్రీమహావిష్ణుకృత నిర్గుణ సరస్వత్యష్టకమ్ పఠించటం ద్వారా మహా జ్ఞాన సంపద కలుగుతుంది. ఆ జ్ఞాన సంపదతోనే సంపదలూ కలుగుతాయి.



## శ్రీఅష్టలక్ష్మీ యాగం

■ వర్షాలు కురవటానికి వరుణ యాగం.

■ ప్రపంచ శాంతి కోసం విశ్వశాంతి యాగం లేదా అతిరుద్ర మహాయజ్ఞం.

■ మృత్యుంజయ యాగం దీర్ఘాయుష్షును కలుగచేస్తుంది.

■ చండీయాగం... అనితర సాధ్యమైన కార్యం నెరవేరటానికి .

■ సంతానం కోసం పుత్రకామేష్ఠి యాగం.

■ రాజసూయయాగం మహా రాజయోగం కొరకు.

■ మహా భారతంలో సర్పయాగం సందర్భంలో గరుత్మంతుని గాథ చదివిన వారికి మహా సంపదలు సిద్ధిస్తాయి.

■ అష్టలక్ష్మీ యాగం మహాధన ప్రాప్తాలనిస్తుంది.







## శ్రీమహాలక్ష్మిని ఇస్తూ శ్రీదేవి చెప్పిన అప్పగింతలు

■ విష్ణూ... ఇదిగో ఇంతి. ఈ పట్టిని స్వీకరించు. నీ వక్ష స్థలమే ఈమె కేళీ గృహం. సకల సంపదలకూ ఈమె పెన్నిధి. నీవు ఈమెతో సుఖించు. లోకాలకి దీపం ఈ రమాదేవి.

ఎన్నడూ, ఏనాటికీ ఈమెను అవమానింపవలదు. అలక్ష్యం చేయరాదు. శుభ్రత లేకున్నా, ప్రశాంతత లేకున్నా ఈ భువన మోహినికి, చంద్రవదన అయిన ఈ కమలకు పడదు. ప్రేమగా, ప్రీతిగా చూసుకో.



## లక్ష్మీదేవి చంచల చపల కాదు

■ శ్రీమహాలక్ష్మి చపల అనీ, చంచల అనీ సకల పురాణాలూ చెబుతున్నాయి. కానీ ఆ ధనాధిదేవత వారి వారి బుద్ధిని బట్టీ, ప్రవృత్తిని బట్టి విడిచి పెడుతుంది. మన బుద్ధి సరిగాలేనందున గృహంలోంచి ధనలక్ష్మి వెళితే లక్ష్మి చంచల అని అనటం మరింత దోషం.

అలాగే ఎట్టి స్థితిలోనే ఆమె అంటి పెట్టుకొని ఉండేది, క్షణకాలం కూడా విడిచి ఉండలేనిది శ్రీమహావిష్ణువుని మాత్రమే. అందుకే నారాయణుణ్ని స్తుతిస్తుంటే, సేవిస్తుంటే భర్తతో పాటు తానూ ఉండిపోతుంది. నారాయణుణ్ణి పూజించటం ద్వారా లేమి అన్నది ఆ గృహంలో ఉండదు.

శ్రీమహాలక్ష్మి విష్ణు సేవా పరాయణురాలు. అందరి ప్రార్థనలనూ స్వామికి విన్పించేది. పతిభక్తి పరాయణురాలు. అట్టి శ్రీమహాలక్ష్మి సకల సద్గుణరాశి.



## క్షీరసాగర మధనమప్పుడు దేవతలు చేసిన శ్లోకం

■ శ్రీమహాలక్ష్మీ దేవి క్షీరసాగరమథనంలో జన్మించినప్పుడు సకల దేవతలూ ఆ సంపదల తల్లిని స్తుతించారు. ఆ స్తోత్రం ద్వారా స్తుతించిన వారి ఇంట కొలువై ఉంటానని సకల అంధకారాలను పోగొట్టి వెలుగును ప్రసాదిస్తానని శ్రీమహాలక్ష్మి వరం ఇచ్చింది.

స్తోత్రం : నమస్తే సర్వలోకానాం జననీమబ్జసంభవామ్
శ్రియమున్నిద పద్మాక్షీం విష్ణువక్షః స్థితామ్

## దీపం...

■ దీపం ఎప్పుడూ పైకే చూస్తుంటుంది. అంటే ముందుకే సాగాలని ప్రయాణం చేస్తుంది.

■ దీపం చీకటినే కాదు హృదయంలోని అశాంతిని పోగొడుతుంది.

■ ప్రతి మంచి పనిని ప్రారంభించే ముందు దీపం వెలిగించటమంటే విజయవంతం అయ్యిందన్న పరమార్థంతోనే.

■ దీపంలా ముందుకు సాగాలని ప్రయత్నించే వార్నే లక్ష్మీదేవి అనుగ్రహిస్తుంది.

■ లక్ష్మీదేవి పూజలో నువ్వులనూనె దీపాన్ని ఎడం వైపూ, ఆవునెయ్యి దీపాన్ని కుడివైపూ ఉంచి వెలిగించాలి.

■ దీపం కొంతమంది దేవునికి తెలియక వెలిగిస్తుంటారు. అలా కాకుండా శివసంబంధిత పూజకి ఎడంవైపుగానూ, శ్రీమహావిష్ణువు సంబంధిత పూజల్లో కుడివైపుగానూ వెలిగించి పూజ చేసుకోవాలి.





## 9 అంకె

■ తొమ్మిది అంకె మనిషిలో చెడులనూ, దోషాలనూ అరికడుతుందని సంఖ్యా శాస్త్రం చెబుతోంది.

■ పద్మ పురాణం లక్ష్మీ కటాక్షం కోసం 18 అధ్యాయాలు గల భగవద్గీతను పఠించమని చెబుతోంది.

■ 9 అంకెతో చేసే ఏ ఆర్థికలావాదేవీలైనా సరే మహా ధనాన్ని సంపాదించి పెట్టడమే కాకుండా అంతకు తగ్గ కీర్తిని కూడా తెచ్చిపెడుతుంది.



## మహా హోమములు.. అభిషేకాలు.. అర్చన

■ రుద్రహోమం చేయటం వల్ల సకల కార్యసిద్ధి. ఆయుష్షు అభివృద్ధి. కోరిన కోరికలు నెరవేరుతాయి.

■ రుద్రాభిషేకము వల్ల ఏలిననాటి శని, అష్టమ శని ఇత్యాదిదోషాలన్నీ పోతాయి.

■ లక్ష్మీగణపతి హోమం చేయటం వల్ల అనేక విఘ్నాలు తొలగిపోతాయి.

■ నవగ్రహ హోమము వల్ల నవగ్రహదోషాలు మటుమాయం అవుతాయి. నవగ్రహ శాంతి జరుగుతుంది.

■ దుర్గాహోమం వల్ల అనేక భయ భీతి బాధలు తొలగిపోతాయి. ఖడ్గమాలతో కుంకుమార్చన చేయటం వల్ల మహా అష్టైశ్వర్యాలూ, అన్నింటా విజయం సిద్ధిస్తుంది.



# దక్షిణావర్త శంఖము

■ క్షీరసాగర మథనంలో జన్మించిన లక్ష్మీదేవికి తనలాగే సముద్రంలో జన్మించిన శంఖాలన్న మహా ప్రీతి. అందునా దక్షిణా వర్త శంఖమన్న మహాప్రీతి. ఈ శంఖము దొరకటం సుకృతమే.

ప్రస్తుతం మనకి దక్షిణా వర్త శంఖము సోదరిగా భావించే వామవర్తి శంఖమే. అలాగే దక్షిణా వర్తి శంఖము మోగేది లభిస్తే లక్ష్మీదేవికి అర్పించి పూజిస్తే మహా సిద్ధి కలుగుతుంది.



# తిరుమల తిరుపతి అలివేల మంగాపురం

■ ఇప్పటి అలివేల మంగాపురం ప్రాంతమే ఒకప్పుడు శుకమహర్షి ఆశ్రమం.

■ స్వామికి మరో స్త్రీపై వ్యామోహం కలగటంతో శ్రీవేంకటేశ్వరుని నివాసమైన శేషాద్రిని విడిచి శ్రీమహాలక్ష్మి ఈ ఆశ్రమానికి వచ్చింది.

■ లక్ష్మీదేవి కోసం దేవాధిదేవతలతో, నారదాదిమునులతో శుకమహర్షి ఆశ్రమానికి వచ్చిన నారాయణుడితో శ్రీలక్ష్మీదేవి చెప్పింది. 'స్వామీ... ప్రాణేశ్వరా! అల, వేలుపులంతా ఈ ఆశ్రమాన్ని పావనం చేశారు.

■ ఇకపై ఈ ప్రాంతం అలివేలమంగాపురంగా భాసిల్లుతుంది. నీవు రోజూ రాత్రి ఏడుకొండలు దిగి వచ్చి నా సేవలు అందుకో'. ఆ ప్రకారంగానే ఏడుకొండల వేంకటేశ్వరుడు రోజూ కొండ దిగివచ్చి





అలివేలమంగాపురంలోని అలివేలమంగను చేరి తిరిగి మధ్యలో వస్తూ అన్నగారు గోవిందరాజును దర్శించి తిరిగి శేషాద్రిని చేరుతున్నాడు. ఈ పురాణగాథ నీతి పరస్త్రీ వ్యామోహం ఉంటే భర్తకే దూరంగా వుంది లక్ష్మీదేవి. ఇక భక్తుల విషయంలో!? తమిళంలో దేవిని అలివేలమంగమ్మను తాయారు అనీ, శ్రీ వేంకటేశ్వర స్వామిని పెరుమాళ్ అని సంభోదిస్తారు.



# స్వస్తిక్

■ స్వస్తిక్ అనగా శుభాలని కలిగించేది.

■ మంత్రశాస్త్రం ప్రకారం స్వస్తిక్ చిహ్నం వేయటం ద్వారా ప్రతి పనీ నిర్విఘ్నంగా సాగుతుంది.

■ గణేషుని ప్రతీక.

■ సింహద్వారం వద్దగానీ, వ్యాపార కేంద్రం సింహద్వారం మీద గానీ స్వస్తిక్ చిహ్నం ఉంచటం ఎదుగుదలని ఇస్తుంది.

■ స్వస్తిక్ చిహ్నం కేతుగ్రహ దోషనివారణను కూడా చేసి శుభాన్ని కలుగచేస్తుంది.



# ఏకాక్షి నారికేళం

■ ఎంతో అదృష్టం ఉంటేగాని ఒకే కన్ను గల కొబ్బరికాయ లభింపదు. ఏకాక్షి నారికేళం లక్ష్మీదేవికి ప్రీతికరమైనది. ముఖ్యంగా శ్రావణ మాసంలో ఏకాక్షి నారికేళాన్ని అభిషేకించి లక్ష్మీదేవికి అర్పించి పూజిస్తే తనకి అత్యంత ప్రీతికరమైన ఏకాక్షి నారికేళాన్ని సమర్పించినందుకు కోరిన సంపదలనిస్తుంది. అష్టైశ్వర్యాలను కలుగచేస్తుంది.



## శ్రీరాముడు ప్రజలకేం చేశాడు

■ శ్రీరామాయణంలో శ్రీరాముడు భర్త ఎలా ఉండాలో, అన్నదమ్ములు ఎలా ఉండాలో, స్నేహితులు ఎలా ఉండాలో, ప్రజలు ఎలా ఉండాలో చెప్పి చేసి చూపించాడు.

■ శ్రీరామరాజ్యంలో ఇప్పటిలా మనిషి మనిషిని దోచుకోలేదు.

■ శ్రీరామరాజ్యంలో ఆడవాళ్ళ మీద అఘాయిత్యాలూ, యాసిడ్ దాడులూ లేవు.

■ శ్రీరాముని పాలనలో లక్షల టన్నుల కొద్దీ మద్యం తాగలేదు.

■ శ్రీరాముని పాలనలో తింటానికీ, ఉంటానికీ కొదవలేదు.

■ రామారాజ్యంలో ధనం కోసం పసిపిల్లలని చంపిన దాఖలాలు లేవు.

■ దానం ఇచ్చే వాళ్ళే కానీ పుచ్చుకునే వారు లేరు.

■ ఆడవాళ్ళకి ఏడువారాల నగలకీ, చీరలకీ కొదువ లేదు.

■ ఆవేశాలూ, కోపాలతో విచక్షణ మరిచే వారు కాదు.

■ రోగాలూ, రొప్పులూ, రొష్టులూ లేవు. రాజుకీ, సామాన్యుడికీ ఏకన్యాయం.

■ శ్రీరాముని పాలనలో భూకబ్జాలు లేవు.

■ శ్రీరాముని పాలనలో భార్యని భర్తా, భర్తని భార్యా, స్నేహితుడ్ని స్నేహితుడూ మోసం చేసిన దాఖలాలు లేవు.

■ రామరాజ్యంలో విచక్షణ మరిచి పెద్దా చిన్నా తేడా లేకుండా మాట్లాడే వారు లేరు.





■ శ్రీరాముడు యుద్ధం చేసింది భార్య కోసం మాత్రమే కాదు సాధుజనస్త్రీలను పీడిస్తున్న రావణాసురుడి బాధలు లోకాలకు లేకుండా చేసేందుకు.

■ ఒకే మాట, ఒకే బాణం, ఒకే భార్య శ్రీరామునిది.



## మోసం చిన్నదే, బాధ మాత్రం పెద్దది

■ మా నాన్నని హాస్పిటల్‌లో చేర్పించారు, మా పిల్లలకి బాగాలేదు, తిరుపతి వెళ్తున్నాను, శబరిమల వెళ్తున్నాను, బండి పాడయింది, అర్జెంటుగా వేరే ఊరు వెళ్ళాల్సి వస్తుంది...

ఇలా రకరకాల కారణాలు చెప్పి ఐదొందలు, వెయ్యి, రెండు వేలు అడిగే వారు ప్రతివారికీ చాలా మంది తగులుతారు. అలా చెప్పి డబ్బులు అడిగేవాళ్ళలో ఎక్కువ శాతం మంది అబద్ధాల కోరులే ఉంటారు. తద్వారా నష్ట పోయేది కొంత ఎమౌంటే అయినా మోస పోయామనే బాధే ఎక్కువ కలుగుతుంది. కాన అలాంటి వాళ్ళ విషయంలో జాగ్రత్త. అలా మీరు ఇంతకుముందు ఇచ్చి మోసపోయి ఉంటే మీకు లౌక్యం తెలియదన్నమాట. డబ్బు విషయంలో మీరు ఇంకా చాలా చాలా జాగ్రత్తగా ఉండాలి. ఏమరుపాటుగా లేకుంటే ఒక్కోసారి చాలా పెద్ద మొత్తమే పోయే అవకాశం ఉంది.

## తాయెత్తులు - ధనం

■ వేదాలు, ఉపనిషత్తులు.. అష్టాదశ పురాణాలు, శ్రీరామాయణం, శ్రీమహాభారతము, శ్రీభాగవతము, శ్రీదేవీ భాగవతము, శ్రీభగవద్గీత, సాంఘిక ఆర్థిక శాఖ మహా గ్రంథాల్లోనూ తాయెత్తులు కట్టుకోవటం

వల్ల ధనం వస్తుందన్నది చెప్పలేదు. అలా ఏ పురాణ పురుషుడూ, పూర్వీకులూ ధనం పొందిన నిజ సంఘటన లేదు.

## ప్రేమ ప్లస్ జాగ్రత్త ప్లస్ భయం ప్లస్ సహాయం ప్లస్ గొడవ ఈజీక్వల్ట్

- ప్రేమ + జాగ్రత్త = అమ్మ
- ప్రేమ + భయం = నాన్న
- ప్రేమ + సహాయం = చెల్లెలు, అన్న
- ప్రేమ + గొడవ = తమ్ముడు, అన్న
- లవ్ + జీవితం = భార్య

■ ప్రేమ + జాగ్రత్త + భయం + అక్కా + చెల్లెలు + అన్న + తమ్ముడు + సహాయం + గొడవ + జీవితం = ఫ్రెండ్.

■ ఫ్రెండ్ కన్నా గొప్పది ధనం. ధనం కన్నా గొప్పది ఫ్రెండ్‌షిప్. కానీ ధనం, ఫ్రెండ్ కలిస్తే అంతకు మించిన గొప్పది పృధ్విలోనే లేదు.

## జ్ఞాతి బుద్ధి

- ఏనుగుని పట్టివ్వటానికి ఏనుగే సహకరిస్తుంది.
- మనిషిని నాశనం చేసేది మనిషే.
- ఆడదానికి ఆడదే శత్రువు.
- ఈగోనే సర్వ సమస్యలకీ మూలం.

■ ఆ ఈగోనే సాటి జాతినీ, సాటివారినీ నాశనం చేస్తుంది. ఆ ఈగోలును దాటడం కంటే ఈగోలున్న వారిని మొదట్లో కనిపెడితే మహా నాశనం తప్పుతుంది.





■ ఈ ఈగోనే దుర్యోధనుడు తెలుసుకుని ఉంటే కురుక్షేత్రం జరిగేది కాదు. సర్వనాశనం అయ్యేది కాదు.

## సంపదే ఆరోగ్యము

■ అప్పులు ఆందోళనను పెంచుతాయి.

■ మీరెంత మేధావి అయినా, విద్వత్తు ఉన్నా డబ్బులు అడిగితే చులకన చేసి మాట్లాడతారు.

■ డబ్బులుంటే అంతా మీకు నమస్కారం చేస్తారు. లేచి నిల్చుంటారు. లేకపోతే ఆ పని మీరు చెయ్యాల్సి వుంటుంది.

■ కావలిసినంత ధనం ఉండటం అంటే పూర్తి ఆరోగ్యం ఉన్నట్టే.

■ పది రూపాయలు అని అనుకోకుంటే ఇన్ని సంవత్సరాల నుంచి ఆ పదులని లెక్క వెయ్యండి. పది విలువేంటో తెలుస్తుంది.

■ స్వంత ఇల్లున్నవాడికీ, అద్దె ఇంట్లో ఉన్న వాడికీ చుట్టు పక్కల వారిచ్చే విలువ తెలియనిది కాదు గదా.

■ డబ్బున్న వాడికి లేనివాడు లోకువ.

■ మీ చేతిలో పుష్కలంగా డబ్బున్నప్పటి మానసిక స్థితినీ, ఆ ధనం లేనప్పుడు మానసిక స్థితినీ గమనించండి.

■ ధనాశతో ఇంకా ఇంకా అని భావిస్తే ఆ ధనమే సకల ఆరోగ్యాలనీ దూరం చేస్తుంది.

■ భోజనం విషయంలో, స్త్రీ విషయంలో, ధనం విషయంలో ఏ రోజుకారోజు తృప్తి లేకపోతే అది ఖచ్చితంగా అనారోగ్యమే.

# ధన సంపదనలను తెచ్చే, వృద్ధి చేసే, పోగొట్టే పుట్టు మచ్చలు (పురుషులకి)

■ రెండు కనుబొమ్మల మధ్య పుట్టుమచ్చ భార్యకి కావాల్సినంత బంగారాన్ని సంపాదించే వాడూ, ధనం కలవాడూ అయి ఉంటాడు. బంధుమిత్రులలో మహాగౌరవము. హాని చేయని మనస్తత్వము. నమ్మి ధనాన్ని పోగొట్టుకునే తత్త్వము.

■ నుదుటి కుడిభాగాన ఉంటే ధనం రావటం ఎంతసేపో, పోవటమూ అంతే. ఆకస్మిక ధనప్రాప్తి కలుగుతుంది.

■ కుడి కనుబొమ వద్ద వుంటే ప్రత్యేక అందం గల భార్యని పొందగలరు. ఆడవాళ్ళ విషయంలో శ్రీరాముడిలా ప్రవర్తిస్తారు. ధనం... గుణం, ఇంకా సాహసం కూడా ఎక్కువే.

■ ఎడమ కణత మీద పుట్టు మచ్చ వుంటే ఊహించని అదృష్టం కలుగుతుంది.

■ కుడి కణత మీద పుట్టుమచ్చ గాలవానికి భార్య వల్ల లేదా సహకారం వల్ల ధనవంతుడవుతాడు.

■ కంటి చివరల్లో పుట్టుమచ్చ వుంటే ధైర్యసాహసాలెక్కువ. వచ్చింది పది, ఖర్చు అయింది పది అన్న చందాన ఉంటుంది.

■ తల మీద పుట్టుమచ్చ గలవాడు పదిమందికీ ఆజ్ఞ ఇచ్చే స్థాయిలో ఉంటాడు. అపారమైన తెలివితేటలు కలవాడై అవకాశం వస్తే సద్వినియోగం చేసుకునే మనస్తత్వము. అదే తల ఎడమ భాగాన





వుంటే స్థిరత్వము వుండదు. వచ్చిన ధనం వచ్చినట్టు తరిగిపోతుంది. తలకి ముందు భాగంలో వుంటే ఏ పనిచేసినా లాటరీనే అవ్వచ్చు. రావచ్చు, రాకపోవచ్చు.

■ ముక్కు మీద పుట్టుమచ్చ ఉన్న వానికి భోళాతనం వల్ల ధనం పోతుంది. అందర్నీ నమ్మటం వల్ల సమస్యలూ, చికాకులూ, ఇంకా ఎదుట వాళ్ళకి మంచి చెయ్యబోయి ఇరుకున పడే ప్రమాదం ఉంటుంది.

■ ముక్కు ఎడమ భాగంపై వుంటే ఐహికమైన వాటిపై వ్యామోహం. దాని వల్ల ధనం లోపిస్తుంది.

■ ముక్కు క్రింది భాగాన వుంటే నిర్లక్ష్యం ఎక్కువ. దాని వల్ల తనకి రావల్సిన డబ్బు పోతుంది. అయినా భార్య వల్ల సుఖం, సంతోషం సమృద్ధిగా లభిస్తాయి.

■ ముక్కుకి దగ్గరిలో వుంటే పిల్లలు క్రమశిక్షణ కలిగిన వారై వుంటారు. ఆనందాలన్నా, అలంకారాలన్నా ప్రీతి. సుఖాలకి ఎక్కువ ప్రాధాన్యత.

■ గడ్డము మీద పుట్టుమచ్చ వందమంది చేత కూడా తాను చెప్పింది అవుననిపిస్తాడు. గడ్డం కుడి పక్క పుట్టుమచ్చ వుంటే ధనాన్నీ, కీర్తినీ తెచ్చి పెడుతుంది.

■ పై పెదవి మీద పుట్టుమచ్చ వున్న వాళ్ళు చెప్పింది జరిగి తీరుతుంది. ఆధునిక పోకడలపై మహా ఆసక్తి. మంచి భోజన ప్రియులై ఉంటారు. పై పెదవి లోపల వుంటే మంచి విషయం జ్ఞానం వుంటుంది. క్రింద పెదవిపై వుంటే మంచి చేసినా చెడ్డై చెడ్డ పేరుని తెచ్చి పెడుతుంది.

■ కుడి చెక్కిలిపై పుట్టుమచ్చ ఉన్నవారు తన కష్టాలకన్నా, ఎదుటి వాళ్ళ కష్టాలకి విలవిలలాడతారు.

■ ఎడమ చెక్కిలిపై పుట్టుమచ్చ అనవసర ఆలోచనలను కలిగిస్తుంది. ఆర్థిక ఇబ్బందులెక్కువ.

■ కోపం వస్తే ఎవరని కూడా చూడడు. పిల్లలు మహా ధనాన్నీ, కీర్తిని పొందుతారు.

■ కుడి చెక్కిలికీ, చెవికీ మధ్యనున్న పుట్టుమచ్చ మంచి విజ్ఞానాన్ని కలిగిస్తుంది. అందరితో సౌమ్యం ఇంకా డబ్బు విషయంలో ఆచి, తూచి వ్యవహరిస్తారు.

■ ఎడమ చెక్కిలి చెవికి మధ్య పుట్టుమచ్చ కష్టసుఖాలు కావలి కుండలే.

■ చెవులపై పుట్టుమచ్చ ఉంటే గర్వం అధికం. ధనం కూడా అధికమే. కీర్తి కండూతి ఎక్కువ. చెవి వెనుక వుంటే సుఖ జీవనము. వచ్చే భార్య వల్ల మహా సుఖాలను పొందుతాడు.

■ అదే ఎడమ చెవికొనపై వుంటే ఐహిక వాంఛలధికం. కుడిచెవి క్రింద భాగాన వుంటే కష్టపడటం ద్వారానే దేన్నయినా సాధించగలడు. ఎడమ చెవి క్రింద వుంటే అధిక కోపం. దాని వల్ల అన్ని రకాల సమస్యలు.

■ నాలుకపై వుంటే చెప్పింది జరిగి తీరుతుంది.. కొద్దిగా ఆలస్యమైనా. మంచి మాటలతో ఎంతటి కార్యాన్నయినా విజయం చేసుకుని రాగలడు.

■ అదే నాలుక క్రింద వుంటే తన అభిప్రాయాలనూ, సిద్ధాంతాలనూ పరులపై రుద్ది ఇబ్బంది పెట్టే మనస్తత్వం.

■ మెడ మీద పుట్టుమచ్చ సమస్యలకి వారధి. అదే వెన్నుముక మీద ఉంటే ఖరీదైన జీవితము.





■ గొంతు మీద వుంటే ఆకస్మిక శుభాలు. కంఠంలో ఎక్కడున్నా ధనం సంపాదన విషయంలో తిరుగుండదు.

■ అదే కుత్తుక మీద ఉంటే అపార స్త్రీ సుఖం. కంఠం క్రింద వుంటే తనన ప్రేమించిన వారి వైపు నుంచి ధనరాసులు వస్తాయి.

■ ఛాతీ మీద పుట్టుమచ్చ వుంటే అనగా కుడి స్తనము మీద వుంటే తుఫానులో పడవ ప్రయాణమే.

■ ఎడమ స్తనం మీద వుంటే స్వశక్తి మీద ఆధార పడే మనస్తత్వము. దాని ద్వారానే సంపదలను పొందుతాడు.

■ రెండు స్తనాల మధ్య వుంటే మహా కీర్తి గలవాడు, ధనం గలవాడు అవుతాడు.

■ రొమ్ము భాగాల్లో ఉంటే సుఖాలూ, కష్టాలూ సరిసమానమే. ఎంత సంపాదించినా ధనం ఖర్చులకే సరిపోతుంటుంది.

■ ఇక కడుపు మీద ఉంటే ప్రవర్తన ద్వారానే మంచైనా, చెడైనా జరుగుతుంది. కడుపు మధ్యలో వుంటే సంపాదన కూడా మధ్యస్థంగానే వుంటుంది.

■ బొడ్డు మీద వుంటే అన్ని రకాలైన వ్యామోహాలు అధికం. నిలకడలేనితనం. ఒక్కోసారి దానివల్లే ధనం, ఇంకా విలువైనవి పోయే అవకాశం.

■ కుడిచంకలో పుట్టుమచ్చ ధన సంపాదనలో వెనక్కి తిరగనియ్యదు. ఎడమ చంకలో పుట్టుమచ్చ 'మ' కారాలపై ప్రీతి. వాటి వల్లే ఎంత సంపాదించినా ధనం నిల్వ ఉండదు.

■ భుజములపై పుట్టుమచ్చ దేన్నైనా భరించే మనస్తత్వాన్ని కలిగి ఉండటం వల్ల విజయం.. అపజయం సరిసమానమే.

■ కుడి భుజాలపై పుట్టుమచ్చ కనీస అవసరాలకి లోటు లేకుండా ధనం వచ్చేలా చేస్తుంది. అదే ఎడమభుజంపై పుట్టుమచ్చ డబ్బుపోయినా సరే పంతం గెలవాలన్న తత్వము.

■ కుడి చేతిమీద పుట్టుమచ్చ గలవారు పని ప్రారంభిస్తే పూర్తి చేయందే నిద్రపోరు.

■ ఆ పట్టుదల సడలించకపోతే వారే మహా ధనం కలవారు అవుతారు. అదే ఎడమ చేతి మీద పుట్టుమచ్చ మహా కష్టం పడటం వల్లే ధనవంతులవగలరు.

■ మోచెయ్యి మీద పుట్టుమచ్చ నిర్ణయాలని స్థిరంగా వుంచదు. అయితే వీరికి ప్రోత్సాహం ఇస్తే ఏదైనా సాధించగలరు.

■ మణికట్టు మీది పుట్టుమచ్చ మహా కరుణనూ, జాలినీ కలిగిస్తుంది. వాటి వల్ల ఒక్కోసారి ధనం పోతుంది. ధనమెంత పోయినా సుఖశాంతులకి లోటు వుండదు.

■ అరచెయ్యి మీద పుట్టుమచ్చ ధనాన్ని ఎక్కువగా రానీయదు. ఎక్కువగా పోనీయదు. మధ్య వేలిమీద వుంటే సుఖాల కోసం ఎంత ధనమైనా ఖర్చు పెట్టే తత్వము.

■ వేళ్ళ మీద పుట్టుమచ్చ పదిమందిపై ఆధిపత్యము. ఉంగరం వేలిమీద వుంటే దైవభక్తి ఎక్కువ. చిటికిన వేలిపై వుంటే ధన సంపాదనలో తిరుగుండదు.

■ వీపు మీద పుట్టుమచ్చ గలవారు మహా తెలివితేటలు గలవారై ఉంటారు. దాని వల్ల ధనం, కీర్తినీ సంపాదిస్తారు. అలాగే గుండె ధైర్యం ఎక్కువ. దేనికీ భయపడే తత్వము కాదు. రానీయ్.. వచ్చినప్పుడు చూసుకుందాము అనే తత్త్వము.





■ పిరుదుల మీద పుట్టుమచ్చ తెలివినీ, లౌక్యాన్నీ, పరపతినీ ఇస్తుంది.

■ తొడల మీద పుట్టుమచ్చ వుంటే భోగాలూ, సుఖాలూ తలుపు దగ్గరే వేచి ఉంటాయి. మహా సౌఖ్యాలను పొందుతారు. స్త్రీ వల్ల ధనం.

■ పాదాల మీద అనగా కుడిపాదాన కుడి వైపున ఉంటే మంచి గుణవంతురాలైన భార్య వస్తుంది.

■ ఎడమ కాలి పాదం ఎడమ వైపున వుంటే బంధువుల వల్లా, స్నేహితుల వల్లా మహా ఖర్చు. భార్యని సంతోషంగా ఉంచకపోతే తాను సంతోషంగా ఉండలేదు.

■ అరికాలి మీద పుట్టుమచ్చ వున్న వాళ్ళకి విహార ప్రదేశాలన్న మక్కువ. దానికి సంబంధించిన వాటికే ఎక్కువ ధనమూ, సమయమూ ఖర్చు పెడతారు. పాదాల క్రింద పుట్టుమచ్చ ఉంటే 'మ'తో ప్రారంభమయ్యే వాటిపై మమకారాలు ఎక్కువ.

## ధన సంపదను తెచ్చే, వృద్ధి చేసే, పోగొట్టే పుట్టు మచ్చలు (స్త్రీలకి)

■ రెండు కనుబొమ్మల మధ్య వుంటే మహా ఐశ్వర్యాలు.

■ ఎరుపురంగు పుట్టు మచ్చలు సకల శుభకరాలు. భర్త మంచి సంపాదనపరుడవుతాడు.

■ నుదుటి ఎడమవైపున వుంటే మహా కష్టాలు. తేనె రంగు పుట్టు మచ్చలు అష్టకష్టాలను కొనితెస్తాయి. అయితే చివరన ఆ స్థాయిలోనే సుఖాలను తెస్తాయి.

■ ఎడమ చెక్కిలి మీద పుట్టు మచ్చ వుంటే మహా భోగాలనుభవిస్తుంది. కావల్సిన ధనం పెట్టింటి నుంచో, మెట్టినింటి నుంచో ఏదో వైపు నుంచి వస్తుంటుంది.

■ పై పెదవి మీద పుట్టు మచ్చ అదృష్టాన్ని తెచ్చి పెడుతుంది. అలాగే ఐహిక సుఖాలపై వ్యామోహం కూడా. సుఖాలపై వ్యామోహాలే మహా భయంకర కష్టాలు తెచ్చిపెడతాయి.

■ పై పెదవి లోపలుంటే పూజాలూ, పునస్కారాలపై మక్కువ ఎక్కువ.

■ నాలుక మీద పుట్టుమచ్చ సరస్వతి వరమే.

■ నాలుక క్రింద భాగాన వుంటే ధనం ఖర్చు కాదు. కావల్సినవన్నీ కావల్సినవాళ్ళంతా సమకూర్చి పెడతారు.

■ దవడ మీద వుంటే సాదాసీదా జీవితం. అయితే ఎప్పుడూ అదే మధ్య తరగతి జీవితం ఉండదు.

■ కుడి దవడ మీద పుట్టుమచ్చ కష్టాలకి చిరునామా. అయితే తాత్కాలికమే. మళ్ళీ సుఖాలూ, మళ్ళీ కష్టాలు.

■ గడ్డం మీద పుట్టుమచ్చ ఉన్నవారికి సరిపడినంత ధనం ఇచ్చే వాడు భర్తగా లభిస్తాడు.

■ ముక్కు మీద పుట్టుమచ్చ వుంటే చేసే పనులన్నీ దాదాపు విజయం. అందరికీ చెప్పే స్థితిలో వుంటుంది. ఆమె సంతానం మహా కీర్తి వంతులవుతారు. ధనార్జన పరులవుతారు.

■ కంఠం మీద వుంటే తనకి కావల్సిన సకల సౌకర్యాలు అందుబాటులో ఉంటాయి.

■ స్తనాల మీద పుట్టుమచ్చ ఆయుష్షును కలుగచేస్తుంది.





■ కుడిస్తనం మీద సుఖం.... ఎడమ స్తనం మీద పుట్టుమచ్చ దుఃఖం ఎక్కువుగా కలిగిస్తుంది.

■ చంకల్లో పుట్టుమచ్చ కామోద్రేకం ఎక్కువ. అదే ఎడమ చంక కింద వుంటే ధనలాభం. నలుగురికీ మంచి చేసే బుద్ధి.

■ కుడి భుజం మీద పుట్టుమచ్చ కోపం, ఆవేశం, కరుకుతనాన్ని కలిగిస్తుంది. కోపావేశాలను తగ్గించుకుంటే వారికి తిరుగు ఉండదు. ఎడమ భుజం మీద వుంటే డబ్బుకి కొదవ వుండదు.

■ మోచేతి మీద వుంటే తలబిరుసుతనము ఎక్కువ.

■ మణికట్టు మీద పుట్టుమచ్చ స్థిరాస్తులకి యజమానురాలిని చేస్తుంది.

■ అరచేతుల్లో పుట్టుమచ్చ సంగీత సాహిత్యాలపై మక్కువ కలిగిస్తుంది. లేదా మంచి భోజన ప్రియులై ఉంటారు. పదిమందికీ పెట్టడానికి వెనుకాడరు.

■ బొడ్డు మీద పుట్టుమచ్చ వున్న వాళ్ళు అత్తింటికి లక్ష్మిని తీసుకువస్తారు.

■ పిరుదుల మీద మచ్చ ఉన్న వారు భోగభాగ్యాలను భర్త ద్వారా అనుభవిస్తారు.

■ మోకాళ్ళ మీద పుట్టుమచ్చ దూకుడుతనం వున్నా సుఖ జీవనానికి లోటు వుండదు. భర్త చెప్పిన మాట వింటాడు.

■ ఎడమకాలి మీద పుట్టుమచ్చ వున్న వారు తీర్థయాత్రలూ, పూజలూ, వ్రతాలూ ఇంకా విహార యాత్రలపై ఆసక్తి.

■ కడుపు మీద పుట్టుమచ్చ గలవారు పిల్లల వల్ల సుఖాలని పొందుతారు.

■ మంగళసూత్రం ఉన్న దగ్గర పుట్టుమచ్చ వున్న వారికి భర్త వల్ల రావాల్సిన సకల సుఖాలూ, భోగాలూ సమృద్ధిగా కలుగుతాయి.

■ చీలమండ మీద పుట్టుమచ్చ మహా ఆర్థిక బాధలను తెచ్చి పెడుతుంది. సుఖాల కంటే కష్టాలే ఎక్కువ.

■ కుడికాలి చీల మండ మీద పుట్టు మచ్చ తన పని తాను చూసుకునే మనస్తత్వం కలిగిస్తుంది.

■ కుడికాలి మీద పుట్టు మచ్చ వున్న వాళ్ళకి నగలన్న మహా మహా ప్రీతి. ఆమె అడుగు పెట్టిన ఇల్లు కుబేరుని ధనాగారమే.

■ ఎడమపాదానికి ఎడమవైపు వుంటే మహా అభిమానవంతురాలు. వినయ విధేయతలతో పాటు ప్రత్యేకమైన అందము వుంటుంది.

■ అదే ఎడమపాదాలపైన పుట్టు మచ్చ వుంటే మహా అనారోగ్యాలు. అలాగే అదే స్థాయిలో మహా సుఖాలను కూడా పొందుతుంది. అదే కుడి పాదం ఎడమ భాగంలో వుంటే సాదాసీదా జీవితం.

■ ఎడమ పాదానికి కుడివైపు ఉంటే భర్తతో మహా సౌఖ్యాలు, అదే ఎడమపాదం ఎడమవైపున ఉంటే స్థిరాస్తులా, సంపదలను భర్త సంపాదిస్తాడు. మంచి సుగుణ వంతురాలని అందరిచేత పొగిడించుకుంటుంది.

■ వారి పుట్టుమచ్చల ఫలాన్ని పుట్టు మచ్చల శాస్త్రం ఆధారంగా తెలియచేయబడుతుంది. ఒక పుట్టుమచ్చ చెడును సూచించినా మరో చోట వుండే పుట్టుమచ్చ ఆ దోషాన్ని పోగొడుతుంది. అరిష్టాల్ని తొలగిస్తుంది. శుభాలని తెస్తుంది.







# అష్టలక్ష్మీ స్తోత్రమ్

## ఆదిలక్ష్మి

సుమనసవందిత సుందరిమాధవి
చంద్రసహోదరి హేమమయే
మునిగణమండిత మోక్షప్రదాయిని
మంజులభాషిణి వేదనుతే ।
పంకజవాసిని దేవ సుపూజిత
సద్గుణవర్షిణి శాంతియుతే
జయ జయహే మధుసూదనకామిని
ఆదిలక్ష్మి సదా పాలయమామ్ ॥



## ధాన్యలక్ష్మి

అయి కలికల్మషనాశిని కామిని
వైదికరూపిణి వేదమయే
క్షీరసముద్భవ మంగళరూపిణి
మంత్రనివాసిని మంత్రనుతే ।
మంగళదాయిని అంబుజవాసిని
దేవగణాశ్రిత పాదయుతే
జయ జయహే మధుసూదనకామిని
ధాన్యలక్ష్మి సదా పాలయమామ్ ॥

## ధైర్యలక్ష్మి

జయవరవర్ణిని వైష్ణవి భార్గవి
మంత్రస్వరూపిణి మంత్రమయే
సురగణపూజిత శీఘ్రఫలప్రద
జ్ఞానవికాసిని శాస్త్రనుతే ।
భవభయహారిణి పాపవిమోచని
సాధుజనాశ్రిత పాదయుతే
జయ జయహే మధుసూదనకామిని
ధైర్యలక్ష్మి సదా పాలయమామ్ ॥

## గజలక్ష్మి

జయజయ దుర్గతినాశిని కామిని
సర్వఫలప్రద శాస్త్రమయే
రథగజ తురగ పదాతి సమావృత
పరిజనమండిత లోకనుతే ।
హరి హర బ్రహ్మ సుపూజితసేవిత
తాపనివారిణి పాదయుతే
జయ జయహే మధుసూదనకామిని
గజలక్ష్మి సదా పాలయమామ్ ॥





## సంతానలక్ష్మి

అయి ఖగవాహిని మోహిని చక్రిణి
రాగవివర్ధిని జ్ఞానమయే
గుణగణవారిధి లోకహితైషిణి
స్వరసప్తాంచితగాననుతే ।
సకలసురాసుర దేవమునీశ్వర
మానవ వందిత పాదయుతే
జయ జయహే మధుసూదనకామిని
సంతానలక్ష్మి సదా పాలయమామ్ ॥

## విజయలక్ష్మి

జయ కమలాసని సద్గతిదాయిని
జ్ఞానవికాసిని గాన మయే
అనుదినమర్చిత కుంకుమ ధూసర
భూషితవాసిత వాద్యనుతే ।
కనకధారాస్తుతి వైభవవందిత
శంకర దేశిక మాన్యపదే
జయ జయహే మధుసూదనకామిని
విజయలక్ష్మి సదా పాలయమామ్ ॥

## విద్యాలక్ష్మి

ప్రణతసురేశ్వరి భారతి భార్గవి
శోకవినాశిని రత్నమయే
మణిమయభూషిత కర్ణవిభూషణ
శాంతి సమావృత హాసముఖీ ।
నవనిధిదాయిని కలిమలహారిణి
కామితఫలప్రద కరాబ్జయుతే
జయ జయహే మధుసూదనకామిని
విద్యాలక్ష్మి సదా పాలయమామ్ ॥

## ధనలక్ష్మి

ధిమిధిమి ధింధిమి ధింధిమి ధింధిమి
దుందుభినాద సుపూర్ణమయే
ఘుమఘుమ ఘుంఘుమ ఘుంఘుమ ఘుంఘుమ
శంఖనినాద సువాద్యనుతే ।
వేదపురాణకథాగణ పూజిత
వైదికమార్గ నిదర్శయుతే
జయ జయహే మధుసూదనకామిని
ధనలక్ష్మి సదా పాలయమామ్ ॥





## ఒక్కటి వర్క్అవుట్ అయితే చాలు

■ మురికి గుంటలో చాపలు పడితే ఎప్పటికీ సంపదలు పొందలేరు.

■ అద్భుతం చేయాలి. మీ మీ రంగాలలోని వారంతా 'ఆం' అని ఆశ్చర్యపోవాలి.

■ లక్షలమందికి మీరు చేసింది తెలియాలి. అది సక్సెస్ అయినా ఫెయిల్యూర్ అయినా సరే. అపజయం లోంచే విజయం ఉద్భవిస్తుంది.

■ ఒక్క ఆలోచనే కాదు ఒక్క ఆచరణ కూడా మహాద్భుతాలని సృష్టించి మిమ్మల్ని హీరోని చేస్తుంది.

## కలహం కలిమిని మింగేస్తుంది

■ వ్యాసభగవానుడు ధృతరాష్ట్రునికి చెబుతాడు. "పుత్రా! ధనం వున్నా, శక్తి వున్నా, బలం వున్నా కలహంలో విజయం సాధిస్తామనేది భ్రమ. దైవబలం లేకుంటే ఆ మూడూ వున్నా మిగిలేది, కలిగేది పతనమే." అందుకనే కలహం మంచిదికాదని మన పెద్దల ప్రవచనం.



## క్షమా - ప్రార్థన

అపరాధ సహస్రాణి క్రియంతేఽ హర్నిశం మయా ।
దాసోఽ యమితి మాం మత్వా క్షమస్వ పరమేశ్వరి ॥
అపరాధ భవంత్యేవ తనయస్య పదేపదే ।
కోఽ పరస్సహతే లోకే కేవలం మాతరం వినా ॥
యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం తు యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవి నారాయణి నమోఽస్తుతే ॥

■■■